# ఏరిన ముత్యాలు

★ వివాహ గ్రంథంలో మొదటి అధ్యాయం అంతా పద్యాత్మకము, మిగిలిన అధ్యాయం గద్యమయం.

–నికోలస్

★ వివాహ జీవితం ఒక రణరంగం. మెత్తటి పూల పాన్పుకాదు.

–స్టీవెన్సన్

★ పురుషులు తమ స్వాతంత్ర్యాన్ని, స్త్రీలు తమ సౌఖ్యాన్నీ ఒడ్డి ఆడే జూదమే వివాహం.

–మాడెమ్ డెరియి

★ తరువాత సగం తెరచి చూసినా వివాహానికి ముందు మాత్రం కళ్ళు తెరచి చూడు.

–బెంజిమిన్

★ వివాహం పురుషుణ్ణి రాక్షసుణ్ణి చేస్తుంది. స్త్రీని బానిసని చేస్తుంది.

–ఎడ్వర్డ్ కార్పెంటర్

★ పెళ్ళి ఒకసారి చేసుకోవడం ధర్మం! రెండుసార్లు చేసుకోవడం అవివేకం! మూడుసార్లు చేసుకోవడం ఉన్మాదం!

–డచ్ సామెత

★ యౌవనారంభ వివాహం తల్లితండ్రులకి ఆనందాన్నిస్తే, సరియైన సమయంలో వివాహం దంపతులకి స్వర్గతుల్యమైతే, ఆలస్యపు వివాహం ఇరుగు పొరుగువార్కి ఆనందాన్నిస్తుంది.

–ఇంగ్లీషు సామెత

★ భార్యను ఎన్నుకోవడంలో కంటికంటే చెవినుపయోగించు.

–టర్కిష్ సామెత

★ తొందరపడి పెళ్ళిచేసుకుంటే తీరిగ్గా పశ్చాత్తాపపడక తప్పదు.

–విలియమ్ కాంగ్రీవ్

★ వివాహం జీవితాంతం ఉండేది. తగవు తాత్కాలికం.

–టాగూర్

★ చేతిలో ఛత్రం ఉంటే వాన చినుకులేమీ చేయలేవు. ప్రజల అనురాగ ఛత్రం కింద ఉన్న పాలకులనూ ఎవరూ ఏమీ చేయలేరు.

–భోజచరిత్ర

★ నిజాలను మనం నిర్లక్ష్యం చేస్తే అవి రెట్టింపు శక్తితో ప్రతీకారం తీర్చుకుంటాయి.

–సర్దార్ వల్లభాయి పటేల్

సేకరణ: పి. ఝాన్సీరాణి

# చతుర కతలు

## ఎవరికి

ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న పెక్కు యూనివర్శిటీల్లో అదొకటి. అది స్థాపించి పాతికేళ్లు అయిన సందర్భంగా ఆ యూనివర్శిటీ నిర్వహణలో ప్రముఖపాత్ర వహించే అతి ముఖ్యమైన వ్యక్తికి ఓ బంగారు రిస్ట్‌వాచ్‌ని బహూకరించాలని ఆ యూనివర్శిటీ రిజిస్ట్రారు తలపెట్టాడు. ఆయన నిజాయితీపరుడు కాబట్టి యూనివర్శిటీకి సంబంధించిన అన్ని విభాగాల్లో పనిచేసేవాళ్లకీ ఈ విషయం తెలియచేశాడు. అంతా కలిసి 'అలాంటి వ్యక్తి' ఎవరో తేల్చుకుందామని ఫలానా టైముకి యూనివర్శిటీ కాన్ఫరెన్స్ హాల్లో సమావేశం అవుదామని నోటీసు పంపాడు.

ఎవరికి వారు తమకే ఆ గోల్డ్ మెడలు రావాలని కోరుకుంటూ అందుకు తమ ఆర్గ్యుమెంటుని ఆ సమావేశంలో ఎలా ప్రజంట్ చేయాలా అని ఆలోచించుకోసాగారు.

శనివారం మధ్యాహ్నం మూడున్నరకి అంతా సమావేశం అయ్యాక రిజిస్ట్రారు మరోసారి తన మనసులోని కోరికని స్పష్టంగా తెలియచేశారు.

ఆ చర్చను ప్రారంభిస్తూ మొదటగా స్టూడెంట్స్ యూనియన్ నాయకుడు లేచి నిలబడి చెప్పాడు.

"విద్యార్థులు లేకపోతే యూనివర్శిటీ నడవదు కాబట్టి యూనివర్శిటీ నిర్వహణలో ప్రధానపాత్ర విద్యార్థిదే అని చెప్పాలి. కాబట్టి విద్యార్థుల యూనియన్ నాయకుడనైన నాకు ఆ వాచ్ చెందుతుందని నా అభిప్రాయం."



అతను కూర్చున్నాక ప్రొఫెసర్స్ సంఘ అధ్యక్షుడు లేచి నిలబడి చెప్పాడు.

"అయ్యా! విద్యార్థులు మాత్రమే ఉంటే యూనివర్శిటీ నడవదు. వాళ్లకి విద్యను బోధించే గురువులు లేకపోతే ఏ యూనివ

ర్శిటీ మనజాలదు కాబట్టి ప్రొఫెసర్స్ యూనివర్శిటీ నిర్వహణలో ప్రధాన పాత్రను వహిస్తారని చెప్పవచ్చు. నా పాయింట్‌ని అంతా ఒప్పుకుని ఆ వాచ్‌ని ప్రొఫెసర్స్ యూనియన్ ప్రెసిడెంట్‌నయిన నాకు ఇవ్వవలసిందిగా మనవి చేసుకుంటున్నాను."

తర్వాత వాచ్‌మెన్ లేచి నిలబడి చెప్పాడు.

"అయ్యా! విద్యార్థులు, ప్రొఫెసర్లకన్నా నేను ముఖ్యం. నేను ఉదయమే లేచి కళాశాల గేటు తీస్తేకాని వాళ్ళకి లోపలకి ప్రవేశం లేదు. క్లాసుగదుల తాళాలు తీస్తేగాని వాళ్ళిద్దరూ లోపల కూర్చోలేరు. కాబట్టి యూనివర్శిటీ నిర్వహణలో పెద్దపీట నాదని అభిప్రాయం. పైగా వాచ్‌మెన్ అయిన నాకు వాచ్‌కూడా లేదు."

ఆ తర్వాత లేబ్ అసిస్టెంట్లు, ఆఫీసు స్టాఫ్, స్వీపర్లు, గంట కొట్టేవాడు, సైకిలు స్టాండు కీపరు మొదలైన వాళ్లుకూడా లేచి యూనివర్శిటీ నిర్వహణపాత్రలో తమ ప్రాముఖ్యాన్ని వివరిస్తూ ఆ వాచ్ తమకే చెందాలని చెప్పారు.

అందరి పాయింట్స్ రాసుకున్న రిజిస్ట్రారుకి అన్నీ సబబుగానే తోచాయి. వాళ్లలో ఎవర్ని ఎన్నిక చేయాలో ఓ పట్టాన బోధపడలేదు ఆయనకి.

ఈలోగా ఆయన నేచర్ కాల్‌కి వెళ్లాల్సి వచ్చింది. లేచి బాత్‌రూమ్ తలుపు తెరుచుకుని లోపలకి వెళ్లాడు. బయటకి వచ్చాక అడిగాడు అందరి వంకా చూస్తూ.

"ప్లంబర్ ఈ సమావేశానికి హాజరు కాలేదా? "

"లేదండీ."

"యూనివర్శిటీ నిర్వహణలో అతి ప్రముఖ పాత్ర వహించేది ప్లంబరే. అతనికే ఈ వాచ్‌నివ్వాలని తీర్మానించాను" చెప్పాడాయన.

"అదేంటి సార్! అసలు ఈ సమావేశానికే వచ్చి నోరు విప్పని ఆఫ్టరాల్ ఓ ప్లంబర్‌కి ఆ వాచ్‌నియ్యడమా? " అంటూ ఆశ్చర్యపోయారంతా

"ప్లంబర్ రాకపోయినా తన ఆర్గ్యుమెంట్ చక్కగా వివరించాడు. మీరంతా ఓసారి ఆ బాత్‌రూమ్‌లోకెళ్లి చూసిరండి." చెప్పారు రిజిస్ట్రారు చిరునవ్వుతో

ఒక్కొక్కరే లోపలకి వెళ్లి వెంటనే ముక్కు మూసుకుని అసహ్యంగా మొహంపెట్టి బయటికి వచ్చారు.

రిజిస్ట్రారు చెప్పిందాంట్లో సత్యం గ్రహించాక అప్పటిదాకా ఓ మూలనున్న ప్లంబరు వచ్చి ఆ వాచ్‌ని అందుకున్నాడు.

-యం.లిపి

## పసుపుతాడు

బి.వి.ఎస్. రెసిడెన్షియల్ కాలేజ్ తెలుగు డిపార్ట్‌మెంట్‌లో బోయ్ తెచ్చిన టీ తాగుతూ రిలాక్స్ అవుతూ కూర్చున్నాడు తెలుగు లెక్చరర్ శాస్త్రి. అప్పుడే క్లాసు ముగించుకుని పరుగులాంటి నడకతో పంచెగోచి ఎగదోపుకుంటూ వచ్చాడు సంస్కృత లెక్చరర్ శర్మ.

"ఏమోయ్ శాస్త్రీ! అక్కడ కొంపలంటుకుపోతుంటే ఇక్కడ తాపీగా టీ తాగుతూ కూచున్నావా? " రావడంతోటే యక్షప్రశ్నలు మొదలెట్టాడు శర్మ తన సహజధోరణిలో.

"ఏం కొంపలు? ఎలా అంటుకున్నాయి? ఫైరింజన్ని పిలవాలా ఏమిటి? " అన్నాడు శాస్త్రి వ్యంగ్యంగా.

"నీ వెటకారం ఆపవయ్యా. నీకన్నీ తమాషాలే! ఏం జరుగుతుందో ఏమోనని భయపడి ఛస్తున్నాను." చమటనద్దుకుంటున్నాడు శర్మ.

"ఏంజరిగింది శర్మా? " కాస్త కంగారుగా అడిగాడు శాస్త్రి.

"మొన్న టౌనుకెళ్లినప్పుడు ఆ ఇంజనీరుగా రమ్మాయి నిరోషాకు పసుపుకొమ్ము తెచ్చిపెట్టావా? "

"తెచ్చిపెట్టాను ఆ అమ్మాయి అడిగితేను..."

"ఆ పసుపుకొమ్ముతోనే కొంపలంటుకున్నాయి."

"పసుపుకొమ్ముతో కొంపలంటుకోవడమేమిటి విడ్డూరంగా" అడిగాడు శాస్త్రి కాస్త వ్యంగ్యం, ఆత్రం మిళితమైన కంఠంతో.

"ఆ అమ్మాయి పసుపుకొమ్ము ఎందుకు అడిగిందంటావ్? " సాగదీశాడు శర్మ.

"ఆడపిల్లలు పసుపుకొమ్ము ఎందుకడుగు




తారండీ? ముఖానికి రాసుకోవడానికో, స్నానానికో అడిగిఉంటుంది." సత్యం తెలుసుకున్న వేదాంతిలా అన్నాడు శాస్త్రి.

"నీ అమాయకం పాడుగాను! ఇంత చాదస్తుడివి కనుకనే ఆ అమ్మాయి నీతోనే తెప్పించుకుంది పసుపుకొమ్ము" వెటకారంగా అన్నాడు శర్మ.

"సుత్తి ఆపి త్వరగా ఏం జరిగిందో చెప్పి ఏడవచ్చుగదా!" కసిరాడు శాస్త్రి.

"చెబుతాను. కానీ తెలుసుకదా నేను ఏదైనా చెప్పాలంటే..." అర్థోక్తిగా నవ్వాడు శర్మ.

"తెలుసు మహానుభావా! తెలుసు. నీవడిగే ప్రశ్నలకు పొడి సమాధానాలు చెబుతుండాలి. చెప్పు."

"నేనిందాక క్లాసుకు వెళ్లానా? "

"వెళ్లావు."

"పాఠం చెబుతున్నానా? "

"తున్నావు"

"సుద్దముక్క తీసుకుని బోర్డువైపు తిరిగానా? "

"తిరిగావు"

"యల్లో త్రెడ్! యల్లోత్రెడ్! యల్లోత్రెడ్!!! అని కామెంట్ చేశారు... ఎవరని అడగవేం? "

"ఎవరు? "

"ఎవరో ఎలా తెలుస్తుంది అందరిలో. వెనక్కి తిరిగి చూశాను. నో కామెంట్స్. మళ్లీ బోర్డువైపు తిరిగాను. యల్లోత్రెడ్! యల్లోత్రెడ్!! యల్లోత్రెడ్!!! అని కామెంట్స్. వెనక్కి తిరిగి చూశాను. నో కామెంట్స్. అపుడు నేనేం చేశానో తెలుసా? "

"తెలీదు. ఏంచేశావు?" ఆసక్తి కనపరి చాడు శాస్త్రి.

"పరీక్షగా చూశాను. నిరోషా మెడలో పసుపుతాడుకి వేలాడుతోంది పసుపు కొమ్ము. నాకు సీను అర్థమైంది. ఇంతలో గంట కొట్టారు. ఇలా వచ్చాను" జరిగిం దంతా వివరించాడు శర్మ.

"ఆ అమ్మాయి చాలా తెలివైన అమ్మాయి. బాగా చదువుకునే అమ్మాయి. ఎందుకిలా చేసిందంటావు శర్మా?"

"వయసయ్యా! వయసలాంటిది..."

"ఇంతకీ ఆ అమ్మాయి మెళ్లో పసుపు తాడు ఎవరు కట్టి ఉంటారు చెప్మా!" సాలో చనుడయ్యాడు శాస్త్రి.

"ఇంకెవరూ? దాని లవర్ వంశీగాడే కట్టి ఉంటాడు."

"దీన్ని ఫాలో అయి అందరూ ఇలానే చేస్తే ఏమవుతుందో ఊహించావా?"

"ఆ... దొంగ పెళ్లిళ్లు, దొంగ శోభనాలూ జరిగిపోయింతర్వాత మన వార్డెన్ గారు మామిడికాయలు, చింతకాయల వ్యాపారవు తాడు. మనం వీళ్లకు మంత్రసానులవుతాం" ఆవేశంగా అన్నాడు శర్మ.

"వీళ్లిలా పసుపుతాడు మెళ్లో వేసుకుని వాంతులు చేసుకున్నారనుకో. ఇహ తల్లితం డ్రులెవరూ తమ పిల్లలను ఈ కాలేజీలో చేర్చరు. ఉన్నవాళ్లను కూడా తీసుకెళ్లిపో తారు. కాలేజీ మూత పడుతుంది. మన ఉద్యోగాలు ఊడతాయి. కొంపలంటుకుపో తాయి..." తన అవగాహనను ఉపన్యాస రూపంలో వెళ్లబోసుకున్నాడు శాస్త్రి.

"అందుకే ఆలస్యం చెయ్యకుండా ఈ విష యంలో యాక్షన్ తీసుకోమని ప్రిన్సిపాల్‌గా రికి రిపోర్ట్ చేద్దాం పద!"

"పద"

ఆఫీసురూమ్‌లో ప్రిన్సిపాల్ శివారెడ్డి, లెక్చరర్ శాస్త్రి, శర్మ కూర్చొనున్నారు. దోష ల్లాగా నిరోషా, వంశీ నిలబడి ఉన్నారు. వాకిట్లో ప్యూను శంకరయ్య నిలబడి ఓరకం టితో లోపల ఏంజరుగుతోందోనని గమని స్తున్నాడు.

"ఏం నిరోషా! బాగా చదువుకునే పిల్లవు నీకెందుకు పుట్టిందీ పాడుబుద్ధి?" సూటిగా ప్రశ్నించాడు ప్రిన్సిపాల్ శివారెడ్డి.

"ఏమిటిసార్! ఏమిటిమీరనేది?" అమా యకతనటిస్తూ అడిగింది నిరోషా.

"కాలేజీ పరువు మంటకలిపి, ఏమీ తెలి యని నంగనాచిలామాట్లాడతావా?" అందు కున్నాడు శర్మ.

"మీరేం మాట్లాడుతున్నారో నాకర్థంకావ డంలేదు సార్!"

"ఎలా అర్థమవుతుంది తల్లీ? వయసులో ఉన్నావ్ కదా! కళ్లు నడినెత్తికెక్కి మెడలో పసుపుతాడు కట్టించుకుని ఊరేగుతున్నావు కదా..." ఎకసక్కెంగా అన్నాడు శాస్త్రి.

"నీ మెడలో పసుపుతాడు కట్టింది ఈ వంశీ గాడేనా?" రెచ్చిపోయి అడిగాడు ప్రిన్సిపాల్.

"సారీ సార్! వంశీ నా అన్నలాంటివాడు సార్!" గాద్గదికంగా పలికింది నిరోషా.

"ఛా నోర్ముయ్! చేసిన పాడుపని చాలక అన్నాచెల్లెళ్ల బంధాన్ని అపవిత్రం చేస్తావా?" ఆవేశంగా అన్నాడు శర్మ.

"మదర్‌ప్రామిస్ సార్! నిరోషా నా చెల్లె లులాంటిది సార్..." నమ్మకంగా చెప్పాడు వంశీ.

"అయితే నీ మెళ్లో పసుపుతాడు కట్టిన వాడెవడో చెప్పు." సహనం కోల్పోయి గట్టిగా అరిచాడు శివారెడ్డి.

"సార్! మీ డౌట్ ఈ పసుపుతాడు గురిం చేకదా! వివరంగా చెబుతాను. కానీ ముందు నేనడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పాలి" అంటూ మౌనంగా మెడలోని పసుపుతాడు తీసి ప్రిన్సిపాల్‌గారి టేబిల్ మీద ఉంచింది.

"ఏమిటో... ఆ ప్రశ్నలు?" వెక్కిరింపుగా అడిగాడు శాస్త్రి.

"ఈ నెల పేరేమిటి? ఈ రోజు ఎన్నవ

తేదీ?" అని అడిగి నిష్క్రమించింది నిరోషా.

ఒక్క నిముషం ఆలోచించి "అంటే మన మంతా...." మధ్యలోనే ఆపేసి ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు రెడ్డి, శర్మ, శాస్త్రి.

వాకిట్లో నిలుచున్న శంకరయ్య కిసుక్కున నవ్వాడు.

–వి.చంద్రశేఖర్

## హోమ్లీ

అదో పట్నవాసమూ, పల్లెటూరూ కాని మధ్యస్తపు ఊరు. పంచాయితీకి ఎక్కువ, మున్సిపాలిటీకి తక్కువ. ఆ ఊళ్లో పోస్టింగ్ అయింది గురునాథరావుకి. బి.ఎడ్ చేసి ఉద్యోగం కోసం ఎదురుచూసి... చూసి.. కళ్లకు కళ్లజోడు, ఇంటికి ఆడతోడూ రావడం జరిగింది కానీ ఉద్యోగం మాత్రం రాలేదు. ప్రభుత్వోద్యోగానికి వయసు మారుతున్న తరుణంలో ఏ దేముడి కరుణో ఏ దేవత వరమో.... ఓ బుజ్జిబాబుకి కన్నతండ్రి అయిన సమయంలో ఉద్యోగం వచ్చింది గురునాథరావుకి. అబ్బాయిపుట్టిన వేళావిశేషమన్నారు అందరూ.

కొత్తకాపురం పెట్టాలంటే "మనవడికయిదో నెల రాందే అమ్మాయినెలా పంపుతాం" అంటూ అత్తవారు అడ్డువేయడంతో ఒంటరిగానే రావాల్సివచ్చింది. స్కూలుకి దగ్గరగానే ఒక రూమ్ తీసుకున్నాడు. వంట చేసుకుందామంటే తనకది అంతుబట్టని ఆర్టాయె. ఏ హోటల్ నుంచో ఏ పూటకూళ్ల కొంపనుంచో కేరేజీ తెప్పించుకోవడం మినహా చేసేదేముందనుకున్నాడు.

"ఆ.. ఏమండీ గుర్నాథంగారూ! ఎలా వుంది కొత్త ఉద్యోగం? "అని పలకరింపుగా అడిగారు సహోద్యోగి తిరుమలాచారిగారు.

"ఏదండీ ఇంకా... ఈరోజే జాయినింగ్ రిపోర్ట్ ఇస్తి. అలవాటు పడాలి ఇంక" వినయంగా సమాధానం చెప్పారు గురునాథరావు.

"ఇంతకీ రెసిడెన్స్ వగైరాలన్నీ ఏర్పాటుచేసుకున్నారా? ఫామిలీని తీసుకువచ్చారా?"

"లేదండీ ఇంకా..." అంటూ సంగతంతా వివరించాడు గుర్నాథరావు.

"అంటే పెళ్లయ్యీ బ్రహ్మచర్యమన్నమాట. ఇబ్బందే మరి. చేతులు కాల్చుకోలేనంటున్నారు. ఈ పాడు ఊళ్లో హోటల్ తిండి మీరేంతినగలరు? రుచీపచీ ఉండిచావదు. సరిగదా గడ్డి నయం అనిపిస్తుంది. ఊ...ఆ... అన్నట్టు ఆ కాలేజీ వెనకసందులో తిరపతమ్మ మెస్ అని ఉంది. ఊళ్లో ఉన్నంతలో అది బెస్ట్. అక్కడ పెట్టండి వాడకం. భోజనం అదీ బాగుంటుంది. పద్ధతీపాడూ అన్నీ ఉంటాయి." అన్నారు తిరుమలాచారిగారు.

"చాలా థాంక్సండీ. మంచి సలహా ఇచ్చి పుణ్యం కట్టుకున్నారు. నాకసలే ఓమాదిరిగా ఉంటే తినబుద్ధికాదు. చిన్నప్పటినుంచీ అమ్మ చేతివంట తప్పించి మరో చేతిఅన్నం తిని ఎరగను. ఈ హోటలు తిళ్లూ అవీ నాకు సరిపడవు, ఎలాగురా భగవంతుడా! అనుకుంటున్నాను. ఏదో తనొచ్చేవరకన్నా నాలుగు మెతుకులు తినేలా ఉంటే..."

"నాలుగేంఖర్మ. నాలుగుపూటలా సుష్టుగా భోంచేయవచ్చు" అని మెస్‌కెలావెళ్లాలో చెప్పారు తిరుమలాచారిగారు.

సాయంత్రం స్కూలు అయ్యాక రూంకి వెళ్లి తెచ్చుకున్న సామాన్లు మూటలు విప్పి జాగ్రత్తగా సద్దుకున్నాడు. ఏడుగంటలయ్యేసరికి స్నానం చేసి మెస్‌కి వెళ్లడానికి తయారయ్యాడు. తిరుమలాచారిగారు చెప్పిన ప్రకారం గుర్తులు వెతుక్కుంటూ వెళ్లాడు. తేలిగ్గానే గుర్తుపట్టాడు.

ఓ చిన్నపాటి పాతకాలంనాటి పెంకుటిల్లు. ప్రహరీగోడ సగం కూలిపోయివుంది.

మరోపక్క గోడమీద "తిరుపతమ్మ మెస్" అని రాసివుంది. పెద్దగా ఏమీ హడావుడి లేకపోవడంతో అనుమానంగా చూస్తూ ప్రహరీ గుమ్మం దాటి లోపలికి వెళ్లాడు. పెంకుటింటిదాకా వెళ్లేసరికి ఓ నడివయసా యన బయటకి వచ్చాడు. గళ్లలుంగీ, బనీను వేసుకున్నాడు. ముఖాన నుదుటిపై విభూతిరేకలు దట్టంగా ఉన్నాయి.

"రండి బాబూ! కాళ్లు కడుక్కోండి." అంటూ పక్కనే ఉన్న గాబులోంచి చెంబుతో నీళ్లు తీసుకువచ్చాడు. కాళ్లు కడుక్కుని లోపలికి వెళ్లేసరికి మధ్య వయస్కురా

బోర్డు చూశారా? లేదా మీరు? " అంటూ ముందుగా ఎదురొచ్చిన విభూదిరేకల ఆసామి లోపలికి వచ్చాడు.

"తిరుపతమ్మ మెస్ అని రాసి ఉంది." అన్నాడు గుర్నాథం.

"దానికింద ఏం రాసి ఉందో చూడలేదా? హోమ్లీ మీల్స్ మా ప్రత్యేకత అనిలేదూ? " అన్నాడు ఆ ఆసామి.

"ఉంది. ఉంటే...? " ఆశ్చర్యంగా అడిగాడు గుర్నాథరావు.

"మరి వండి వార్చవద్దూ. అయినా మీ ఇంట్లో ఇంతకన్నా వేగంగా పెడతారూ..."



లొకామె ఎదురొచ్చింది. "ఏం బాబూ! ఇదేనా రావడం...." అంటూనే నేలమీద పీట వేసింది. పెద్దవిస్తరి వేసి దాని పక్కనే మంచినీళ్ల చెంబు పెట్టి " ఇలా కూర్చోండి బాబూ!" అంటూ లోపలికెళ్లింది. వెళ్లినావిడ వెళ్లినట్టుగానే ఉండిపోయింది. అయిదు... పది... పావుగంట గడిచినా ఎవరూ రాక పోవడంతో అసహనంగా పిలిచాడు. "ఎవరండీ.. లోపల? అన్నం వడ్డించేదుందా? లేదా? " అంటూ.

"ఏమిటండీ అలా అరుస్తారూ? బయట

అంటూ సాగదీశాడు ఆ ఆసామి.

"నిజమేనండీ! నేను మాత్రం కాదన్నానా? ఆలస్యంగా చేస్తే ఒసేవ్! త్వరగా పెట్టి చావ్వే అని అననూ..." అంటూ తాను కూడా సాగదీశాడు గుర్నాథరావు లోపలికి చూస్తూ.

తెల్ల మొహం వేశాడు ఆ ఆసామి.

–సువర్చలాజ్యోతి

★

# 'రాలిన మొగ్గలు' పై సమీక్షలు

**జూన్ 'చతుర' లో ప్రచురితమైన పి. కృష్ణకుమారి రచన 'రాలిన మొగ్గలు' పై మా కందిన ఉత్తమ సమీక్షలు.**

## పరిమళించని మొగ్గలు

(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)



వికసించి, పరిమళించి, ఫలించాల్సిన మొగ్గలు అపరిపక్వంగానే రాలడానికి జన్మనిచ్చిన వృక్షమే కారణమవ్వడం ఎంత విషాదకరం? తల్లిదండ్రులు పిల్లలకు కేవలం పాకెట్ మనీ సోర్సుగానో లేక ప్రతి కదలికను నియంత్రించే కస్టోడియన్స్‌గానో మాత్రమే వుంటే రాజీవ్, మురళి, నీరజ్ ఎట్సెట్రాలు మొగ్గలుగా రాలాల్సిందేనన్న విషయాన్ని కడు హృద్యంగా, సున్నితంగా విశ్లేషించి విపులీకరించిన నవల కృష్ణకుమారిగారి 'రాలిన మొగ్గలు'.

పిల్లల మనోఫలకాలు తల్లిదండ్రుల ప్రవర్తనను ప్రతిబింబించే దర్పణాలన్నది ఈ నవలలోని అంతర్గత సారాంశం. అందుకే ఆ దర్పణాల్లో అందమైన, ఆహ్లాదకరమైన ప్రతిబింబం మాత్రమే నిలిచేలా జాగ్రత్తపడి పిల్లల్ని మనోదారుఢ్యంతో మంచి పౌరులుగా తీర్చిదిద్దే బాధ్యత తల్లిదండ్రులదేనన్నది అందమైన సందేశం. రాజీవ్ ఆత్మహత్యా యత్నం వీలైనన్ని (అక్రమ) మార్గాల్లో డబ్బును సంపాదించడమే ధ్యేయంగా పెట్టుకుని (అదీ పిల్లల భవిష్యత్తుకేనని సమర్థించుకుంటూ) డొనేషన్లను కట్టి ఖరీదైన స్కూల్లో అడ్మిషన్ సంపాదించడం, విలాసాలకు కావల్సినంత డబ్బు ఇవ్వడంతోనే పిల్లలపట్ల తమ బాధ్యత తీరిపోతుందనుకునే తల్లిదండ్రులకు కనువిప్పు కాగలదా? స్టీరియోటైపుగా చివరి పేజీలో

మోహన్రావు, లీలల్లో పరివర్తనతో సుఖాంతం చేయకపోవడం ఈ నవల సహజత్వాన్ని మరింత ఇనుమడింపజేసింది.

కాకపోతే రాజీవ్ తల్లిదండ్రులుగా మోహన్రావులాంటి ఓ చిన్న ప్రభుత్వోద్యోగి బదులుగా ఓ బడా వ్యాపారవేత్తనో, విపరీతంగా డబ్బు సంపాదించే పెద్ద ఆఫీసర్నో పెట్టి వుంటే బాగుండేది. ఎందుకంటే పల్లెటూరి బేక్గ్రౌండ్తో వచ్చిన మోహన్రావులాంటి మిడిల్ క్లాస్ వాళ్లలో లగ్జరీ లైఫ్కోసం లంచాలు తీసుకునే లాలూచీతనముండొచ్చు కాని కన్నబిడ్డలు ఆస్పత్రిలో వున్నా క్లబ్బుల కెళ్లేంత ఇండిఫరెన్స్ వుండదు. నిజానికి రాజీవ్లా డిప్రెషన్కు లోనయ్యే పిల్లల వుదంతాలు కాస్త హైక్లాస్ ఫామిలీస్లోనే తరచు తారసపడ్తుంటాయి.

–డా॥పి.వెంకటరామిరెడ్డి

బెంగుళూరు- 560089

## మాయలో పడిన మనుషులు

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

జీవితంలో వేగం పెరిగేకొద్దీ మధ్యతరగతి మనుషుల్లో పెనుమార్పులు, పెడధోరణులు పెచ్చరిల్లుతున్నాయి. నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాల అమలు నేపథ్యంలో ఉక్కిరిబిక్కిరి అవుతున్న పెద్దల మధ్య నలిగిపోతున్న పిల్లల మనస్తత్వాలకు ఒక కోణంనుంచి అద్దంపట్టిన రాలిన మొగ్గలు చాలా చక్కని నవల. సున్నితమైన కథావస్తువును హృదయానికి హత్తుకునేలా రచయిత్రి పి. కృష్ణకుమారిగారు అద్భుతంగా చిత్రించారు. హడావిడిలేకుండా సైలెంట్గా సాగే ఈ నవల సైకాలజిపై వచ్చిన మంచి నవలగా పాఠకులకు తప్పకుండా గుర్తుంటుంది.

ఈరోజు సమాజంలో బతకడం రోజురోజుకు దుర్భరంగా మారుతోంది. పోటీ మార్కెట్లో ప్రవహిస్తున్న వస్తు ప్రవాహం... ప్రభుత్వ విధానాలు.. టీవీలు తెచ్చిన కొత్త సంస్కృతి... అందరికన్నా ఎక్కువగా మోహన్రావు, లీలలాంటి వాళ్లను కుదిపేస్తోంది. ఏదో అనుభవించాలని, డబ్బు సంపాదించి గొప్పలు పోవాలని వెర్రిగా తపించే పెద్దలకు ఆ పాత్రలు ప్రతీకలు. తమకన్నా పై వాళ్లతో తిరగాలని, బంధువుల్లో పేరు సంపాదించుకోవాలని, అందిన కాడికి సంపాదించి లగ్జరీగా బతకాలని తపించే మోహన్రావు, లీలలాంటి మనస్తత్వాలు ఇపుడు చాలామందిలో కన్పిస్తున్నాయి. ఇలాంటి వారివల్ల వారి పిల్లలు ఎంత బాధపడతారో మానసికంగా ఎంత అలజడికి గురవుతారో రాజీవ్, సరోజల పాత్రలద్వారా చూపించారు. పాతతరానికి చెందినప్పటికీ స్వభావంలో మార్పులేని వెంకటనర్సయ్య, మణెమ్మలు కూడా పిల్లలను యధాశక్తి నాశనం చేయడంలో ముందుంటున్నారు. దాభా,పబ్,డిస్కో సంస్కృతి విద్యార్థుల్లో తెచ్చిన మార్పులకు మురళీ, శీలాలాంటివాళ్లు నిత్యం బలవుతూనే వున్నారు. మనస్విలాంటి డాక్టర్లు ఇచ్చే ట్రీట్మెంటుకోసం నేడు ఎంతోమంది తపించిపోతున్నారు. అందరిలోనూ తమను ఎవరూ గుర్తించడంలేదు, పట్టించుకోవడం లేదు అనే భావనలే పెరిగిపోతున్నాయి. వేగాన్ని అందుకోలేక పరుగులు పెట్టే ప్రతి ఒక్కరూ మానసిక రోగులుగానే తయారవుతున్నారు. సమాజ మాయలోపడిన మనుషులు తల్లడిల్లిపోతూ అవినీతిపరులుగా, మోహన్రావుల్లా మారడానికి అవకాశంకోసం ఎదురుచూస్తున్నారు. కాని పంతులులాంటి ఎన్సైలు అక్కడక్కడా కన్పిస్తున్నారు. నిజాయితీలేని తత్వం పోవాలంటే మొగ్గలు రాలిపోవడం ఒక్కటే పరిష్కారంకాదు.

–రామశంకర్

గోదావరిఖని- 505209

# కనువిప్పు

*(తృతీయ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఉన్నతవర్గాల విలాసవంతమైన జీవనసరళిని అనుసరించడంకోసం సుఖాలవేటలో పిల్లల బాగోగులు నిర్లక్ష్యం చేసే తల్లిదండ్రులు...

ఆ భోగభాగ్యాలేవీ లేకపోయినా. 'పదిలంగా నెలకొన్న పొదరిల్లుమాది' అంటూ నిరాడంబర జీవితం గడుపుతున్న తమతోటి పిల్లల కుటుంబాలు...

ఈ వైరుధ్యాలమధ్య అశాంతికి గురైన పిల్లలు రాజీవ్, సరోజల చిత్తవృత్తులను, పడుగూపేకగా అల్లిన నవల 'రాలినమొగ్గలు'. వికసించే జీవితాలు అవినీతి వికృత భయంకర పరిణామాలకి గురియై రాలిన మొగ్గలుగా మిగిలిపోవడాన్ని, నవలలో సహజంగా చిత్రించడంలో రచయిత్రి కృతకృత్యులయ్యేరు.

లీలలూ, మోహన్రావులు మనకి తరచు తారసపడతారు. కాని మంచిచెడుల తారతమ్య విచక్షణతో అధికంగా స్పందించే రాజీవ్, సరోజలు అరుదుగా గోచరిస్తారు. ఈ ఇద్దరకీ ఆలంబనగా నిలిచి వారి మనోవైకల్యాల్ని పోగొట్టిన వ్యక్తులు సైకియాట్రిస్ట్ మనస్వి, వంటవాడు ముసలయ్య.

తల్లిదండ్రులు-పిల్లల మధ్య గూడుకట్టుకున్న సమన్వయలోపం, దానివల్ల కలిగే అనర్థాలు ఈ నవలలో గోచరిస్తాయి. అవినీతి నీలినీడలు తమ జీవితాలనేకాక తమ పిల్లల భవిష్యత్తును సైతం ఎంతగా నరకప్రాయం చేస్తున్నాయో తెలియజేసి లీలా మోహన్రావు దంపతులలాటి వారికి కనువిప్పు కలిగిస్తుందీ నవల.

రాజీవ్, సరోజ, ఉత్పల్, నీరజ్, శిరీష్ కుసుమ్‌లాటి పుష్పాలపేర్లు తమ పాత్రలకెన్నుకుని వారి సున్నిత సుకుమార స్వభావాల్ని ఇందులో చిత్రించారు రచయిత్రి. ఆ సౌకుమార్యాలు వాడి పోకుండా వారి జీవితాలు సువాసనలు వెదజల్లేలా తమ ప్రవర్తనలని చక్కదిద్దుకోడం తల్లిదండ్రుల బాధ్యత. మంచి సామాజిక ఇతివృత్తంగల నవల అందించిన చతురకి అభినందనలు.

**-లతిక,**
మద్దిలపాలెం -530013

# శేషప్రశ్న?

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

సభ్య సమాజపు సంస్కృతీ విస్తరణలో తమదంటూ ఒక నిర్దిష్టమైన పాత్ర, బాధ్యత ఉందని ఎప్పటికప్పుడు తెలియజేస్తూ మౌలిక విలువలను నేర్పుతూ, వాటిని కాపాడుకునే దీక్ష, పట్టుదలలను పునశ్చరణ చేస్తూ తమవంతు సేవలను అందిస్తుంటాయి మన విద్యాలయాలు.

తప్పటడుగులతో ప్రవేశించి ఎన్నో తప్పటడుగులు వేయించే ప్రలోభాలకి లొంగకుండా తమ బుద్ధి అనే అశ్వాన్ని నేర్పుగా నడుపుకుంటూ వెళ్లే ప్రతి విద్యార్థీ ఒక నకులుడే. ఇలాంటి ప్రతి నకులుని వెనుక వెన్నుదట్టి, చేయూతనిచ్చి, రక్షణ కవచాన్ని అందించే తల్లితండ్రులు ఎంతమంది ఉన్నారు?

వివాహం అయిన తరువాత ప్రతిమనిషీ తనకంటూ జీవించడం మానుకొని తన వాళ్లకోసం జీవించడం ప్రారంభమవనంత కాలం ఈ మొగ్గలు రాలిపోతూనే ఉంటాయి. ఒక ఆయా, ఒక కంప్యూటర్, ఒక ట్యూషన్ మాస్టరు... వీరంతా కలసి కొన్ని వందల గంటలు ఈ చిన్నారుల జీవితంలో గడపినా స్వాభావికంగా సకాలంలో స్పందించి తన చీరకొంగుతో సమీరాన్ని సృష్టించి అందించే తల్లి, ఆప్యాయతతో, ఆర్ద్రతతో, విశ్వాసంతో వళ్లు నిమిరే తండ్రి... వీరిద్దరూ కలసి అందించే కొన్ని క్షణాలు

అత్యంత విలువయినవి. మొగ్గ వికసించి పూవుగా పరిపక్వంచెంది, పరిమళం అందించే ప్రక్రియలో తల్లితండ్రుల బాధ్యత ఎంతైనా ఉంది. అక్క ఉన్న రాజీవ్ అదృష్టవంతుడు. ఒకే సంతానంతో ఉన్న ఎన్నో వేలమంది తల్లితండ్రులకు మరింత గురుతరమైన బాధ్యత ఉంది.

డాక్టర్ మనస్వి పాత్రద్వారా కౌన్సిలింగ్, ఫామిలీ కౌన్సిలింగ్‌ల ప్రాముఖ్యతను వివరించారు. మానసిక శాస్త్రవేత్తలు చెప్పినట్లు ఆత్మహత్య అన్నది ఎవ్వరూ కోరుకునేది కాదు. ఒక ఆవేదనా పూరితమైన ఆక్రోశానికి ప్రతిబింబమే ఆత్మహత్య అయితే ప్రతి ఆత్మహత్య వెనుక గుప్త హంతకులు ఉంటూనే ఉంటారు లీల, మోహన్రావుల రూపాల్లో. పెద్దలందరికీ చివరన వేసిన ప్రశ్న శేషప్రశ్నగా మిగలకూడదని ఆశిద్దాం.

–వెంకట సీతారామయ్య మంగళంపల్లి

దుండిగల్ - 500043

# సందేశాత్మకం

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

'అమృతం తాగిన వాళ్లు దేవతలు, దేవుళ్లు. అది కన్నబిడ్డలకు పంచేవాళ్లు అమ్మానాన్నలు' అని తల్లిదండ్రుల గురించి తెలిపారో కవిగారు. అంతటి త్యాగమూర్తులుగా ఉండి తమ పిల్లల వర్తమానాన్ని, భవిష్యత్‌ని తీర్చిదిద్దాల్సిన తల్లిదండ్రులు విలాసాలు మరిగి అవినీతి మార్గాలు అవలంబిస్తూ తమ సుఖం మాత్రమే తాము చూసుకుంటే రేపటి పౌరులైన నేటి విద్యార్థుల మానసిక వ్యధ ఎలా ఉంటుందో 'రాలిన మొగ్గలు' నవలలో పి.కృష్ణకుమారి గారు వివరించిన తీరు చక్కగా వుంది.

ఆర్థిక స్థోమత లేని తల్లిదండ్రులు వుంటారు. వారి పిల్లలూ కొన్ని రకాల సమస్యలు ఎదుర్కొంటారు. అలా స్థాయి తక్కువగా వున్న తమ పేరెంట్స్ వలననే తాము విద్యావకాశాలు పొందలేక పోతున్నామని ఇంకా ఇతర రకాలైన కొన్ని అవమానాలు ఎదుర్కోవాల్సి వస్తుందని ఆ పిల్లలు కొన్ని సందర్భాల్లో భావించడం జరుగుతుంది. అటువంటి భావనలున్న విద్యార్థులు తప్పనిసరిగా చదవాల్సిన నవల రాలినమొగ్గలు. ఈ నవలలో ఉత్పల్ పాత్ర వారికి ఆదర్శమవుతుంది. తల్లిదండ్రుల ఆర్థిక స్థోమతతో సంబంధం లేకుండా క్రమశిక్షణను ఎలా అలవరచుకోవచ్చో ఉత్పల్ పాత్ర తెలియజేస్తుంది.

అదే సమయంలో ఆర్థికంగా ఉన్నత వర్గాలకు చెందిన విద్యార్థులు, యువకులూ చదవాల్సిన నవల ఇది. రాజీవ్ పాత్ర ఒక హెచ్చరిక లాంటిది. తల్లిదండ్రుల ప్రవర్తన సరిగా లేకుంటే పిల్లలు ఎటువంటి మానసిక అస్వస్థతకు లోనవుతారో కృష్ణకుమారి గారు రాజీవ్, సరోజల పాత్రలద్వారా చూపించిన తీరు బాగుంది.

లంచగొండితనం అవినీతి అనేవి ఎందరి జీవితాలను ఏ విధంగా ఛిద్రం చేస్తాయో రాలినమొగ్గలు నవల అమోఘంగా ఆవిష్కరించింది. ప్రస్తుత సమాజానికి ఇటువంటి నవలలే ఎక్కువగా అవసరం. టీనేజ్‌లో ఎలా వ్యవహరించకూడదో అలా వ్యవహరిస్తే జీవితమేమవుతుందో శీలా పాత్ర ద్వారా తెలుసుకోవచ్చు మురళి, నీరజ్‌ల లాంటి స్నేహితులుంటారని హెచ్చరిస్తుందీ నవల. ఉత్పల్‌ది ఒక ఆదర్శవంతమైన పాత్ర. మోహన్రావు, లీలలాంటి తల్లిదండ్రులకు ఈ నవల కనువిప్పు కాగలదు. విద్యార్థులు, యువకులు తప్పనిసరిగా చదవాల్సిన చక్కని సందేశాత్మక నవల రాలినమొగ్గలు. రచయిత్రి పి.కృష్ణకుమారిగారికి అభినందనలు. జీవితానికుపయోగపడే నవలలే అందించే చతురకు వందనాలు.

–గండెల చంద్రశేఖర్

హనుమకొండ-506009

చతుర
సంపుటి: 23 సంచిక: 7 ఆగస్ట్ 2000

ఓ ప్రఖ్యాత శాస్త్రవేత్త ఆధ్వర్యంలో 'రోబోట్ నిర్మాణం'లో పరిశోధన సాగించాలనుకున్న ఓ ఆదర్శ విద్యార్థిని మహోత్సాహంతో యూనివర్సిటీలోకి అడుగుపెట్టింది.

ఊహించినదానికి, ఆశించినదానికి విరుద్ధంగా అక్కడ ఆమెకు అడుగడుగునా ఎదురైన వింత మనస్తత్వాలు, విచిత్ర సంఘటనలు ఆమె పరిశోధనని ఏ మలుపుతిప్పాయి? మొక్కుబడిగా కాక నిజంగా ఉన్నత విద్యలో లీనం కావాలనుకునే విద్యార్థినీ విద్యార్థులకు యూనివర్సిటీ లెవెల్లో ఎదురౌతున్న అనూహ్యమైన అనుభవాలు ఎలాంటివి?

**విద్యారంగంలోని అంతర్గత రాజకీయాలను కథానేపథ్యంలో విశ్లేషించిన**

## అశ్వని రచన

# డాక్టరేట్

**ఆగస్ట్ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.**



నాలుగురోజులుగా కుండపోతగా కురుస్తున్న వర్షం ఆరోజే కొంత తెరిపినిచ్చింది. అప్పుడప్పుడూ వచ్చే పన్నీటి జల్లులాంటి వర్షపు చినుకులు ఆకుల మీద పడి జారిపోకుండా అక్కడక్కడ ముత్యాల్లా కనిపిస్తున్నాయి. మధ్యలో లేత ఎండ... చిరుజల్లు... గాలి... గాలితోపాటు మబ్బులు పరిగెడుతూ పోటీ పడుతూంటే నేలమీదకి దూసుకువచ్చే సూర్యకిరణాలు కొన్ని నీటి ముత్యాలలోకి చొరబడి ఆ నీటిముత్యాలు ఎర్రగా, నీలంగా, పచ్చగా అపురూపమైన వజ్రాల్లా మెరిసిపోతున్నాయి.

విద్యలన్నీ ఉన్న ప్రతిష్టాత్మకమైన ఆ యూనివర్సిటీలో చదువుకునేందుకు సీటు సంపాదించుకోవాలని విద్యార్థులు ఆశపడుతుంటే ఈ సంవత్సరం కూడా మెరికల్లాంటి విద్యార్థులు తమ విశ్వవిద్యాలయంలోనే చేరాలని లెక్చరర్లు, ప్రొఫెసర్లు కోరుకుంటున్నారు.

చదువుకునే విద్యార్థులకి వర్షం, ఎండ, చలీ, చీకటి వీటి తేడాలు తెలియవు. ఆ 'యూనివర్సిటీ'లో ఎంట్రన్స్ పరీక్షలు జరుగుతున్నాయి. కొందరు విద్యార్థులు పెరిగిన వాతావరణ ప్రభావంవల్ల ధైర్యంగా ఆత్మస్థైర్యంతో 'మా సంగతి మేం చూసుకోలేమా?' అని ఒక్కళ్ళే వచ్చారు. ఒంటరిగా వెళ్ళలేం పక్క ఎవరైనా ఉంటే ధైర్యంగా ఉంటుందనుకునేవాళ్ళు తండ్రులనో, ఊళ్ళోని బంధువులనో, స్నేహితులనో వెంట తీసుకుని వచ్చారు. మొత్తంమీద యూనివర్సిటీ ప్రాంగణమంతా కోలాహలంగా ఉంది.

'ఇంకా ఎంతమంది అభ్యర్థులున్నారో ఓరల్ టెస్టుకి' అనుకుంటూ టైం చూసుకుంటూ ఎడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్ బయటికి వచ్చి వరండాలో నిలబడింది ముక్త. ఆ యూనివర్సిటీ కొన్ని వందల ఎకరాలలో పరచినట్టుగా ఉంటుంది. చదునుగా ఉన్న నేలమీద కాకుండా గుట్టలమీద బిల్డింగ్స్ కట్టారు. ఒక్కో గుట్ట ఎక్కడానికి సుమారు ఇరవై అయిదు మెట్లు అధిగమించాలి. బిల్డింగ్స్ చుట్టుపక్కల లాన్స్, పూలమొక్కలు, గుట్ట దిగగానే రహదారి చుట్టూ రకరకాల పళ్ళమొక్కలు లేదా వేపచెట్లు బారులు తీరినట్లున్నాయి.

అన్ని గుట్టలలోకీ ఎడ్మినిస్ట్రేషన్ ఆఫీస్ బిల్డింగ్ ఉన్న గుట్ట ఎత్తు ఎక్కువ. క్యాంపస్ మధ్యగా ఉన్న ఆ బిల్డింగ్ ఎక్కి చూస్తే మొత్తం యూనివర్సిటీ అంతా కనిపిస్తుంది. బిల్డింగ్స్ టాప్స్ ఎరుపురంగుతో పెయింట్ చేశారు. మీద నుంచి చూస్తూంటే ఆకుపచ్చని వనంలో ఎర్రటి తివాసీలు అక్కడక్కడ పరిచినట్లు కనిపిస్తోంది. బిల్డింగ్స్‌ని తాకుతూ పోతున్నట్లున్న పిల్లమేఘాలని, లోయల్లో పెరిగిన వృక్షసంపదని చూస్తూ తన్మయురాలైంది ముక్త. 'ఎంత అద్భుతంగా ఉందీ క్యాంపస్' తనలో తనే మాట్లాడేసుకుంటున్న ముక్త ఓ విద్యార్థి తననే గమనిస్తుండటం గమనించి తడబాటు పడింది. ముక్త దగ్గరకు నడుస్తూనే పలకరింపుగా నవ్వాడు ఆ యువకుడు.

కొంతసేపుగా వరండాలో తిరుగుతున్న స్టూడెంట్స్‌ని పలకరిస్తూ మాటలు కలుపుతున్న ఆ యువకుడు తనని సమీపించేసరికి ముక్త కూడా చిర్నవ్వుతో విష్ చేసి "మీరు స్టూడెంటా? ఏ డిపార్టుమెంటు? ఇందాక లోపల మిమ్మల్ని చూశాను. నాపేరు 'ముక్త', నేను పి. హెచ్.డి. ఓరల్ టెస్టుకి వచ్చాను" అంది.

"నా పేరు నిత్యానంద్. నేను మెటీరియల్ సైన్స్‌లో పి. హెచ్. డి. వర్క్ కంప్లీట్ చెయ్యబోతున్నాను. ఇక్కడికి నా ఫ్రెండ్ కజిన్ ఓరల్ టెస్ట్‌కి వస్తాడంటేను ఓసారి కలిసి మోరల్ సపోర్టు ఇద్దామని వచ్చాను. మీరు పి. జి. ఎక్కడ చేశారు?"

"పూనేలో"

ఇంతలో "ముక్తా" పేరు పిలవడం వినిపించి లోపలికి నడుస్తూంటే, "విష్ యూ

ఆల్ ది బెస్ట్" అన్నాడు నిత్యానంద్.

"థ్యాంక్స్" అంది ముక్త.

రూంలో కమిటీ మెంబర్లయిన ప్రొఫెసర్లు కూర్చుని ఉన్నారు. ఇంటర్వ్యూలు జరుగుతున్నాయి. విద్యార్థులు 'అడిగేవాడికి చెప్పేవాడు లోకువ' అన్నట్టు ఫీలవుతున్నారు.

"ఇంత గొప్ప ఎమ్.ఎస్.సి. ఫస్ట్‌క్లాసు స్టూడెంట్స్ ఈమాత్రం చెప్పలేరా? " అన్నట్టు కమిటీలో ప్రొఫెసర్లు భావిస్తున్నారు. వాతావరణం చల్లగా, ఆహ్లాదకరంగా ఉన్నా తమ భవిష్యత్‌కి ఆ సీటు ఓ మైలురాయి కాబట్టి విద్యార్థులకి టెన్షన్ చేత వేడిగా అనిపిస్తోంది.

ముక్త ప్రొఫెసర్లు అడిగిన ప్రశ్నలకి, తనకి తెలిసినంతవరకూ కాన్ఫిడెన్స్‌తో సమాధానాలు చెప్పింది. తెలియనివాటికి 'సారీ తెలియదు' అని చెప్పేసింది. తెలియని విషయాన్ని మసిపూసి మారేడుకాయ చేయకుండా తెలియదని చెప్పడం కమిటీ మెంబర్లలో ఒకరైన ప్రొఫెసర్ వేదవతిని అమితంగా ఆకట్టుకుంది. పరిశోధనలలో సంశయానికి తావుండకూడదు.

"ముక్త ఫ్రాంక్‌నెస్ నాకు నచ్చింది. నేను ఆ అమ్మాయిని ఎం.ఫిల్.కి కానీ, పి.హెచ్.డికి కానీ నా దగ్గర పని చెయ్యడానికి తీసుకుంటాను" అన్నారు వేదవతి.

ఆ డిపార్ట్‌మెంట్ హెడ్ ప్రొఫెసర్ కోలాచలానికి ప్రొఫెసర్ వేదవతి ముక్తని తన దగ్గర పనిచెయ్యడానికి తీసుకుంటాననగానే ఒప్పేసుకోవడం ఏమాత్రం ఇష్టంలేదు. కారణం చాలా సింపుల్. వేదవతి కావాలని అడుగుతున్నది కాబట్టి ఇవ్వకూడదు అంతే. తను హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్‌ని అనే అధికారం ఇంకెప్పుడు చూపించాలి? ఇలాంటి సమయాలలోనేగా!

'అడిగినది వెంటనే ఒప్పుకోకూడదు' అనే అభిప్రాయం నరనరాలలో జీర్ణించుకున్న వ్యక్తి కోలాచలం.

ప్రొఫెసర్ కోలాచలం ముక్త అప్లికేషన్ బయటికి తీస్తూ, "ఈ అభ్యర్థి అప్లికేషన్‌లో సత్యం సూపర్‌వైజర్‌గానూ, సబ్జెక్ట్ 'రోబోట్ రాడార్స్' అనీ 'ఇండికేట్' చేసి ఉందే" అంటూ తన అభిప్రాయం చెప్పాడు.

"అవ్వచ్చు, కానీ సత్యం దేశంలోనే లేరు. కాన్ఫరెన్స్‌కని వెళ్లిన మనిషి, అనుకోని అవాంతరాలతో రాలేకపోతున్నారు. తనకి రిసెర్చికోసం అభ్యర్థులని తీసుకోమని మీకు కానీ, సాటి ప్రొఫెసర్లకుకానీ ఏదైనా మెసేజ్ పంపారా? " అని వేదవతి ప్రశ్నించింది.

వేదవతి ఆ విద్యార్థిని తీసుకోవడానికి గట్టి నిర్ణయమే తీసుకున్నట్టు గ్రహించాడు కోలా.

"లేదు" ముక్తసరిగా అన్నాడు కోలా.

కానీ, ఆయన మనసులోనే తూకం వేస్తున్నాడు. సత్యం అడగకపోయినా స్టూడెంట్స్‌ని అతనికి కూడా ఎలాట్ చేసి అతను దేశానికి తిరిగి వస్తాడో, రాడో అనుకునే పరిస్థితులలో అతని స్థానాన్ని పటిష్టం చెయ్యడం అబ్బే అసలు బాగోలేదనుకున్నాడు. పోనీ తనే తీసుకుందామనుకుంటే, ఒకో ప్రొఫెసర్ దగ్గర నలుగురు విద్యార్థులకు మించి నమోదు చెయ్యడానికి యూనివర్సిటీ రూల్సు ఒప్పుకోవు. ఆ నిబంధనలు దాటి తన దగ్గర విద్యార్థులు పనిచేస్తున్నారు కాబట్టి తను ముక్తను రిసెర్చి విద్యార్థిగా తీసుకోవడం కుదరదు. అంతకన్నా ముక్తని వేదవతికి ఎలాట్ చెయ్యడమే సరైన మార్గం అనీ అనుకున్నాడు. క్షణాల్లో అభిప్రాయం మార్చుకున్నాడు.

దాంతో ముక్తకి వేదవతి దగ్గర రిసెర్చికి సీటు దొరికింది.

ఫలితాలు వెంటనే ప్రకటించరనీ, కొంత టైం పడుతుందనీ తెలుసుకుని ముక్త ఇంటికి తిరిగివచ్చింది.

★ ★ ★

"ట్రైన్ లేటయిందా? " గేటు దగ్గరే ముక్తకి ఎదురుపడి ఆమె చేతిలోని మేగజైన్ తీసుకుంటూ, ముక్త తండ్రి గురునాథం కూతురితో పాటు ఇంట్లోకి నడిచాడు.





**సచిత్ర విచిత్రం**

# బుల్లి చదరంగం

చదరంగం ఆటే బుర్ర తినేసే ఆట. దానికి తోడు అందులోని బలగాలు ఇంకా చిన్నవి అయితే బుర్రతో పాటు కంటికి కూడా పనే. నికెల్, బ్రాస్, వెండి లోహాలతో అతి చిన్న రాజు, మంత్రి, గుర్రం, ఏనుగు, శకటం, ఇతర కాల్బలాలతో చేసిన ఇవి అగ్గిపుల్ల మీద నుంచోగలవంటే ఎంత చిన్నవో ఊహించవచ్చు. ఇంగ్లండులోని సడ్బరీ అనే ఊరికి చెందిన పీటర్ హంట్ అనే కళాకారుడు వీటిని తయారుచేశాడు.ఆటగాళ్లు బలగాలని ట్వీజర్స్ (అతి చిన్న పటకారు) తో కదపాల్సివుంటుంది. చదరంగం బల్లని స్టూల్ ఆకారంలో తయారు చేశాడు పీటర్.

"ట్రైన్స్ ఎప్పుడూ లేటుగానే వస్తాయి గదా నాన్నా! అప్పుడప్పుడు పొరపాటున టైంకి వస్తాయి" అంది ముక్త.

"అలా అంటే మీ నాన్న ఒప్పుకుంటారా? రైల్వే ఆఫీసర్ కదా" అంది ముక్త తల్లి జయంతి కాఫీ తీసుకువస్తూ.

"ఇంతకీ పరీక్ష ఎలా జరిగింది? ఇంటర్వ్యూ... అదే ఓరల్ టెస్టు ఎలా చేశావు? సీటు వస్తుందా?"

"సంతృప్తిగానే చేశాను. రావచ్చు"

"సీటు వచ్చినా ఉన్న ఊరిలో చదువుకో. ఉద్యోగం చూసుకో. అంతేకానీ ఇల్లు వదిలి పై ఊరు వెళ్ళి అంతూదరీ లేని రిసెర్చి వెలగబెట్టనక్కరలేదు. నేను మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను" అంది తల్లి ఆవేశంగా.

"నాకు యూనివర్సిటీలో సీటు అంటూ వస్తే అక్కడే చేరుతాను. ప్రఖ్యాత శాస్త్రవేత్త 'ప్రొఫెసర్ సత్యం' అక్కడే ఉన్నారు. నేనా ప్రొఫెసర్ దగ్గిరే రిసెర్చి చేస్తాను. ఈ విషయం నేను అనేకసార్లు చెప్పాను. నా నిర్ణయంలో మార్పులేదు. మనం దీన్నిగురించి ఇదివరకు చాలాసార్లు మాట్లాడేం. ఇంక మాట్లాడవలసింది ఏమీలేదు"

"నువ్వు వెళ్ళేముందు అన్నమాటలు ఇవే కదా! ఇంతకీ ప్రొఫెసర్ సత్యంని కలుసుకున్నావా?" బరువైన వాతావరణాన్ని తేలిక చేసే ప్రయత్నంలో అన్నారు ముక్త తండ్రి గురునాధం.

"ఆయన్ని కలుసుకోలేదు. ఇంటర్వ్యూ కమిటీలో నలుగురైదుగురు కూర్చుంటారు కదా! ఎవరు ఎవరో తెలియలేదు. కానీ సత్యంగారు పై దేశాలకి వెళ్ళారని అక్కడ ఎవరో అన్నారు"

"నిన్ను ప్రశ్నలడుగుతున్నప్పుడే సత్యం గురించి వాళ్ళని అడగవలసింది"

"అడగాలనుకున్నాను, కానీ అంతా సీరియస్‌గా ఉన్నారు. అడగాలంటే ఏదో జంకు. సత్యం పైదేశాలకి వెళ్ళింది కాన్ఫరెన్స్‌కేనట, త్వరలోనే తిరిగి వస్తారుట"

"ఇప్పుడాయన ఇంటర్వ్యూలో కూర్చుంటేనేమిటి? లేకపోతేనేమిటి? నాకు నువ్వు రిసెర్చికి వెళ్ళడం ఎంతమాత్రం ఇష్టంలేదు. ఏ లెక్చరర్‌గానో చేరు. బ్యాంక్ పరీక్షలకి వెళ్ళు. లేకపోతే పెళ్ళి చేసుకో, అంతే" శాసిస్తున్నట్టు అంది తల్లి.

ముక్త తల్లివైపు కోపంగా చూసింది.

"అవును ముక్తా. మీ అమ్మ చెప్పింది ఆలోచించవలసిందే. ఆవిడ తమ్ముడిని ఆవిడ బాగా గమనించే ఈ మాట అంటోంది. పరిశోధన అనగానే అన్ని పనులు సక్రమంగా జరిగితేనే నాలుగైదేళ్ళు పడుతుంది. మామయ్య చెప్పేమాటలు మరిచిపోయేవా? ఎంతో వ్యయప్రయాసలు పడి పర్మిషన్‌లు తెచ్చుకొని, విదేశాలనుంచి కెమికల్స్ తెప్పించుకుంటే, కస్టమ్స్‌లో క్లియరవ్వక మధ్యలోనే డేమేజి అయ్యో, లీకైపోయో, ఒకవేళ లేబ్ వరకు వచ్చినా ఎలక్ట్రిసిటీ సరిగాలేక రిఫ్రిజరేటర్‌లో పెట్టిన కెమికల్స్ టెంపరేచర్ తేడాలు వచ్చి పాడయ్యేవనీ ఎంత బాధపడేవాడో. లక్షలకి లక్షలు పోసి కొనే పరికరాలు కూడా ఓల్టేజి తేడాలు వచ్చి ధ్వంసమయ్యేవనేవాడు. ప్రతి ప్రొఫెసర్ ఎవరిలాబ్‌లో వారికి కోట్లకి ఖరీదు చేసే పరికరాలు స్వంతంగా కావాలనుకుంటారనీ, స్టాఫ్‌లో సమన్వయంలేక ఒకరి వస్తువు ఇంకోర్ని వాడుకోనివ్వరనీ, ఎంత వర్రీ అయ్యేవాడు? 'మనదంతా సర్ఫేస్ రిసెర్చి'. స్వేచ్ఛగా అనుకున్న పరిశోధన చెయ్యడానికి మనదేశంలో అవకాశాలే లేవ'ని పరితపించేవాడు మామయ్య. ఆరేళ్ళకి థీసిస్ సబ్‌మిట్ చేశాక తను పనిచేస్తున్న ప్రొఫెసర్‌కి, రావలసిన ఎగ్జామినర్‌కి టైం కుదరక 'వైవా' అయ్యేసరికి ఓ ఏడాది పట్టింది. పదేళ్ళుగా అమెరికాలో పోస్టు డాక్టరల్‌గా పనిచేస్తున్నాడు. ఎదుగూ, బొదుగూ లేదు. ఒకళ్ళ చేతికింద వాళ్ళు చెప్పిన రిసెర్చి చేస్తూ బతుకుతున్నాడు. ఈ పి.హెచ్.డి.లు చేసి ఫారిన్ వెళ్ళవచ్చని వాళ్ళంతా

అప్పుడు మోజుపడేవారు. ఇప్పుడా? పాములు పట్టేవాళ్ళు సైతం అమెరికా వెళ్ళగలుగుతున్నారు. ఎంతోమంది అమ్మాయిలు ఎమ్.ఎస్.సి. వరకూ మెరిట్‌లో పైమెట్టుమీద ఉంటూ డాక్టరేట్స్ సంపాదిస్తున్నా పరిశోధనలో నిలదొక్కుకుని ప్రొఫెసర్లు కాగలుగుతున్నారా? లేదే! ఈ అధ్యాపక వృత్తిలో ఓ అధికారమా? పాడా. అనుకున్న రిసెర్చి చెయ్యడానికి అవకాశం తక్కువున్న ఆ లైను నీకెందుకమ్మా? ఇక పెళ్ళి మాట ఎత్తితే అమ్మాయి బి.టెక్. కంప్యూటర్సా? ఎమ్.సి.ఎ.నా? అని అడుగుతున్నారు. మా మాట విను. నీకాలైను నప్పదు" అన్నాడు గురునాథం.

"నాన్నా మనకిష్టమైన పని ఏదైనా, ఎంత కష్టమైనదైనా సునాయాసంగా చెయ్యగలం. కాదంటావా? "

"మనం చేద్దామనుకోవడంతో సరిపోదు. మనదేశంలో శాస్త్ర పరిశోధనకి తగ్గ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లేదు. నేను చాలామందిని చూశాను. ఈ లైనులో తల దూర్చి డాక్టరేట్ సంపాదించుకుని, భవిష్యత్తు అగమ్యగోచరమై ఎంత ఫ్రస్ట్రేట్ అవుతున్నారో! తొమ్మిదింటికి వెళ్ళి ఆరింటికి రాగలిగే ఉద్యోగమా? నెవర్ ఎండింగ్ బ్రైన్ ఎక్సర్‌సైజ్. అందుకేనమ్మా అమ్మాయిలు మెరిట్‌లో ఎంత మీదకున్నా రిసెర్చిలైన్‌లో మాత్రం అసలు ముందడుగు వెయ్యలేకపోతున్నారు. ఇక పెళ్ళయ్యాక రిసెర్చి, గృహకృత్యాలనే రెండు పడవలమీద కాళ్ళు పెట్టి నిలదొక్కుకోలేక చస్తున్నారు. "

"నాన్నా మీరు ఎక్స్‌ప్రెస్ స్పీడులో వెళ్ళిపోతున్నారు. సరే, నాకాలైను నప్పదు, చెయ్యలేను అనుకుంటే మధ్యలో ఆపేస్తాను. ప్రామిస్" అంటూ ముక్త లోపలికి వెళ్ళింది.

★ ★ ★

ముక్తకి యూనివర్శిటీలో పి.హెచ్.డి. చెయ్యడానికి సీటు వచ్చింది. అది ఎంత మాత్రం తల్లికి ఇష్టంలేదు. తండ్రిమాత్రం "ముక్త పట్టుదలగల పిల్ల. ఒకోప్పుడు పిల్లల ఉత్సాహానికి ఆనకట్టకడితే వాళ్ళు తేరుకోవడానికి కష్టమవుతుంది. అంత మక్కువ పడుతున్నప్పుడు ఆ పని చెయ్యవద్దనడం భావ్యంకాద"ని భార్య జయంతిని సమాధాన పరిచాడు.

ముక్త తల్లితండ్రులు కూడా ముక్తతో పాటు యూనివర్శిటీకి వచ్చారు. ముక్తని "సత్యం దేశంలో లేడు కాబట్టి వేదవతి దగ్గర రిసెర్చి చెయ్యడానికి ఏమైనా అభ్యంతరముందా? " అని అడిగాడు హెడ్ కోలా.

"నేను సత్యంగారి దగ్గర చెయ్యాలని చాలాకాలంగా అనుకుంటున్నాను. మరి వేదవతిగారి దగ్గర అంటే సబ్జక్ట్...?

ముక్త మాట పూర్తి కానివ్వలేదు హెడ్ కోలా, "సత్యం ఈ దేశానికి తిరిగి వస్తాడో రాడో తెలియని పరిస్థితి. వేదవతి చేస్తున్న రిసెర్చి సత్యం చేస్తున్న రిసెర్చికేమీ భిన్నమైంది కాదు. ఓ రకంగా చెప్పాలంటే మేం చేస్తున్న అన్ని లైన్స్‌మీద సత్యం రిసెర్చి జరుగుతోంది"

"ఒకవేళ సత్యం త్వరలో తిరిగి వస్తే నేను మారడానికి అవకాశం ఉంటుందా? " అంది ముక్త.

ముసిముసిగా నవ్వుకున్నాడు కోలా. "వేదవతిగారు ఒప్పుకుంటే తప్పక మారవచ్చు ఓ ఆర్నెల్లు టైం లోగా" అన్నాడు.

ముక్త జరిగిన విషయాలు తల్లితండ్రులకి చెప్పింది. ఒకవేళ సత్యం రాకపోతే ముక్త ఆరునెలలలో తిరిగి ఇంటికి వచ్చేయవచ్చు ననే ఆశ జయంతిలో మిణుకుమిణుకుమంటోంది.

ముక్త, తల్లి, తండ్రి, వేదవతిని కలుసుకున్నారు.

"ముక్తకి రిసెర్చి అంటే చిన్నప్పటినుంచి చాలా ఆసక్తి" అన్నాడు గుర్నాథం.

"ఆసక్తితోపాటు రిసెర్చి చెయ్యడానికి తెలివితేటలు, పట్టుదల, కష్టపడి పనిచెయ్యడం

ఇవి కూడా చాలా ముఖ్యం" అంది వేదవతి.

ముక్త విషయంలో మనకింక దిగులేలే దనీ, ఇంటికి బయలుదేరవచ్చనీ అనుకున్నారు ముక్త తల్లితండ్రులు.

"బిల్డింగ్‌కీ బిల్డింగ్‌కీ మధ్యదూరం ఎక్కువ. రాత్రి పూట ఇటు అటు తిరగడం కష్టం" అంది జయంతి.

"మన అమ్మాయి ఒకర్తే ఉండదుకదా. హాస్టల్స్‌లో చాలామంది ఉంటారు" అన్నాడు గుర్నాథం.

తల్లితండ్రులతోపాటు స్టేషన్‌కి వెళ్ళింది ముక్త. రైలు కదిలే సమయానికి ముక్త కళ్ళలో నీరు సుడులు తిరుగుతోంది. జయంతి ఫ్లాట్‌ఫారంవైపు చూడ్డమే లేదు. రైలు ముందుకు పోతుంటే గుర్నాథం చెయ్యి ఊపడం అలా దూరంగా కనిపిస్తోంది.

ముక్తకి తోడుగా వచ్చిన హాస్టల్ మేట్స్ చందన, సరోజ, "ముక్తా ఊరుకో. మేం అందరమూ నీలాగే చదువుకుందుకి వచ్చిన వాళ్ళమే. అస్తమానూ దేనికో దానికి శలవులు ఉంటూనే ఉంటాయి. నాలుగురోజులు కలుపుకుని ఇంటికెళ్ళిపోవచ్చు ఏ స్ట్రైకో వస్తే ఇంకా ముందే పరిగెట్టవచ్చు" అంది సరోజ.

అందరూ నవ్వుకున్నారు.

"నేను ఒక్కదాన్నీ వెళ్ళి జాయిన్ అవగలనని ఎంత చెప్పినా వినలేదు. అమ్మానాన్నా ఇద్దరూ వచ్చి, వార్డెన్‌కి, సూపర్‌వైజర్‌కి ఒకటే అప్పగింతలు. నాకేదోలా అనిపించింది" అంది ముక్త.

"తల్లితండ్రులకి, పిల్లల వయసుతో నిమిత్తంలేదు. వాళ్ళకి ఎప్పటికీ పసిపిల్లలుగానే కనిపిస్తారు" అంది సరోజ.

ముగ్గురూ యూనివర్సిటీ బస్ ఎక్కారు. బస్‌లో ఉన్న నిత్యానంద్ ముక్తని పలకరించేడు. పక్కనే ఉన్న రంజిత్, సాగర్‌లని పరిచయం చేశాడు.

యూనివర్సిటీ స్టాప్ రాగానే బస్ దిగి ఎవరి హాస్టల్స్‌కి వారు నడుస్తున్నారు.

"హాస్టల్ బిల్డింగ్ రాగానే రూంకి చేరుకున్నట్టు కాదుకదా. గుట్టలమీద బిల్డింగ్స్ చూడ్డానికి చాలా అందంగా ఉన్నాయి కానీ బోలెడన్ని మెట్లెక్కాలి" అంది ముక్త.

"మీరేహాస్టల్‌లో ఉంటున్నారు? అడిగేడు రంజిత్.

"అన్నపూర్ణ! మీరు? " అంది ముక్త.

"నేను కాంచనగంగ"లో అన్నాడు రంజిత్.

అన్నపూర్ణకి మారవలసిన పక్క రోడ్డు వచ్చింది. అతనికి గుడ్‌నైట్ చెప్పి సరోజ, చందన, ముక్త ముందుకి నడిచేరు. రూంకి వెళ్ళి ఫ్రెషప్ అయి కామన్ హాల్లోకి వచ్చేసరికి అప్పటికే కొంతమంది అమ్మాయిలు టి.వి.లో 'న్యూస్' వింటున్నారు. మరి కొంతమంది గుంపులుగా చేరి మాట్లాడుకొంటున్నారు. కొంతమంది న్యూస్ పేపర్లు, మేగజైన్స్ తిరగేస్తున్నారు.

కొంచెంసేపు న్యూస్ చూసి చందన "ముక్తా భోజనం చేద్దాంరా" అంటూ డైనింగ్ హాల్‌వైపు నడిచింది.

ముక్తకి తల్లితండ్రులు వెళ్ళిపోయిన దిగులుతో అసలు ఆకలి అనిపించడంలేదు. టేబుల్‌మీద ఉన్న మేకుల్లాంటి అన్నం, బీన్స్ కూర, దొండకాయకూర చూసేసరికి మరింత విరక్తి వచ్చి, "కాస్త మజ్జిగ తాగుతా! ఆకలిగా లేదు" అంటూ మజ్జిగ తీసుకొంది.

మిగిలిన వాళ్ళు భోజనం చేస్తూ ముక్తతో "పేరెంట్స్ వెళ్ళిపోయేరని భోజనం మానేస్తే ఎలా? రేపటికి సర్దుకొంటావులే" అంటూ ముక్తని మాటల్లోకి దింపేరు. సుజాత క్లాస్ మేట్, హరిణి కనిపించగానే "హరిణీ! ఈ రోజైనా నాకాపుస్తకం ఇస్తావా? " అంది.

"ఏ పుస్తకం" అర్థంకానట్టు మొహం పెట్టింది హరిణి.

"అదే కొత్తగా వచ్చింది ఎలిమెంటరీ నాలెడ్జి ఇన్ సోలిడ్ స్టేట్"

"అదా! నిన్న సాయంకాలం స్వప్న అడిగి తీసుకెళ్ళింది. తను డే స్కాలర్ కదా రేపు తెస్తే ఇస్తా" అంది హరిణి.

సుజాత ప్రాణం ఉసూరుమంది "ఆఫ్ట రాల్ లైబ్రరీ పుస్తకం ఓసారి ఇవ్వడానికి ఎంతగొడవ చేస్తోందో!" పక్కనే ఉన్న చంద నతో అంది.

"ఈ సమస్యలు మనకు మామూలే. లైబ్ర రీలో ఒక్కొక్క పుస్తకానికి నాలుగు కాపీలు ఉంటాయి. కొందరు స్టూడెంట్స్ పుస్తకాలు సిలబస్‌నిబట్టి ముందే తీసుకొని, వాళ్ళు ఆ పుస్తకం అవసరం తీరేక, వాళ్ళ స్నేహితుల కిచ్చి వాళ్ళ దగ్గర తమకవసరమైనవి తీసు కొంటూంటారు. వాళ్ళ పేరుమీదే తేదీలు మధ్యమధ్యలో మార్పించుకొంటూంటారు. ఒకవేళ లైబ్రరీ కార్డు లేకపోతే పుస్తకాన్ని వేరే షెల్ఫులో పుస్తకాల మధ్య దాచేస్తూం టారు" అంది చందన.

"నేనా పుస్తకం ఎప్పటికీ ఉంచుకొం టానా? ప్రొఫెసర్ మంచి పుస్తకమన్నారని ఓసారి చూసి అవసరమైనవి నోట్‌చేసుకొని ఇచ్చేస్తాను కదా!" అంది సుజాత.

"నీదగ్గర ఆ అమ్మాయికి అవసరమైన పుస్తకం ఉంటే అది తీసుకొని నీకు నువ్వడి గిన పుస్తకం ఇస్తుంది. ఒకోప్పుడు మొగపి ల్లలే కొంత మెరుగు. మనం అడిగితే వాళ్ళ దగ్గర లేకపోయినా ఎవరినైనా అడిగి తెచ్చి స్తారు" అంది చందన.

"కాలేజీలో మేమందరం ఎవరినైనా పుస్త కాలు, నోట్సులు, పాత క్వశ్చన్ పేపర్లు అడిగి తీసుకొనేవాళ్ళం. దీనికింత ప్లాను, ఈ రోజు, రేపు, అనడం ఇక్కడే చూశాను. నాకా పుస్తకం హరిణి ఇవ్వదంటావా? "

"మళ్ళీ మొదలుకి వచ్చేవు. నీ దగ్గరున్న పుస్తకాలల్లో ఆ అమ్మాయికి కావలసిన పుస్తకం ఉందనుకొంటే ఇస్తుంది"

"అంటే లైబ్రరీ పుస్తకం కూడా అందరికీ అందుబాటులో ఉండదన్నమాట"

"ఇంటర్నల్ ఎసెస్‌మెంట్ కదా. స్టాఫ్ ఏ పుస్తకాలు రిఫర్ చేస్తే ఆ పుస్తకాలు ఆ సెమిస్టరంతా లైబ్రరీలో కనిపించవు. ముందు ఎవరికి దొరికితే వాళ్ళు తమ కంట్రోలులోనే ఉంచుకొంటారు"

భోజనాలు ముగించి రూంకి చేరబోతూ బాల్కనీలో నిలబడి ముక్త, చందన, సరోజ చిన్న చిన్న గుట్టల మీద భవనాలలో వెలిగే దీపాల అందాలు చూస్తూంటే, వార్డెన్ వర దరాజేశ్వరి రౌండ్స్‌కి వెళుతూ వచ్చింది.

ముక్తతో "బాగా సెటిల్ అయ్యేవా? నలు గురూ పరిచయమైతే హోమ్‌సిక్ అనిపిం చదు" అంది.

"మేడమ్ ఇక్కడ భవనాలన్నీ ఇలా గుట్ట లమీద కట్టేరేమిటి? మెట్లు చాలాసార్లు ఎక్కడం, దిగడం కష్టం కదా" అంది ముక్త.

"మీరు పదిసార్లు ఎక్కడకీ తిరగకుండా బుద్ధిగా చదువు పూర్తిచేసుకొంటారనే సదు ద్దేశం కావచ్చు ఈ యూనివర్సిటీ మొదటి వైస్‌ఛాన్సులరే ఈ స్థలాన్ని యూనివర్సిటీ కట్టడానికి ఎంపికచేశారుట. ఆయన 'పర్వ తారోహణ' విద్యలో ప్రసిద్ధులట. మొదట గుట్టలమధ్య రేకు షెడ్లు కట్టి అందులో పని చేసేవారట. ఏదైనా ముఖ్యమైన విషయం చర్చించవలసి వచ్చినా, ఏదైనా నిర్ణయం తీసుకోవలసి వచ్చినా, పదండి ఆ గుట్టమీ దకి ఎక్కి మాట్లాడుకొందాం అనే వారట. ఆయనతో పాటు, గుట్ట ఎక్కలేక మిగిలిన వారికి అవస్థగా ఉండేదట. ఆయనకి నేల మీద ఉన్నప్పుడు ఏ పని చెయ్యడానికి ఊపి రాడదుకాబోలు అనుకొనేవారుట. కొందరు 'స్మార్ట్‌గాళ్ళు' పర్వతారోహణలో షార్టుటైం కోర్సు తీసుకొన్నారుట" అంది వార్డెన్ వరద.

అందరూ నవ్వుకొన్నారు.

"ఎక్కడం, దిగడం కొంతశ్రమైనా, ఎంతో మనోహరంగా ఉంది క్యాంపస్. అన్ని రూమ్సులోకి మంచి గాలి, వెలుతురు" అంది ముక్త.

వార్డెన్ వెళ్ళగానే, "అయ్యో మాటలలో

పడి మరచిపోయేను. నా శాంపిల్స్ చూసు కోవాలి. లాబ్‌కి వెళ్ళాలి" అంది చందన.

"నేనూ వస్తా. అలా తిరిగివద్దాం" అంది ముక్త.

ఇద్దరూ, 'రోబోట్ సెంటర్' మీదుగా లాబ్‌వైపు నడుస్తున్నారు. రంజిత్ కనిపించి ఏదో మాట్లాడబోయేడు.

"సారీ! రంజిత్ ఇప్పుడు కాదు. మరోసారి మాట్లాడుకొందాం. నేను కౌంటర్‌లో పెట్టిన శాంపిల్స్‌కి టైం అయిపోయింది. మిస్‌ప్లేస్ అయితే కష్టం" అంటూ, ముక్తతోపాటు, చందన ముందుకి నడిచింది.

లాబ్‌లో పనిపూర్తయ్యేక 'రోబోట్ సెంటర్' మీదుగా వెళుతూ, తెల్లకాగితాలు, పెన్నులు కొనుక్కోవాలనుకొంది ముక్త. తను పర్స్ వెంటతెచ్చుకోలేదని గుర్తుకి వచ్చి "రేపు తీసుకొంటాను" అనుకుంది ముక్త.

"టీ తాగుతావా" అంది చందన.

"వద్దు" అంది ముక్త.

ఇద్దరూ నడుచుకొంటూ రూం చేరుకొన్నారు. మర్నాడు సాయంకాలం రోబోట్ సెంటర్‌కి వెళ్ళి, ముక్త తనకి కావలసిన వస్తువులు కొనుక్కొంది.

"హలో నిత్యా! ఎయిర్‌పోర్టు నించేనా రాక? "

ఎవరో అడుగుతూంటే ముక్త వెనక్కి తిరిగి చూసింది.

"ఆ! అవును" అని ఇటు తిరిగి "హలో ముక్తా, చేతిలో బోలెడు సరంజామా! వర్క్ మొదలుపెట్టేరా? " అన్నాడతను.

"కాగితాలు కొనగానే వర్క్ మొదలుపెట్టినట్టేనా? "

"కాఫీ తాగుతారా? రోబోట్ సెంటర్‌లో కాఫీ చాలా బాగుంటుంది" అన్నాడు నిత్యా.

"సరే" అంది ముక్త.

తనతోపాటు ఉన్న శర్మని పరిచయం చేస్తే శర్మ కొంచెంసేపు ఉండి పనుందంటూ వెళ్ళిపోయేడు.

"ఎయిర్‌పోర్ట్‌కి ఎందుకు? ఎవరైనా బంధువులుగానీ స్నేహితులుగానీ వచ్చేరా? " అడిగింది ముక్త.

"బంధువులూ, స్నేహితులూనా? మా ప్రొఫెసర్ చాలా బిజీ. దేశమంతటా ఈ కమిటీ మీటింగ్, ఆ సెమినార్ అని తిరుగుతూంటాడు. నాథీసిస్ లాస్ట్ చాప్టర్ గురించి డిస్కస్ చెయ్యాలని మూడునెల్ల నుంచి చూస్తుంటే ఎక్కడా! ఎప్పుడూ బిజీ. డిపార్టుమెంటులో అసలు మాట్లాడడానికి కుదరడం లేదు. ఇలాంటి ప్రొఫెసర్స్ సూపర్‌వైజర్ అయితే స్టూడెంట్ ప్రొఫెసర్ వెళ్ళే ఫ్లైట్ తెలుసుకొని ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళి, అక్కడే డిస్కస్ చేస్తూంటారు. నేనూ ఈ మాటు ఆపనే చేశాను. ఫ్లైట్ అనుకోకుండా డిలే అయితే స్టూడెంట్‌కి మరింత కలిసివస్తుంది"

"ఇంతకీ మీరెళ్ళిన పనయిందా? "

"ఆ అయింది"

"ఎయిర్‌పోర్ట్ ప్రొఫెసర్లు కూడా ఉంటారన్నమాట"

నిత్యా నవ్వేశాడు. "ఎయిర్‌పోర్ట్ ప్రొఫెసర్ టైటిల్ చాలా బాగుంది" అన్నాడు నిత్యా.

ఇంతకుముందు పలకరించిన శర్మ మళ్ళీ కనిపిస్తే "ఇప్పుడే రెండు నిమిషాలు మీరిక్కడే కూర్చోండి" అంటూ ముక్తతో చెప్పి నిత్య శర్మ ఉన్నవైపు వెళ్ళాడు.

ముక్త 'రోబోట్ సెంటర్' నాలుగువైపులా ఆసక్తిగా చూస్తోంది.

క్యాంపస్‌కి మధ్యస్థంగా విశాలమైన ఆవరణలో మూడు పక్కలా రకరకాల షాపులు, ఓ పక్క పెద్ద బస్‌స్టాండ్, మధ్యలో లాన్స్, లాన్స్‌కి మధ్యలో 'జయంట్ రోబోట్ బొమ్మ' వికృతంగా భయంకరంగా, హాస్యంగా, ఏ భావం తలుచుకొంటే ఆ భావం వచ్చేలా ఉంది.

మానవుడినీ అతడి శాస్త్రపరిజ్ఞానాన్నీ, తెలివితేటలనీ భగవంతుడు మంత్రించి, సవాల్ చేశాడా? అన్నట్టు నిస్తేజంగా చలనంలేని కళ్ళతో ముక్కలు ముక్కలుగా అతికినట్టున్న

దేహంతో, ప్రతి కొత్త మనిషీ ఇదేమిటని ప్రశ్నించేలా కనిపిస్తోంది 'రోబోట్ బొమ్మ'.

నిత్యా వచ్చేడు "సారీ ముక్తా మిమ్మల్ని కూర్చోబెట్టేను" అంటూ.

"ఆ.. ఫరవాలేదు. ఈ బొమ్మేమిటి? మహానాయకుడి ఇనప విగ్రహంలా?"

"అదా! ఆ బొమ్మ ఉన్నందుకే ఈ సెంటర్‌కి 'రోబోట్ సెంటర్' అన్న పేరు వచ్చింది. చూస్తున్నారు కదా! ఈ చెట్లమధ్య లాన్స్‌లో వందలాది స్టూడెంట్స్, తదితరులు గుంపులుగా కూర్చొని, ఎన్నో విషయాలు చర్చిస్తూంటారు. టూత్‌పేస్టు దగ్గర నుంచి సైన్స్ పుస్తకం వరకూ ఏది కావాలన్నా 'రోబోట్ సెంటర్'కి రావలసిందే. ఒక్కమాటలో చెప్పాలంటే ఓ వస్తువు కావాలన్నా, ఓ మనిషిని పట్టుకోవాలన్నా రోబోట్ సెంటర్‌లో తప్ప ఇతరత్రా సాధ్యంకాదు. మొత్తం విశ్వవిద్యాలయానికే ఆయువుపట్టు లాంటిది రోబోట్ సెంటర్. ఉదాహరణకి ఈ శర్మకోసం నాలుగురోజులనించీ కనిపిస్తాడేమోనని చూస్తున్నాను. చూశారా! ఎలా కలుసుకోగలిగేనో. ఇంక ఈ రోబోట్ బొమ్మ అంటారా! అదో గాథ"

"నిత్యా చెప్పు నిత్యా ఆ గాథేమిటో ప్లీజ్"

"రాజధానిలో ఉన్న విశ్వవిద్యాలయాల యాజమాన్యానికి యూనివర్సిటీల్లో సరికొత్త కోర్సు 'ఆర్ట్‌ఫిషియల్ ఇంటిలిజెన్స్' రూపకల్పన చెయ్యాలనే సత్సంకల్పం కలిగిందిట. ఆ యాజమాన్యంలో మెంబర్ ఓ ప్రసిద్ధ పారిశ్రామికవేత్త, తన మేనల్లుడు, రోబోట్స్‌లో స్పెషలైజేషన్ చేసేవాడు అమెరికాలో ఉన్నాడని చెప్పేరు. కాని ఆ మేనల్లుడికి తగినంత అనుభవంలేదు. పారిశ్రామిక వేత్తకేమో ఎలాగైనా తన మేనల్లుడు కొంత కాలం ఉండివెళ్ళటానికి స్వదేశానికి రావాలనే పట్టుదల. అందుకోసం అధునాతనమైన మన యూనివర్సిటీకి 'ఆర్టిఫిషియల్ ఇంటిలిజన్స్' డిపార్టుమెంటును మంజూరు చేయించేరు. వడ్డించేవాడు మనవాడైతే సామెతలా అనుభవంలేని ఆ మేనల్లుడే సెలక్షన్ కమిటీలో ఇంద్రుడూ, చంద్రుడూగా పొగడబడి ప్రొఫెసర్ అండ్ హెడ్‌గా వాలేడు"

"వాలేడా"

"సామాన్యులైతే పాకుతూ, అడుగులు వేస్తూ నడిచి ఒక్కోమెట్టు ఎక్కుతారు. గాడ్ ఫాదర్స్ ఉన్న వాళ్ళు పైపదవి చేరుకోడానికి అంచెలంచెలుగా కాకుండా అకస్మాత్తుగా వాలుతుంటారు. అలా వాలిన వెంటనే రోబోట్స్ నిర్మాణానికి, ఓ మెగాగ్రాంటుకి అప్లికేషన్ పెట్టేరు కొత్త ప్రొఫెసర్‌గారు. కొత్తగా వస్తున్న శాస్త్రవిజ్ఞానాన్ని ప్రోత్సహించాలనే వేడిలో ఉన్న కమిటీ గ్రాంటును అలవోకగా ఇచ్చింది.

ప్రొఫెసర్‌గారు రోబోట్ గురించి చదువుకొన్నారు కాని వాటిని నిర్మించే అనుభవం లేక పని కొరుకుడుపడలేదు. ప్రొఫెసర్‌గారు ఇక స్వశక్తి లాభంలేదనుకొని ఓ జాయింట్ ప్రాజెక్టుగా అమెరికాకి ప్రోగ్రాంని మార్చేరు. ప్రొఫెసర్, ఆయన స్టూడెంట్సు ఆ వంకన బోలెడుసార్లు అమెరికా వెళ్ళేరు. ముఖ్యంగా మన ఎండాకాలం అమెరికా వెళ్ళి తీవ్రమైన కృషిచేసేవారు. చివరకి స్వంత పనులు చక్కబెట్టుకోడం జరిగిందే తప్ప రోబోట్ నిర్మాణం ఆకళింపు చేసుకోలేకపోయేరు. అమెరికా ప్రయాణాలతో విసిగెత్తిన ప్రొఫెసర్, అసలు అమెరికాకన్న జపాన్‌లో రోబోట్ విజ్ఞానం చవకగా పొందవచ్చునంటూ జపాన్‌కి జాయింట్ ప్రాజెక్ట్‌ని మార్చారు.

జపాన్‌లో అమెరికాలోలేని భాషా సమస్య పెద్ద బెడదగా తయారైంది. వాళ్ళ సాంకేతిక పరిజ్ఞానం క్షుణ్ణంగా నేర్చుకొనే ఉద్దేశ్యం ప్రొఫెసర్‌గారికి ఉన్నా వాళ్ళ భాషలో ఏం చెబుతున్నారో అర్థమై చావడంలేదు. కావాలంటే మా భాషలో కోర్సు తీసుకొని అర్థం చేసుకోండంటున్నారు. జపాన్‌లో ఓ రోబోట్ బొమ్మ బేరం చేసుకొని ఏకీలుకా

కీలు విరిచి పెట్టిల్లో పెట్టి ఇండియాకి ఎత్తుకెళ్ళడమే తరుణోపాయమనీ, ఆ తర్వాత అదే మోడలులో మరికొన్ని తయారుచేయడానికి ప్రయత్నించాలనుకొన్నారు.

అనుకొన్నట్టుగానే రోబోట్ బొమ్మ ముక్కలని దిగుమతి చేసుకొని తిరిగి అతికించేరు. రోబోట్‌ని సిగ్నల్‌తో పనిచేయించడానికి ప్రయత్నిస్తే, పని చేయించడానికుపయోగించే రిమోట్ కనిపించలేదు. రిమోట్ కోసమని ప్రొఫెసర్‌గారు మళ్ళీ జపాన్ వెళ్ళేరు. వాళ్ళతో ఇంగ్లీషులో, చాలా కోపంగా అరిచేరు. వాళ్ళు జపనీస్‌లో ఇంకా ఘాటుగా అరిచేరు. ప్రొఫెసర్‌గారు తన టైం దండగని వచ్చేశారు. ప్రొఫెసర్‌గారు ఉదాసీనంగా ఉన్నట్టు తెలిసి గాడ్‌ఫాదర్స్ జాతికి చెందిన కొందరు శాస్త్రవేత్తలు పనిగట్టుకొని దేశాధినేతకి చెప్పి అంతరిక్షపరిశోధనలో రోబోట్ నిర్మాణానికి 'డైరక్టరుగా' మరో సంస్థకి పంపించేశారు. ఒకోప్పుడు స్థలం మార్పిడి నైరాశ్యాన్ని దూరం చేస్తుంది కదా!

అతికించిన రోబోట్ బొమ్మ చాలాకాలం గొడౌన్‌లో పడి ఉంది.

కొంతకాలానికి "శాస్త్రవిజ్ఞానం పరిశోధనాలయాల్లోంచి సామాన్య మానవుడి అవసరాలకి" అన్న విషయంమీద ఇంటర్నేషనల్ వర్క్‌షాప్ జరిగింది. అనేకమంది విదేశీయులు, స్వదేశీయులు వచ్చి గంటలతరబడి చర్చలు జరిపేరు.

మధ్యాహ్నం భోజనసమయంలో కాన్ఫరెన్స్‌కి వచ్చిన వారితోపాటు భోజనం చేస్తున్న గోడౌన్ అధికారికి ఓ గొప్ప ఐడియా వచ్చింది. ఫలితంగా ఆ రోబోట్ పరిశోధనాలయాల గోడౌన్‌లోంచి బయటకి వచ్చి శిలావిగ్రహంలా ఇక్కడ వెలసి సామాన్య, అసామాన్య మానవులనే తేడాలేకుండా, అందరికీ శాస్త్రవిజ్ఞానాన్ని రోజూ పంచి ఇస్తోంది"

చుట్టూ బోలెడు మంది స్టూడెంట్స్ నిత్యా కథ ఆసక్తిగా వింటూ కనిపించేరు. ఓ స్టూడెంట్ "అబ్బా! లైబ్రరీనించి వస్తున్నానేమో తల దిమ్మెత్తిపోయింది. ఇంత చిత్రమైన కథ విని రిఫ్రెష్ అయ్యేను" అన్నాడు.

"ఇంతకీ ఈ కథ నిజంగా జరిగిందేనా?" అంది ముక్త.

"బాగుంది రాజుగారి నోట్లోంచి తాటాకు పడిందిట అనే వదంతి, రాజుగారి నోట్లోంచి తాటిచెట్టు ఊడి పడిందట అనేవరకూ పోయిందిట. నాకు ఎవరో చెబితే నే చెప్పిందే తప్ప నిజానిజాల ప్రసక్తే లేదు" అన్నాడు నిత్యా.

రోబోట్ సెంటర్‌లో దీపాలు ఆరిపోయి ఒక్కసారి కటికచీకటి అలుముకొంది. "అమ్మో" అనే సన్నటి గొంతుతో అమ్మాయి కేక, ఓ టార్చ్ వెలుగు, దానిచుట్టూ స్టూడెంట్స్ కనిపిస్తున్నారు. లైట్లు వెలిగాయి. అరచిన అమ్మాయిని ఓ ఎర్ర తేలుపిల్ల కుట్టినట్టుగా గమనించేరు. తేలుపిల్లని చంపేశారు. తేలుకుట్టిన అమ్మాయిని బైక్‌మీద కూర్చోబెట్టుకొని ప్రథమచికిత్స చేయించడానికి తీసుకెళ్లాడు రంజిత్. అతని వెనక మరికొంతమంది గుంపుగా వెళ్ళారు.

మాకు ఏం జరిగినా ఎవరో ఒకరు ఆదుకొంటారనే ధైర్యం విద్యార్థుల మొహాల్లో కనిపిస్తోంది.

"మా వూళ్లో అయితే తేలు కుడితే మంత్రం వేస్తారు" అంది విద్య.

నడుస్తున్న ముక్త తను కొన్న పెన్స్ ప్యాకెట్ చేతిలో లేకపోవడం గమనించుకొని "అయ్యో! నా ప్యాకెట్ లాన్స్‌లోనే మరచిపోయినట్టున్నాను" అంది.

"అంత మతిమరపు అయితే ఎలాగండీ! రిసెర్చ్ మొదలు కాకుండానే ఆబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసర్ అయిపోతున్నారు" అన్నాడు నిత్యా.

"నే వెళ్ళి చూస్తా" అంటూ సాగర్ వెళ్ళి ప్యాకెట్‌తో తిరిగివచ్చేడు.

'లెక్చర్లిచ్చే నిత్యా, క్రియాశీలి సాగర్, పరో

పకారి రంజిత్ ఇలా ఎన్నో రకాల వ్యక్తి త్వాలు అనుకొంది ముక్త.

★ ★ ★

హాస్టల్ రూంలో చదువుకొంటూ టీవీ చూస్తూ, ఎవరి పనులలో వాళ్లు నిమగ్నులై ఉన్న విద్యార్థులకి ఏవో అరుపులు, కేకలు వినిపించాయి. కొందరు హాస్టల్ మెయిన్ హాలుకి వచ్చారు. నీలగిరి హాస్టల్‌వైపు నుండి కొంతమంది మగపిల్లలు, ఆడపిల్లలు గట్టిగా మాట్లాడుకొంటున్నట్టు వినిపిస్తోంది. ఏం మాట్లాడుతున్నారో స్పష్టంగా తెలియ డంలేదు. గాలి వీచినపుడల్లా నాలుగు ముక్కలు ఇటు పక్కకి చెవిలోకి విసిరే స్తోంది తప్ప ఏదీ సరిగా వినిపించడంలేదు.

"అలా వెళదామా" అంది నీలిమ.

"పనిలేకపోతేసరి! ఏదో కుక్స్‌తో గొడవ పడుతూ ఉండి ఉంటారు" అంది విద్య.

"అమ్మాయిలు వెళ్లి అబ్బాయిలకి కంప్ల యింట్ చేస్తారు. అబ్బాయిలు ఛాతీలు పెంచేసి మీకు మేం అండగా ఉన్నామంటూ చదువు సంధ్యలు కట్టిపెట్టి, మెస్‌మీద దాడికి బయలుదేరుంటారు" అంది చందన.



యూనివర్సిటీ హాస్టల్స్‌లో వంట, వడ్డన అన్నీ కాంట్రాక్ట్ పద్ధతి మీదే జరుగుతున్నాయి. క్వాలిటీ మెయిన్‌టైన్ చేస్తూ శుభ్రత పాటిస్తూ ప్లేటుకింత అని ఛార్జీ చేస్తారు. నెలకోసారి బిల్ ఇస్తాడు కంట్రాక్టరు.

యూనివర్సిటీకి, స్టూడెంట్ మెస్ బిల్‌కి డైరెక్టుగా సంబంధంలేదు. అంతకుముందు యూనివర్సిటీయే మెస్ నడిపినపుడు చాలా నష్టంవచ్చేది. సూపర్‌వైజర్ నెల జీతం తీసుకొనేవాడేకాని ఏదీ పట్టించుకొనేవాడు కాదు. కుక్స్, హెల్పర్స్ ఎవరిష్టం వచ్చినట్టు వాళ్ల సరుకు ఇంటికి తీసుకుపోయేవారు. పాల వాళ్లకీ, కూరలవాళ్లకి, దినుసులవాళ్లకీ, వర్కర్స్‌కి మధ్య చాలా అనుబంధం ఉండేది. దాంతో ఇటు విద్యార్థి, అటు సంస్థ ఇద్దరూ నష్టపోయేవారు.

ఇపుడు కాంట్రాక్టు పద్ధతివల్ల వంటవాళ్లు క్వాంటిటీ, క్వాలిటీ విషయంలో జాగ్రత్త పడుతున్నారు. కానీ కాంట్రాక్టర్స్‌కి అప్పుడప్పుడో సమస్య వచ్చి పడుతోంది. నెలనెలా బిల్ ఇచ్చినప్పుడు ఒక్కో విద్యార్థి బిల్లు చెల్లించడు. ఈ రోజు, రేపు అంటూ ఒకోసారి నెలకూడా దాటెయ్యడం, ఓ నెల గ్రేస్ పీరియడ్‌గా ఊరుకొని, తర్వాత వంటవాళ్లు భోజనం బంద్ చేయడం జరుగుతుంటుంది. విద్యార్థులే వాళ్లలో వాళ్లు మాట్లాడుకొని డబ్బు సర్దుబాటు చేస్తూంటారు. ఒక్కో విద్యార్థి దగ్గర డబ్బులేకపోవచ్చు, లేదా తల్లి తండ్రులు పంపిన డబ్బు వేరేరకంగా ఖర్చు పెడుతూ, ఆకలేసి వంటవాడితో తగువు పెట్టుకోవచ్చు. హీరోలుగా వెలగాలనే కుర్రకారు అలాంటివారికి తోడై అందరూ కలసి వంటవారిని, సర్వర్‌ని కొట్టడం జరుగుతుంటుంది. ఇదీ అలాంటి సంఘటనేమో అనుకొన్నారు అక్కడున్న అమ్మాయిలు.

రాత్రి తొమ్మిదిన్నరవుతోంది. స్వర్ణ, మంజుల మెట్లెక్కి మీదకి వచ్చారు.

"అక్కడేదో గొడవ జరుగుతున్నట్టుంది? అందో అమ్మాయి.

"అదా! హిమాలయ హాస్టల్లో శశికళ అనే అమ్మాయి తన భర్త వస్తే తనతోపాటు రూంలో ఉండనిచ్చిందిట. శశికళ రూంమేటు జ్యోతి ఊరినించి వచ్చి 'నేనెక్కడికి పోయి ఉండాలి? అమ్మాయిల హాస్టల్లో మగవాళ్లని రాత్రిపూట ఉండనివ్వకూడదు' అందిట.

శశికళ "నా భర్త నాకోసం వస్తే ఎలా పొమ్మనన"ని అంటుందిట.

"ఇది వరకు ఇలా చాలాసార్లు జరిగింది. ఎప్పటికప్పుడే ఊరుకొంటూ ఇంకొకరి రూంలో సర్దుకొంటున్నాను. ఈ సంగతి నేను వార్డెన్ వరదరాజేశ్వరికి చెప్పినా వినిపించుకోవడంలేదు" అంటోంది జ్యోతి.

"ఆ హాస్టల్‌కీ వార్డెన్ వరదరాజేశ్వరేనా"

"ఆ హాస్టల్ వార్డెన్ లీవులో ఉన్నారు. ఆవిడ వచ్చేదాకా వరదరాజేశ్వరే ఆ హాస్టల్‌కీ వార్డెన్. జ్యోతికి ఏది కావాలన్నా తలుపు తడుతూ శశికళనీ, భర్తగారినీ డిస్టర్బ్ చెయ్యవలసి వస్తోందనీ, తననీ న్యూసెన్స్ నించి కాపాడమని చెప్పడానికి మరింతమంది అమ్మాయిలని కలుపుకొని హాస్టల్ ముందు సమావేశమైంది. చుట్టూ నలుగురూ చేరారు. అదే అక్కడ గడబిడ.

"వార్డెన్ పట్టించుకోకపోవడమేమిటి? వార్నింగిచ్చి భర్తగారిని బయటికి పంపక"

"ఆవిడ వీక్ పాయింట్ ఆవిడది. ఆవిడ ఉమెన్స్ లిబ్ మూవ్‌మెంట్‌లో ఏక్టివ్‌మెంబర్. ఈవిడ స్టూడెంట్‌గా ఉన్నప్పుడు బోయ్‌ఫ్రెండ్స్‌నే హాస్టల్‌లో ఉండనిచ్చేదిట. ఆఫ్టరాల్ కట్టుకున్న భర్తనే కదా శశికళ రానిచ్చింది అనుకొందేమో!"

"వరద రాజేశ్వరీ, బోయ్‌ఫ్రెండ్ హాస్టల్లో ఉన్నప్పుడు మనం పుట్టేమో లేదో ఈ సంగతులు నీకెలా తెలుసు? "

"వరద, మా పిన్ని క్లాస్‌మేట్స్. మొన్న శలవులకి. వెళ్లినప్పుడు ఏదో మాటల్లో మా పిన్ని చెప్పింది"

ఇంతలో రజనికి ఫోన్ వచ్చింది తండ్రి పోయేరని. రజని ఎక్కడుందో వెతకడం కోసం నలుగురూ నాలుగు పక్కలకి చెల్లాచెదరయ్యేరు.

తండ్రిపోయేడని తెలుసుకొన్న రజని దుఃఖాన్ని ఎవ్వరూ ఆపలేకపోతున్నారు. రజనికి తోడుగా వెళ్లడానికి ఓ ఇద్దరమ్మాయిలు ముందుకి వచ్చారు. ఎలా తెలిసిందో రంజిత్ ఇంకో నలుగురు స్టూడెంట్స్‌ని వెంటబెట్టుకువచ్చాడు. ఫ్రెండ్స్ గబగబ రజని సూట్‌కేసు సర్దేరు. రంజిత్‌వాళ్లకి స్టేషన్ వరకూ సాయం వెళతానని చెప్పాడు.

రంజిత్ పరోపకారే కాని ఇలా ఎక్కడ పడితే అక్కడ ప్రత్యక్షమవుతుంటే అతనింకెప్పుడు చదువుకొంటాడో అనుకొంది ముక్త.



వార్డెన్ వరదరాజేశ్వరి రాజీనామా చెయ్యాలని స్టూడెంట్స్ పట్టుబడుతున్నారు.

విద్యార్థులేమో క్లాసులు లేవని తిరిగి వస్తున్నారు.

"అసలేమైంది? " అందో అమ్మాయి.

"పాత కథే. కొంచెం కొత్త మలుపు. జ్యోతిని శశికళ తన భర్త వచ్చేడంటూ మరో రూంలో సర్దుకోమందిట. కొంచెం సేపయ్యేక జ్యోతికి తలనొప్పి వచ్చి మాత్ర కోసం తలుపు తట్టేసరికి శశికళ చాలా కోపంగా తలుపు తీసిందిట. లోపల శశికళ భర్తకి బదులు ఇంగ్లీషు లెక్చరర్ జేజే ఉన్నారుట. ఈ మాట జ్యోతి కొందరమ్మాయిల దగ్గరంటే వాళ్లు వరదరాజేశ్వరిని తీసుకువచ్చేరు. శశికళ లెక్చరర్ జేజే తనకి 'షేక్స్పియర్ యుగం'లో సందేహాలుంటే అవి క్లియర్ చేస్తున్నారని తన భర్త కొంచెంసేపటిలో రావచ్చునని డిఫెండ్ చేసుకొంటోంది" అంది స్వర్ణ.

"షేక్స్పియర్ మహాశయుడు ఆడపిల్లల హాస్టల్ రూంలో అందునా పెళ్లయిన అమ్మాయి గదిలో, తలుపులు మూసుకొని మంచంమీద విశ్రమిస్తూ స్టూడెంట్ సందేహాలు తీర్చే పాత్ర ఏ నాటకంలోనైనా సృష్టించాడా? " అని అడిగింది చందన ఇంగ్లీషు విద్యార్థిని సుమని. చుట్టుపక్కల వాళ్లంతా నవ్వుకొన్నారు.

"వరదగారు వచ్చి ఏదో మాట్లాడుతున్నారు పదండి" అంటూ అటు పక్కకి వెళ్లేరు.

వరదని చూస్తూనే స్టూడెంట్స్ ఇంగ్లీషు లెక్చరర్ జేజే ఈ సమయంలో ఎందుకున్నారో కనుక్కోమన్నారు.

వరద, జేజే కళ్లతోనే పలకరించుకొన్నారు. జేజే తన పొడుగాటి జుట్టును వేళ్లతో సద్దుకొంటూ చక్కటి ఇంగ్లీషు యాక్సెంట్‌తో "అసలు నిన్నెందుకు పిలిచేరు వరదా? నువ్వెందుకు వచ్చావు? ఏమిటిదంతా? ఈ అమ్మాయి పాఠ్యాంశంలో కొన్ని డౌట్స్ అడిగితే వివరించి విడమరచి చెప్పడానికి వచ్చాను. ట్రాష్. ఈ దేశాన్ని బాగు చెయ్యలేం. ఈ మనుషుల్లో మార్పు రాదు. ప్రిమిటివ్ సొసైటీ" అంటూ ఇంగ్లీషులో చాలాచాలా విసుక్కొన్నాడు.

వరదరాజేశ్వరి విద్యార్థులకేసి తిరిగి "ఏముంది ఇందులో ఇంత గోల చేస్తున్నారు" అంది.

"జేజే మీరే పాఠం చెబుతున్నారు? " అన డిగింది తర్వాత.

జేజే పుస్తకం తీసి చూపించాడు.

"నోనో మేం దీనికి ఒప్పుకోం. ఇలా హాస్టల్ రూమ్స్‌లోకి జంట్స్ ఏటైంలో పడితే ఆ టైంలో వచ్చి తలుపులు మూసుకొం టూంటే రూం మేట్ ఏమవ్వాలి? మీరు ఫైనల్ వార్నింగ్ ఇవ్వాల్సిందే" అన్నారు కొందరమ్మాయిలు.

యూనివర్సిటీలో ఇంతకుముందు అమ్మా యిలు, అబ్బాయిలు కామన్ హాల్స్‌లో కలు సుకోటానికి, మాట్లాడుకోవడానికి అనుమతి ఉండేది. అంతేగానీ రూమ్స్‌లోకి వెళ్లడానికి ఒప్పుకొనేవారుకాదు. కొంతకాలానికి రూమ్స్ లోకి వెళ్లినా వార్డెన్స్ చూసీచూడనట్టు ఊరు కొనేవారు. అప్పుడప్పుడు విద్యార్థుల దగ్గర నుంచి కంప్లయింట్ వస్తే హాస్పిటల్‌లో విజిటింగ్ అవర్స్‌లాగ హాస్టల్ రూమ్స్‌కి కూడా విజిటింగ్ అవర్స్ పెట్టేరు. ఆ టైంలో ఎవరి రూంకి ఎవరైనా లింగ, వయో భేదాలు లేకుండా వెళ్లవచ్చు. అయితే అది సాయంకాలం అయిదు నుంచి ఏడు వరకు మాత్రమే. ఆ రకంగా చూసినా జేజే టైమింగ్స్ అతిక్రమించేడని వరదతో అమ్మా యిలు వాదించేరు. ఇంకెప్పుడూ ఇలా జర గడానికి వీలులేదని జేజేకి వార్నింగ్ ఇవ్వమ న్నారు.

"వార్నింగా? దేనికి? ఏమని వార్నింగ్ ఇవ్వాలి? డబ్బు తీసుకొంటూ పాఠం చెప్పని ఉపాధ్యాయులున్నారు. జేజే పాఠం చెప్పి అర్థం కాని విషయాన్ని స్టూడెంట్ దగ్గరకి వచ్చి మళ్లీ విడమరచి చెబుతు న్నారు. జేజే లాంటి ఉత్తమమైన ఉపాధ్యా యుణ్ణి తప్పు పడుతున్నారు మీరు. సంకుచి తంగా ఆలోచించకండి ప్లీజ్. ప్రపంచం అంతరిక్షానికి ప్రయాణమవుతుంటే మనం రిక్షాకోసం వెతుక్కునే స్థితిలో ఉన్నామంటే కారణం ఇలా చిన్న విషయాలని పట్టించు



కొని టైం దండగ చేసుకోవడంవల్లే. నా టైం ఇలాంటి చిన్నచిన్న విషయాలకి వేస్టు చేసు కోదలుచుకోలేదు. అమాయ్ సారీ! ఎవరి రూంలకి వాళ్లు వెళ్లి పనులు చూసుకోండి" అంది వరద.

వరద, జేజే ఆప్తమిత్రుల్లా మాట్లాడు కొంటూ నెమ్మదిగా నడుస్తూ వెళుతున్నారు.

"ఇక లాభంలేదు. స్టూడెంట్ లీడర్ రంజిత్‌తో చెప్పి విద్యార్థులంతా ఏకమై వీళ్లకి బుద్ధి చెప్పాలి" అందో అమ్మాయి.

"లాభం లేదు. వెంటనే వార్డెన్‌ని మార్చ మని అధికారులకో లేఖ పంపుదాం" అంది ఇంకో అమ్మాయి.

"శశికళా! రూంలోకి రాత్రి తొమ్మిది గంట లప్పుడు జేజేగారిని ఎందుకు రానిచ్చేవు? " అందో అమ్మాయి.

జరిగినదానికి కించిత్ విచారమనేది ఏకో శానాలేని శశికళ "నా హబ్బీ వస్తానని ఫోన్ చేస్తే తిండానికేమైనా దొరుకుతుందేమోనని రోబోట్ సెంటర్‌కి వెళ్లేను. అక్కడ లెక్చరర్ కలసి నేనా మధ్య అడిగిన డౌట్స్ క్లియర్ చేస్తానంటే రూంకి తీసుకువచ్చేను. ఇందులో అంత చెయ్యరాని నేరమేమిటో అర్థం కావడంలేదు" అంది.

"నీ భర్తకి సంగతి తెలిసి ఏమైనా అను కొంటే? "

"నా హబ్బీ మీలా నేరోమైండెడ్ మనిషేం కాదు. కొంచెం ఫార్వర్డ్‌గా ఉంటే చాలు. మీకందరికీ అసూయ. మీరు నాలా ఉండ లేరు. అవతల వాళ్లుంటే చూడలేరు. మీ బుర్ర తెరిచి చూస్తే మీకూ నాలాగే స్వేచ్ఛగా ఉండాలనే ఉంటుంది. అలా ఉండే అవకాశం, తెగువ లేక నా మీద పడి ఏడుస్తున్నారు" అంటూ రుసరుసలాడుతూ వెళ్లి రూం తలుపులు ధడాలున వేసుకొంది శశికళ.

★ ★ ★

ముక్తకి ఆరోజు డిపార్టుమెంటులో జరి గిన ప్రీథీసిస్ సెమినార్ చాలా ఆసక్తిక రంగా అనిపించింది. సెమినార్ అయ్యేక

నిర్వాహకులకు అభినందనలు చెప్పి లైబ్రరీ వైపు నడుస్తోంటే తోవలో రంజిత్ కలిశాడు.

"లంచ్ అవర్ దగ్గర పడుతుంటే లైబ్రరీకి వెళుతున్నారేమిటి? " అన్నాడు రంజిత్.

"ఈరోజు కాఫీతో బిస్కట్స్ బాగా తిన్నాలెండి" అంది ముక్త.

"ఏదైనా ఫంక్షనా"

"ప్రీథీసిస్ సెమినార్ ప్రొఫెసర్ కోలా స్టూడెంటుది. అతుల్ పాండే అని చాలా ఆసక్తికరమైన పని చేశాడు. కంటిన్యూ చేస్తే చాలా స్కోప్ ఉంది. అదే మాట నేనంటే ఏదో ఎడ్మినిస్ట్రేటివ్ జాబ్ వచ్చింది వెళ్లిపోతున్నానన్నాడు. ఇంతమంచి పని పొడిగించకుండా ఏకంగా లైనే మార్చేసుకొంటున్నాడంటే బాధ అనిపించింది. ఒక్క పాయింట్ కాకుండా నాలుగైదు విషయాల గురించి విస్తృతమైన పరిశోధన చెయ్యడానికి అవసరమైన డేటా సమకూర్చి పెట్టేడు. అందులో ఓ భాగం సత్యం చేస్తున్న పనికి చాలా దగ్గర" అంది ముక్త.

"మీకు ప్రొఫెసర్ కోలా దగ్గర చేరి ఈ పని కంటిన్యూ చెయ్యాలనుంటే చెప్పండి. నేను మాట్లాడుతాను" అన్నాడు రంజిత్.

"కోలా దగ్గరా? అసలు సత్యంగారి గ్రూప్‌తో వర్క్ చెయ్యాలనుకొన్నాను. అనుకోకుండా వేదవతిగారి గ్రూప్‌లో చేరాను. మళ్లీ ఇంకో మార్పా నెవ్వర్"

"ఇంకా అఫీషియల్ మీటింగ్స్ అవలేదు. ఈలోగా విద్యార్థికి ఇష్టమైన రిసెర్చిలైన్ ఎన్నుకొనే స్వేచ్ఛ ఉంది"

"సూపర్‌వైజర్‌ని మార్చమంటారేమిటి? నేను వర్క్ గురించి మాట్లాడుతుంటే మీరింకేదో మాట్లాడుతున్నారు" కొంచెం విసుగ్గా అంది ముక్త.

"మీరు కోలా దగ్గరకి మారాలనుకొంటే మాత్రం క్షణాల్లో పని. నేను మాట్లాడి ఏర్పాటు చేస్తాను" అన్నాడు రంజిత్.

ఇంతలో ఇంకో అమ్మాయి ముక్తతో మాటల్లోకి దిగటంతో రంజిత్ ఎవరితోనో కలసి వెళ్లిపోయాడు.

ముక్త ఆ విషయమే మరచిపోయింది. కానీ స్టూడెంట్ లీడర్ రంజిత్ ఆ విషయం అక్కడితో మరచిపోలేదు. స్టూడెంట్స్‌కున్న ప్రోబ్లమ్స్ సాల్వ్ చెయ్యాలి. తనని అందరూ మెచ్చుకోవాలి అనుకునే రంజిత్ తనో గొప్ప వ్యక్తిగా హీరోగా ఫీలవుతూ ఉంటాడు. అలా అనుకుంటూనే కోలా ఆఫీసు రూంకి వెళ్లాడు.

కోలా ఆఫీసులో లేడు. పక్కనే పరికరాలున్న రూంలో కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. అక్కడున్న రిసెర్చి మెటీరియల్ ఎవరివో తెలియడంలేదు. అవి తెలుసుకోవాలనే ఆత్రం అతని మొహంలో కనిపిస్తోంది. ఆ సమయంలో రంజిత్ వచ్చాడు.

"హాయ్ ప్రొఫెసర్! ఏదో బిజీగా ఉన్నట్టున్నారు"

"అవును శాంపిల్స్ రీడింగ్స్ తీసుకొంటున్నాను. ఏమిటీ విషయం? "

"ఏం లేదుసార్! ముక్త అని నా చిన్ననాటి స్నేహితురాలు. మేం మళ్లీ ఇక్కడే కలుసుకొన్నాం. మీరు శాస్త్ర విజ్ఞానానికే అంకితమై పోయిన గొప్ప శాస్త్రవేత్త అనీ, మీ దగ్గర పరిశోధనకి చేరమనీ సజెస్ట్ చేశాను. ముక్తని మీ గ్రూప్‌లో చేర్చుకోండి సార్. చాలా బ్రిలియంట్ స్టూడెంట్"

కోలా టైం చూసుకొంటూ అక్కడో స్టాప్ వాచ్ ఉంటే అది నొక్కేడు. అది గణగణమంటూ చెవులు చిల్లులు పడేలా చప్పుడు చేయడంతో మళ్లీ నొక్కి ఆపేడు. కోలాకి తను పరిశోధనలో మునిగి తేలుతుంటాడని అందరూ అనుకోవాలి. అలా అయితేనే అందరూ గౌరవిస్తారు అనుకొంటాడు.

రంజిత్ ఏ పని చేసినా అది దేశానికి, సమాజానికి అత్యవసర జీవనాధారం అన్నట్టు మాట్లాడుతాడు. అలా మాట్లాడితే తప్ప జనానికి విలువుండదని అతని అభిప్రాయం.

"ముక్త వేదవతి దగ్గర చేరిందికద"

"మీ పరిశోధనలు, ప్రణాళికలు, పద్ధతులు చెప్పేసరికి చాలా ఇంప్రెస్ అయిపోయింది ఆ ఫస్టుక్లాసు డిస్టింక్షన్ స్టూడెంట్"

అదేదో తనే ఇచ్చినంత స్ట్రాంగ్‌గా చెప్పాడు రంజిత్.

కోలా తలాడించాడు. "నా లాబ్‌లో ఖాళీ లేదు. ఎందరో అనఫీషియల్‌గా చేస్తున్నారు. పనిచేస్తున్నారుకదా కాదనలేం"

కోలా లాబ్ ఓ సత్రంలా ఉంటుంది. రకరకాల కొలాబరేటివ్ ప్రోజెక్ట్స్ ఉండడంతో ఎందరో వ్యక్తులు బయటనించి కూడా వచ్చి పని చేస్తుంటారు.

కోలా చటుక్కున ఏదో గుర్తు వచ్చిన వాడిలా "ఇప్పుడో ఎమర్జెన్సీ మీటింగ్ ఉంది. తర్వాత ఫారిన్ విజటర్స్ వస్తున్నారు. యునెస్కో వాళ్లతో ఫండ్స్ గురించి డిస్కస్ చెయ్యాలి. చాలా పనులున్నాయి. ముందుగా ఎపాయింట్‌మెంట్ తీసుకోకూడదూ! తీరికగా మాట్లాడుకోవచ్చు" అన్నాడు.

అదే అతని ప్రత్యేకత. తనెంత గొప్పవాడో చెప్పుకొంటూనే అవతలవాళ్లతో తియ్యగా మాట్లాడగలడు.

అతని మాటలని రంజిత్ సుమారుగా అడ్డుకొంటూ మా యూనియన్ డిమాండ్స్ విషయం, గవర్నర్‌గారికి ఓ పత్రం ఇవ్వడానికి గవర్నర్‌గారిని కలుసుకోవాలి. నాకూ టైంలేదు. మళ్లీ కలుస్తానని వచ్చేశాడు. రంజిత్ సరాసరి సెలూన్‌కి వెళ్లాడు.

సెలూన్ అద్దంలో చూస్తుంటే కోలా భార్య కోలాతోపాటు కారు దిగడం, బ్యూటీ క్లినిక్‌కి వెళ్లడం కనిపించింది. కోలా సిగరెట్ కాలుస్తూ ఏమీ తోచక పాత బట్టతో కారు శుభ్రం చేసుకోవడం చూసి నవ్వుకొన్నాడు రంజిత్.

★ ★ ★

ఆ రోజు ముక్త పొద్దున్న లేబ్‌కి వెళ్లేసరికి ముక్తకిచ్చిన డెస్క్‌మీద ఒక స్లిప్ కనిపించింది. అందులో 'ముక్తా వెంటనే కలుసుకోవలసింది. వేదవతి' అని ఉంది.

ముక్త వెంటనే వేదవతి రూంకి వెళ్లింది. వేదవతి "మైడియర్ గర్ల్. నీకు ఈ లాబ్, ఈ వర్క్ నచ్చకపోతే ముందుగా నాతో చెప్పవలసింది. నీకు నీ ఇష్టం వచ్చిన చోట పని చేసుకొనే స్వేచ్ఛ ఉంది. నీ ఇష్టం నువ్వెప్పుడు వెళ్లినాసరే" అన్నారు.

ముక్త నిర్ఘాంతపోయింది. ఒక్కసారి బ్లడ్ ప్రెషర్ డౌన్ అయిపోయినట్టు, గుండె కొట్టుకోలేక కొట్టుకొంటూ ఆగిపోదుకదా అన్నంత నెమ్మదిగా స్థంభించినట్టుగా ఫీలయ్యింది. చేతులన్నీ చెమటతో తడిసి పోతున్నాయి. రక్తమంతా ఒక్క మొహంలోకే ముద్దగా చేరిపోయిందా, అన్నంతగా మొహం ఎర్రబడిపోయింది. కాళ్లకింద భూమి కంపిస్తోందా! కదిలిపోయే భూమి మీద పడిపోతానేమో అనుకొంటూ కాళ్లు నిలదొక్కుకొని "మేడమ్ మీరేమంటున్నారో నాకేమీ అర్థం కావడంలేదు" అంది.

"ఇందులో అర్థం కాకపోవడానికి ఏముంది. ఇందాక కోలాగారు చెప్పారు. ముక్తకి నా లాబ్‌లో వర్క్ చెయ్యాలనుంది కానీ లాబ్‌లో ఖాళీ లేదని వాపోయారు"

"సారీ మేడమ్ నేనలా అనలేదు"

"అనకుండా ఈ మాట ఎలా వస్తుంది. స్టూడెంట్ ఎంత బ్రిలియంట్ అయినా నా దగ్గర నా వర్క్‌లో ఇంట్రెస్టు లేదని తెలిశాక ఒక్క క్షణం కూడా భరాయించే శక్తి నాకు లేదు. ఐయామ్ సారీ! దీని గురించి మాట్లాడడానికి ఇంకేమీ లేదు. విష్ యూ ఆల్ ది బెస్టు" తలవంచుకుని ఏదో రాసుకొంటూ కూర్చొంది వేదవతి.

ముక్తకి వయస్సులో, చదువులో, తెలివిలో, అధికారంలో, అనుభవంలో అన్ని విధాలుగా పైమెట్టులో ఉన్న వేదవతిని ఎలా కన్విన్స్ చెయ్యాలో తన ప్రమేయం లేకుండా ఆ వలయంలో ఎలాంటి పరిస్థితులలో ఇరుక్కుపోయిందో అందులోంచి ఎలా బయటపడాలో ఆలోచనకి అందకుండా

# రచయితలకు మనవి



★ ‘చతుర’లో నవలకు వేసే చిత్రాలు, ‘చతురకథలు’, ‘చతుర ప్రపంచం’వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని ‘చతుర’కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు ‘చతుర’కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ *సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.*

★ ***ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల ‘చతుర’లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.***

**ఎడిటర్:**

# చతుర

**ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

--------- ఆగస్ట్ **చతుర** నవల **డాక్టరేట్** ---------

సమీక్షకుని పేరు : ----------------------------------------

చిరునామా ----------------------------------------

----------------------------------------

----------------------------------------

పోతున్న పరిస్థితిలో కళ్లనీళ్లు ధారగా దిగవిడుస్తూ రూంలోంచి బయటకు వచ్చింది.

కళ్లు వత్తుకొని 'రోబోట్ సెంటర్'వైపు నడుస్తోంది. తనేదో పెద్ద దొంగతనం చేసినట్టు, పట్టుబడిపోయినట్టు, తనకేదో పెద్ద అంటువ్యాధి వస్తే అందరూ తరిమి కొడుతున్నట్టు, హృదయమంతా వెలితి అయిపోయి 'రోబోట్ సెంటర్'కి చేరుకొంది. చైతన్యం లేకుండానే కాఫీ ఆర్డరిచ్చింది. కాఫీ తాగి దూరంగా నిత్యా కనిపిస్తే అటువైపు వెళ్ళింది.

"నిత్యా నేనిప్పుడు సూపర్‌వైజర్‌ని మారిస్తే ఎలాగుంటుంది?" హఠాత్తుగా ముక్త వేసిన ఈ ప్రశ్నకి, నిత్యా కొంచెం ఆశ్చర్యపోయాడు.

"ఏమీ బాగోదు. వర్క్ గురించి కొంత డిస్కస్ చేశారేమో కదా! అయినా అదంత మంచి పద్ధతి కాదు. ఎకడమిక్ వాతావరణంలో అనవసరమైన అలజడి"

"నేను ఏదో యధాలాపంగా రంజిత్‌తో కోలా స్టూడెంట్స్ వర్క్ బాగుందన్నాను. రంజిత్ ఎవరిదగ్గర ఏం మాట్లాడేడో వేదవతిగారికి చాలా కోపం వచ్చింది. నన్ను నా ఇష్టం వచ్చినచోట వర్క్ చేసుకోమని చాలా సీరియస్‌గా చెప్పేరు" అంటూ జరిగినదంతా వివరంగా చెప్పింది ముక్త.

"రంజిత్‌ది దూకుడు స్వభావం. ఏదో చేసెయ్యాలనే తపన ఉంది కాని అతడికో గమ్యంలేదు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. మీరు వేదవతికి, జరిగినవన్నీ వివరంగా చెప్పి ఆవిడని ప్రసన్నం చేసుకొని, ఆవిడ లాబ్‌లోనే పని చెయ్యడం మంచిది"

"వేదవతిగారు కొంచెం నిదానంగా నిజానిజాలు తెలుసుకోవచ్చు కదా. అంత సీరియస్‌గా మాట్లాడితే నాకేం చెప్పాలో కూడా పాలుపోలేదు"

"మీరు కాకపోతే ఆవిడ దగ్గర పనిచెయ్యడానికి ఇంకో స్టూండెట్ చేరుతారు. వాళ్ళు ఒక పరిధిలో ఆలోచిస్తారు. వాళ్ళకదే సబబుగా తోస్తుంది. ప్రతి ఒక్కరి గురించి అన్ని రకాలుగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోడానికి వాళ్ళేం సైకాలజిస్టులు కాదుకదా! మనం చేసే పని మీద ఇంట్రస్టు లేనప్పుడు మనదగ్గర ఉండక్కరలేదు అనుకొంటారు. అందులో తప్పేముంది?"

"నిత్యా నాకు వేదవతిగారిదగ్గరకి వెళ్ళాలంటే భయంగా ఉంది. నాతోపాటు మీరు కూడా రాగలరా?"

"సారీ... నేను మీ డిపార్టుమెంటు విషయాలలో తలదూర్చడం సరైన పద్ధతికాదు" నిక్కచ్చిగా చెప్పేడు నిత్యా.

"అదిగో రంజిత్ వస్తున్నాడు! ఇక్కడే ఇప్పుడే అడిగేస్తా అసలు ఎందుకిలా చేశాడో తేల్చేస్తాను" అంది ముక్త.

"రంజిత్" చప్పట్లు కొట్టి పిలిచేడు నిత్యా.

"హాయ్! ముక్తా! మీరు కోలా లాబ్‌లో పనిచెయ్యడానికి కొంచెం టైం కావాలి. అంటే రిజిష్ట్రేషన్‌కి అన్నమాట. అందాక పని చేసుకోవచ్చు మూడు నెలల్లో కోలా దగ్గర పనిచేస్తున్న స్టూడెంట్ పని పూర్తయి వెళ్ళిపోతున్నాడు. ఆ స్థానంలో మిమ్మల్ని తీసుకోడానికి ఏర్పాటు చేస్తున్నాను" అన్నాడు రంజిత్.

"స్టాపిట్! వాట్ నాన్‌సెన్స్ ఆర్ యు టాకింగ్! నేను నీతో చెప్పానా! కోలాతో మాట్లాడి పెట్టమని. నీ మూలాన నా బతుకు బండలయ్యేట్టుంది. వేదవతిగారికి నీ ఏర్పాట్ల విషయం తెలిసి తక్షణం లాబ్ నుంచి దయచెయ్యమన్నారు"

"దానిదేముంది. నేనిప్పుడే వెళ్ళి కోలాతో మాట్లాడుతాను. అనఫీషియల్‌గా ఈ రోజు నించే పనిచెయ్యవచ్చు. ఈ స్టూడెంట్ లీడర్ తలుచుకొంటే చెయ్యలేనిదేముంది?"

"ప్లీజ్! ఇప్పటికైనా నా విషయాలు నన్ను స్వతంత్రంగా చూసుకోనివ్వండి"

"నోనో! అంత వద్దన్న సూపర్‌వైజర్ దగ్గర, మీరెందుకు పనిచెయ్యాలి? ఆవిడ చాలా స్ట్రిక్ట్ అని పేరు. ఎంత పని చేసినా

ఆవిడ మెప్పు పొందడం కష్టమంటారు. కోలా ఆహ్లాదకరమైన వ్యక్తి"

"రంజిత్! ముక్తగారు మాటవరస కంటే ఎంతవరకూ తీసుకుపోయేవో! ఎవరు ఎవరి దగ్గర చేరితే నీకెందుకు? ముక్త నిన్ను తనని కోలా లాబ్ కి మార్చడానికి, సహాయం కావాలని అర్థించిందా? "

"ఆ లైనులో పరిశోధన బాగుంటుందంటే మార్చుకోవచ్చని చెప్పేను. ఇంత చిన్న ప్రాబ్లెమ్ సాల్వు చెయ్యలేకపోతే స్టూడెంట్ లీడరయ్యి ఏం ప్రయోజనం? ఇప్పుడే వస్తా"నంటూ స్పీడుగా మోటర్ బైక్ మీద వెళ్ళిపోయేడు రంజిత్.

ముక్త హతాశురాలైంది. నోరు వెళ్ళబెట్టుకొని చూస్తుండిపోయింది.

"ముక్తా... రంజిత్ స్వభావమే అంత. చాలాచాలా కాంప్లికేటెడ్ పెర్సనాలిటీ. నాతో ఒక్క మాట అనుంటే వార్న్ చేసేవాణ్ణి"

"నిత్యా ప్లీజ్ నన్నర్థం చేసుకోండి. నేను రంజిత్ కి ఏదీ సీరియస్‌గా చెప్పలేదు"

"ఏం జరుగుతుందో చూద్దాం. మీరు వేదవతిగారి దగ్గరకి వెళ్ళనంటున్నారు కదా"

"నేను చెబుతున్నాను కదా! చాలా చీదరింపుగా చూశారు. కష్టం వెళ్ళడం"

"సరే చూద్దాం"

ముక్త, నిత్యా ఎవరి పనులమీద వాళ్ళు వెళ్ళిపోయేరు.

★ ★ ★

రంజిత్ కోలా ఆఫీసుకి వెళ్ళి కోలాతో మాట్లాడేడు. "మూడు నెలల తర్వాతకాని అఫీషియల్ రిజిస్ట్రేషన్ అవదు. అంతదాకా ఊరికే కూర్చోకుండా పనిచేసుకోవచ్చు. "వేదవతి లాబ్" నుంచి 'కోలా లాబ్'లోకి మారాలనుందని, లెటర్ పెట్టి పనిచేసుకో"మని, చెప్పేడు కోలా.

ముక్త, వేదవతితో మరొక్కసారి క్లియర్ కట్‌గా మాట్లాడితే పరిస్థితులు ఏ రకంగా ఉండేవో కాని, ముక్త అనవసరంగా తనేదో తప్పు చేసినట్టు, చిన్నతనం పడి, అర్థరహితంగా వేదవతిని కలుసుకోడానికి చాలా సెన్సిటివ్‌గా ఫీలయ్యింది.

"కోలాతో మాట్లాడేను. మిమ్మల్ని లెటర్‌తో వచ్చి కలవమన్నాడ"ని, రంజిత్ చెప్పగానే కోలాని కలుసుకొని, అతని లాబ్‌లో పనిచెయ్యడానికి నిర్ణయించుకొంది.

ఈ సంగతి తెలిసిన నిత్యా "ముక్తా! మీకు ఏ మూలనో, కోలా స్టూడెంట్ వర్క్ కంటిన్యూ చెయ్యాలనుంది. అందుకే రంజిత్‌తో కోలా దగ్గరకు వెళ్ళగలిగేరేకాని, వేదవతిగారి దగ్గరకి వెళ్ళలేకపోయేరు" అన్నాడు.

నిత్యా అలా అనడం ముక్తకి చేదుగా అనిపించింది. "నేను కోలా స్టూడెంట్ చేసిన పని చాలా బాగుంది. అతను కంటిన్యూ చేస్తే బాగుండేది అన్నానే కాని "నేనే" చెయ్యాలనుకొంటున్నానని అనలేదు. వర్క్ బాగుందని ఇప్పటికీ అంటాను. అంతా ఆ రంజిత్ మూలంగా ఇలా జరిగింది. వేదవతిగారి దగ్గరకు వెళ్ళి మళ్ళీ "ఛీ" అనిపించుకొనేకంటె కోలాగారి దగ్గర చేరడమే సుళువనిపించింది"

ముక్తకి మనసులో నిత్యా అంటే కూడా కష్టంగా ఉంది. 'నిత్యా తన పక్కనుంటే వేదవతి తన మాట వినిపించుకొనేదేమో! నిత్యా తనతో రావడానికే ఇష్టపడలేదు' అనుకొంది "లైబ్రరీకి వెళ్ళాలి నిత్యా!" అంటూ లైబ్రరీకి వెళ్ళిపోయింది ముక్త.

★ ★ ★

తను చెయ్యవలసిన పరిశోధనకి సంబంధించిన సమాచారం సేకరించడానికి లైబ్రరీకి వెళ్ళింది ముక్త. లైబ్రరీలో సత్యం స్టూడెంట్ మనోజ్‌తో పరిచయమైంది. అతనితో తను చెయ్యబోతున్న పరిశోధన గురించి చర్చించింది.

మనోజ్ పరిశోధనల గురించి మాట్లాడుతూ, "సత్యం, వేదవతి, కోలాల పరిశోధనల్లో అంతగా తేడాలేవీలేవు. అందరి లాబ్స్‌లోనూ, అటూఇటుగా ఒకేలైన్‌లో, పరిశోధన

జరుగుతూ ఉంది. ఫలితాలు రావడం, రాకపోవడం, వీటిలో తేడాలుంటాయి. ఒక్కో ప్రొఫెసర్ పేరు తెచ్చుకొన్న వాడయితే కొన్ని లాభాలు ఉండవచ్చు. సత్యం పేరున్న ప్రొఫెసరేగానీ మాకు అందుబాటులో ఉండరనేది చేరాకే తెలుసుకొన్న నిజం. మా లాబ్‌లో పరిశోధనంతా ప్రస్తుతం కరస్పాన్‌డెన్స్ విధానంలో జరుగుతోందనవచ్చు. సత్యం విజ్ఞానం, పేరుప్రతిష్టలు, మాకెంతవరకూ పనికొస్తున్నాయనుకొనేకంటే, మేం స్వతంత్రంగా ఏం చెయ్యగలం? అనేది ఎక్కువగా ఆలోచించవలసి వస్తోంది.

"ఇక వేదవతిగారు చాలా స్ట్రిక్ట్ అంటారు. స్టూడెంట్ ఆవిడ చెప్పిన పని పూర్తిచేసి, ఆవిడతో సమగ్రంగా చర్చించి, ఆవిడకి సంతృప్తి కలిగితే అప్పుడు థీసిస్ రాయమంటారుట.

"కోలా అయితే విద్యార్థులలో ఒకరిగా తిరుగుతూ, అవసరమైన విషయాలు ఎప్పటికప్పుడు చెబుతూ, ఒకోప్పుడు, స్టూడెంట్ భావప్రకటన సరిగా లేకపోతే దిద్దుతూ కూర్చుంటే టైం వేస్టని ఆయనే రాసిస్తారంటారు. ఇలా రకరకాల మనస్తత్వాలు.

"స్టూడెంట్‌కి తను చేసే పనిలో ఆసక్తి ఉండి, నిబద్ధతతో చెయ్యవలసిన పని పరిశోధన. స్టూడెంట్ చేస్తున్న పని ఎవరి కోసం? అనే ప్రశ్న వేసుకొని, నాకోసమే అనే సమాధానం చెప్పుకోగలిగితే, ఏ వ్యక్తి సూపర్‌వైజరయితే నేమిటి? సూపర్‌వైజర్ మార్గం చూపించాలే తప్ప కలసి ప్రయాణం చెయ్యాలనుకోవడం తెలివితక్కువ తనం. మనం ఎవరి దగ్గర పనిచేస్తున్నామనేది ప్రధానాంశం కానేకాదు. మనకో ఆశయం ఉండాలి. దానికో మార్గం దొరకాలి. గమ్యం చేరే అవకాశం మన చేతిలో ఉంది. స్వశక్తి ఉంటే ఎవరిదగ్గర పనిచేసినా ఒకటేనని నా అభిప్రాయం" అన్నాడు.

"మరి సత్యం దగ్గర ఆధునికమైన పరికరాలన్నీ ఉన్నాయంటారు కదా" అంది ముక్త.

"అవును... అలాంటి అవకాశాలు అందరికీ ఒకేలా ఉండకపోవచ్చు. దానికి కారణాలు కోకొల్లలు. కానీ మనం కూడా కొంత సర్దుకోవచ్చు. మీరు సత్యం లాబ్‌లో ఏ ఎక్విప్‌మెంట్ వాడుకోవాలన్నా, మేం మీకు తప్పక సహాయపడతాము"

మనోజ్ మాటలు ముక్తకి అమృతప్రాయంగా ఉన్నాయి. "నేను సత్యం లాబ్‌లో పనిచేస్తుంటే కోలా ఇష్టపడతారా?" అనబోయి, ముక్త తమాయించుకొని, "తప్పకుండా వస్తాను. మీరు చెబుతున్న మాటలు నాలో కొండంత ధైర్యాన్ని తెస్తున్నాయి" అంటూ "థాంక్స్ ఫర్ ఎవ్విరిథింగ్" అంటూ లేచి రోబోట్ సెంటర్‌వైపు వెళ్ళింది.

రోబోట్ సెంటర్‌లో సోప్, పేస్ట్, ఫేస్ పౌడర్, తీసుకొని బిల్ ఇద్దామని కౌంటర్ దగ్గర నిలబడింది. నిత్యా అప్పటికే తనకి కావలసిన వస్తువులు తీసుకొని బిల్ చెల్లించి ముక్తకోసం ఆగాడు. ముక్త చేతిలో వస్తువులు చూసి "ఆ సోప్ కొనకండి. అందులో కెమికల్ ఒకటి శరీరానికి అంత మంచిది కాదని రిపోర్ట్స్ వస్తున్నాయి" అన్నాడు.

ముక్తకి నిత్యాని చూడగానే చిర్రెత్తుకొచ్చింది. దానికి కారణం ఆమె మనసులో రగులుతున్న మథనమే.

ఆరోజు నిత్యా చెప్పేడు. సూపర్‌వైజర్‌ని మార్చుకోవడం అంతమంచి పద్ధతి కాదని. అతని లాబ్‌లో జరిగే పరిశోధన బాగుందని అన్నంత మాత్రాన ఇలా జరిగిందని అంటే ఎవరూ నమ్మడం లేదు. చివరికి నిత్యా కూడా. పోనీ వేదవతికి నెమ్మదిగా జరిగినది చెబుదాం, తోడు రమ్మంటే రాను పొమ్మన్నాడు.

"ఏం ఆలోచిస్తున్నారు ముక్తా! ఈ సోప్ మీద పరిశోధన చెయ్యడానికి అవకాశం ఉందా? అనా?"

ముక్తకి నిత్యా మాటలు, అరికాలి మంట

నెత్తికెక్కించేయి. 'నిత్యా ఎవరు తనకి చెప్పడానికి. నిత్యా మాటలు వినకూడదనే పంతం వచ్చింది. తనెలా పోతే అతనికెందుకు? అతనేమైనా తనకి గార్డియనా? ఆర్చేవాడా? తీర్చేవాడా? స్నేహాన్ని ఆధారం చేసుకొనే ఓసారి వేదవతిగారిని కలుద్దామంటే రాగలిగేడా? తన కష్టాలన్నిటికీ కారణం నిత్యానే' అనే కసి ముక్తకి వచ్చింది.

పైకి మాత్రం ఏ భావం వెలిబుచ్చకుండా "ఇలా రిపోర్టులు విని ఏ పనులూ చెయ్యలేం. ఏ వస్తువు వాడినా కేన్సర్ రావచ్చునే చెబుతారు. మానేస్తున్నామా? " అని ముక్త అదే సోప్ పేక్ చేయించింది.

నిత్యా యధాలాపంగా చెప్పేడే కాని, ముక్త తను చెప్పిన మాట విని తీరాలనే పట్టుదల అతనికేమాత్రం లేదు. ఆ సంగతి అప్పటికప్పుడే మరచిపోయేడు. ఆ సోప్ వాడిన ముక్తకి మాత్రం మొహమంతా ఎర్రటి దద్దుర్లలా వచ్చి, యాంటీ ఎలర్జీ టాబ్లెట్లు వాడితే తప్ప తగ్గలేదు.

ముక్త అద్దంలో చూసుకొంటూ "నిత్యా మాట వినుంటే ఈ ఎలర్జీ బాధ తప్పేది. కాదు కోలా దగ్గర చేరి అసంతృప్తి పాలయ్యే దుస్థితి తప్పేది" అనుకొంది.

★ ★ ★

నిత్యానంద్‌ని జాగ్రత్తగా గమనిస్తే ఇతని ఆనందమంతా రాబోయే చెడును ఊహించి చెప్పడంలో ఉందనిపిస్తుంది కొందరికి. పెసిమిస్ట్‌లా ఉన్నాడు. తల్లితండ్రులకి ఒక్కడే కొడుకు. చిన్నప్పుడే తండ్రి యాక్సిడెంట్‌లో పోయేడు. నిత్యా తల్లికి ధనానికి, బంధువులకి లోటులేదు. బంధువులు, చుట్టుపక్కల వాళ్ళు ఏదో ఒక స్వార్థంకోసమే తమ చుట్టూ తిరుగుతున్నారనే భావం పసితనం నించి నిత్యాలో పేరుకోడానికి కారణం తల్లి అనే చెప్పాలి. తామెవరికీ సహాయపడనక్కరలేదు. అంటీముట్టనట్టుండాలని బోధించేదామె. చిన్నప్పటినుంచీ చదువులో ఫస్టుగా ఉండేవాడు. సరదాగా మాట్లాడుతాడు. కాని ఎవరికీ సహాయం చెయ్యడానికి ముందుకు రాడు. అన్నీ తెలిసిన తెలివైన వాడు అనుకొనేవారు స్నేహితులు.

ఎదురుగా సముద్రముండి ఏం లాభం? గుక్కెడు నీళ్ళు తాగడానికి ఉపయోగమయ్యేనా? "నిత్యా నువ్వు స్వార్థపరుడువి" అంటే కూడా నిత్యా పట్టించుకోడు.

★ ★ ★

రోబోట్ సెంటర్‌లో రంగురంగుల దీపాలు వెలిగి ఆరుతూ, రోబోట్ మొహంలో రంగులు మారుతున్నట్టు, చూడ్డానికి తమాషాగా కనిపిస్తోంది.

అతుల్ పాండే, థీసిస్ సబ్‌మిట్ చేసి రెండు నెలలైంది. ఇంకా వైవా జరగలేదు. కాని అమెరికాలో జరిగే కాన్ఫరెన్స్‌కి పేపర్ పంపిస్తే, ఆ పేపరు బాగుంది, కాన్ఫరెన్స్‌కు వచ్చి డిస్కస్ చెయ్యమని, టికెట్లతో ఇన్విటేషన్ పంపేరు. ఆ సంగతి తెలిసి, అతనికి కొందరు కంగ్రాట్స్ చెబుతున్నారు.

"అతుల్ ఎప్పుడు ప్రయాణం? "

"సూపర్‌వైజర్ కోలా ఊరినించి వచ్చేక కాని ఏ వివరాలు చెప్పలేను. ఫార్మాలిటీస్ ఉంటాయి కద" అన్నాడు.

కోలా ఏదో ఎగ్జామినేషన్‌కి కలకత్తా వెళ్ళేడు. తిరిగి వచ్చిన తరువాత అతుల్ తనకి వచ్చిన ఇన్విటేషన్ చూపించేడు.

అది చూడగానే కోలా బుర్రలో ఓ ఆలోచన మెరుపులా మెరిసింది.

కోలా తనని ఎంతగానో ఎత్తేస్తాడనుకొంటున్న అతుల్‌కి కోలా సంభాషణ మొహంమీద మంచుగడ్డలతో కొట్టినట్లయింది.

"ఈ పేపర్ కాన్ఫరెన్స్‌లో చదువుతానని పంపించేవా? "

"అవును... పంపించేను"

"పంపేముందు నన్నెందుకు అడగలేదు? "

"అడిగేను. పంపవచ్చంటేనే పంపేను"

"అక్కడ వాళ్ళడిగే ప్రశ్నలకి నువ్వేం

సమాధానం చెప్పగలవు? ఆ లెటర్ ఇక్కడుంచు. నేనే వాళ్ళకి కరస్పాండ్ చేస్తాను"

ఆ రోజే కోలా కాన్ఫరెన్స్ ఆర్గనైజర్స్‌కి ఇ-మెయిల్ ఇచ్చేడు. అది అతుల్, తను కలసి పనిచేసిన, ప్రకటించిన పేపర్ కాబట్టి కాన్ఫరెన్స్‌లో పేపర్ చదవడానికి సీనియర్ నైన తనే వస్తానని దాని సారాంశం.

అతుల్‌కి అసలు విషయం ఆలస్యంగా అర్థమైంది. కోలా తనే కాన్ఫరెన్స్‌కి వెళ్ళాలనే ఉద్దేశంలో ఉన్నాడు. తను థీసిస్ సబ్‌మిట్ చేసేడేకాని ఇంకా వైవా అవలేదు.

కోలా తనని వెళ్ళనివ్వకపోవడం అన్యాయమని తిరగబడితే ఏమవుతుంది? స్నేహితులలో కొందరు తిరగబడమని, కొందరు వద్దని రకరకాల అభిప్రాయాలు వెలిబుచ్చారు.

నిత్యాని అడిగితే "భవిష్యత్తులో, ఏ ఉద్యోగానికైనా, ఫారిన్ వెళ్ళాల్సివచ్చినా సూపర్‌వైజర్ రిఫరెన్స్ అవసరమవుతూంటుంది. ఏ పని చేసినా ఆలోచించుకుని మరీ చెయ్యి" అన్నాడు.

అతుల్ డిగ్రీ కాలేజీలో చదివేటప్పుడు, ఓ మంచి ఆర్టికల్ రాసి న్యూస్ పేపర్‌కి పంపేడు. అది పబ్లిష్ అయ్యి, ప్రిన్సిపాల్ చూసి, అతుల్‌ని మెచ్చుకొంటూంటే, లెక్చరర్ అతుల్‌కి ఆర్టికల్ తయారుచెయ్యడంలో తనే సహాయం చేసినట్టు చెప్పేడు.

అతుల్ లెక్చరర్‌ని "అసలు మీరు ఆర్టికల్ చదివేరా? దేన్ని గురించి రాశానో చెప్పగలరా? " అన్నాడు. లెక్చరర్ మొహంలో నెత్తురుచుక్క లేదు. "ఇంకేదో సైన్స్ మ్యాగజైన్‌కి పంపేవు అదా? లేక న్యూస్‌పేపర్‌కి ఇచ్చిందా? " అన్నాడు.

ప్రిన్సిపాల్ ఈ నాన్పుడు వ్యవహారం గమనించి, సన్నసన్నగా లెక్చరర్‌ని చివాట్లు పెట్టేడు. అతుల్‌ని చల్లబరిచేడు. ధర్మాన్ని పరిరక్షిద్దామనే వ్యక్తి ప్రిన్సిపాల్ కావడంతో ఆ కథ అలా ముగిసింది. లేకపోతే ఆ లెక్చరర్ ఆగడం కొనసాగే అవకాశముంది.

ఇప్పుడు అతుల్‌కి జరిగిన అన్యాయం అంతకన్న ఎక్కువైనదే. మరి డిగ్రీ లెవెల్లోని రక్తపు వేడి ఇప్పుడు చల్లారి పోయిందా? లేదులేదు, అంతకు రెట్టింపు ఉడుకుతోంది. కాని భవిష్యత్ అనే సంకెళ్ళు, ముందడుగు వెయ్యనివ్వడం లేదు. కాలేజీ లెవెల్లో లెక్చరర్‌కి కష్టం కలిగిస్తే, కావాలని స్టూడెంట్‌కి ప్రాక్టికల్స్‌లో మార్కులు తక్కువ వేయవచ్చు స్టూడెంట్ చిన్న బుచ్చుకొనేలా ప్రవర్తించవచ్చు కాని యూనివర్సిటీలో అలా కాదు. కోలా చిన్నచిన్న విషయాల్లో ఇరిటేట్ చేస్తూనే ఉన్నాడు. థీసిస్ సబ్‌మిట్ చేసి బయటపడ్డాననుకొంటే, మళ్ళీ ఇదో కిరికిరి అనుకొన్నాడు అతుల్.

కోలా సత్యం సహజంగా ఇద్దరూ తెలివైనవాళ్ళే. కోలాకి తగిన ప్రోద్బలంలేక తను వేసే ప్రతి అడుగూ జారుడు మెట్లమీద నడక తంతయిందని, తన జీవితం గురించి అప్పుడప్పుడు అనుకుంటూంటాడు. కోలా, సత్యం ఇద్దరూ కలిసే చదువుకున్నారు.

ఒకే విద్యాసంస్థలో ఇద్దరికీ అంతరిక్ష పరిశోధన, రోబోట్, రాడార్స్ సాంకేతిక పరిజ్ఞానం నచ్చిన పరిశోధనాంశాలు.

పి. హెచ్. డి. డిగ్రీకి అమెరికాలో నోబుల్ ప్రైజ్ వచ్చిన ప్రొఫెసర్ దగ్గర పనిచెయ్యాలని అప్లికేషన్‌లు పెట్టారు. పి. హెచ్. డి. చేసుకోవడానికి తన దగ్గర అవకాశం కలుగచేస్తాను కానీ, ఆర్థికసాయం అందడానికి కొంత సమయం పట్టవచ్చునీ, కారణం అప్పటికే తనదగ్గర చాలామంది పనిచేస్తున్నారనీ, కొంతకాలం తర్వాత వచ్చే నిధులను బట్టి మాత్రమే ఆర్థిక సహాయం ఇవ్వడం జరుగుతుందనీ ఆ ప్రొఫెసర్ స్పష్టం చేశారు.

సత్యంకి ధన విషయంలో ఏ సమస్యా లేదు. తండ్రి, తాతలనుంచి వచ్చిన ఆస్తి ఉంది. తండ్రి పెద్ద కాంట్రాక్టరు. పరిశోధన మీద ఆసక్తితో సత్యం స్వంత డబ్బు పెట్టుకుని ప్రొఫెసర్ దగ్గర చేరాడు. కోలా

సామాన్య కుటుంబంనుంచి వచ్చినవాడవడంతో పరిశోధనమీద ఎంత ఆసక్తి ఉన్నా అంతరిక్ష పరిశోధన గగనకుసుమమే అయింది. స్వదేశంలోనే రాడార్స్‌మీద పని చేస్తున్న ప్రొఫెసర్ దగ్గర పి.హెచ్.డి.కి చేరాడు. అది పూర్తయ్యేసరికి ఏడున్నర సంవత్సరాలు పట్టింది.

సత్యం అమెరికా వెళ్ళి పరిశోధన ప్రారంభించిన ఆరునెలలకే ఆర్థిక సహాయం దొరికింది. పని అనుకున్నట్లుగా జరుగుతూ, మూడేళ్ళలో పి.హెచ్.డి. డిగ్రీ తెచ్చుకున్నాడు. అతడు చేసిన పనికి మెచ్చి అక్కడే ప్రొఫెసర్ ఉద్యోగం ఇచ్చారు. ఆ విధంగా అంతరిక్ష పరిశోధనలో ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్న శాస్త్రవేత్తలలో సత్యం ఒకడయ్యాడు.

ఇండియాలో మల్టీ స్పెషాలిటీస్ హాస్పిటల్ చైన్స్‌కి అధినేత అయిన ఒక ప్రముఖ డాక్టర్ తన కూతుర్నిచ్చి సత్యంకి పెళ్ళి చేశాడు.

ఉన్నతమైన చదువులకి, ఉద్యోగాలకు పై దేశాలకు వెళ్ళిపోతున్న 'బ్రెయిన్ డ్రైన్'ని అరికట్టాలని ప్రభుత్వం నడుము కట్టిన రోజుల్లో ఈ యూనివర్సిటీ ఉద్భవించింది. ఆ రోజుల్లో ఇప్పటిలా పోతే పోయేరులే డాలర్లు సంపాదించి తెస్తారనో, కొంత జనాభా తగ్గిందిలే అనో అనుకోని రోజులవి. అంతరిక్ష పరిశోధనలో నోబుల్ ప్రైజ్ తెచ్చుకున్న ప్రొఫెసర్ దగ్గర పనిచేసిన సత్యంని స్వదేశానికి రప్పించడంకోసం బోలెడన్ని ఆకర్షణలు చూపించింది ప్రభుత్వం. అయినా సత్యం అంత తొందరగా ఇండియన్ యూనివర్సిటీకి రావడానికి సుముఖత చూపలేదు. తన గ్రీన్‌కార్డు వదులుకోనన్నాడు.

"మంచిది. గ్రీన్‌కార్డున్న ప్రొఫెసర్ అయితే మరీ ఉత్తమం" అన్నారు.

"తను పనిచేస్తున్న సంస్థతో జాయింట్ ప్రాజెక్టులు ఉంటాయి" అన్నాడు.

"మన స్వశక్తితో పనిచేసేకన్నా జాయింట్ ప్రోగ్రాంస్ మంచివే. గొప్ప ఆలోచన" అన్నారు.

"యూనివర్సిటీ అంటే పిల్లలకి పాఠాలు చెప్పాలి. తనకు పాఠం చెబుతూ కూర్చోడంవల్ల కాలం వృథా" అన్నాడు.

"పాఠం చెప్పేవాళ్ళు వేరే ఉంటారు. మీరు పరిశోధన చేస్తే చాల"న్నారు.

"పరిశోధనకి కావల్సిన ఆధునికమైన పరికరాలు సమకూర్చడమేకాక, తను దేనికీ వెతుకులాడే పరిస్థితి రాకూడదు" అన్నాడు.

"నువ్వు వస్తే చాలు. నీకు ఏది కావాలంటే అది ఇస్తాం" అన్నారు.

"మామూలు ప్రొఫెసర్‌గా వస్తే మిగిలిన వాళ్ళకీ, తనకీ తేడా ఏమిట"న్నాడు.

"యూనివర్సిటీ సైన్స్ విభాగాలన్నిటికీ డైరెక్టర్‌వి నువ్వే. నీకు బాస్ లేనేలేడు" అన్నారు. "నీ కాగితాలు డైరక్టుగా ఎక్కడికైనా ఎగిరిపోతాయి. నీకు దేనికీ ప్రశ్న వేయబడదు" అని హామీ ఇచ్చింది ప్రభుత్వం.

యుద్ధప్రాతిపదికమీద కొన్ని కోట్ల రూపాయల ఖర్చుతో అంతరిక్ష విభాగం ఆ యూనివర్సిటీలో వెలిసింది. మకుటంలేని మహారాజులా సత్యం యూనివర్సిటీలో కాలు మోపాడు. సిబ్బంది ఏది అడిగినా నిమిషాలలో సమకూర్చారు. సెక్రటరీ, పి.ఎ., డ్రైవర్, పనివాళ్ళు, ఆఫీస్ బిల్డింగ్, చుట్టూ ఉద్యానవనం, ప్రతీదీ స్పెషల్‌గానే ఉంది. భవన నిర్మాణం రాజుగారి కోట తీరులో ఉండడం గమనించి ఫ్యూడల్ వ్యవస్థ మనదేశంలో ఇంకా పోలేదు వర్థిల్లు గాక, అని నవ్వుకున్నాడు సత్యం.

సైన్స్ విభాగాలన్నిటికీ అధిపతి కాబట్టి సత్యంని అన్ని విద్యాసంస్థలు తమ సలహాదారుగా పెట్టుకున్నాయి. అంతరిక్షానికి, మిగిలిన శాస్త్రాలకి ఏం 'బీరకాయ పీచు' సంబంధమో సామాన్యులకి తెలియదు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆకాశంలో

సూర్యుడు ఎలాగో శాస్త్రవిజ్ఞానానికి సత్యంని అలా తయారుచేసి పెట్టారు. కానీ సత్యం మాత్రం తనెంతో త్యాగం చేసినట్టు, తన శక్తులన్నీ ఇక్కడ చవగ్గా ధారపోస్తున్నట్టు ఫీలయ్యేవాడు.

ఓ యూనివర్శిటీ ప్రొఫెసర్ ఇంకో యూనివర్శిటీ ప్రొఫెసర్‌ని, ఏ ఎయిర్ పోర్టులోనో కలుసుకున్నప్పుడు "సత్యంని మా యూనివర్శిటీకి ఎన్నిసార్లు పిలిచినా డేట్స్ ఇవ్వడంలేదు. మీ యూనివర్శిటీకి అప్పుడే రెండుసార్లు వచ్చాడా? " అని అడగడం...

"అవును. మా యూనివర్శిటీ సెంటర్‌లో ఉంది. మీ యూనివర్శిటీకి ఎయిర్‌పోర్టే లేదు. సత్యం ఎలా వస్తాడు? అతనికి అంత టైం ఎక్కడ? " అంటాడు మరో ప్రొఫెసర్.

నిజానికి ఆ రెండు యూనివర్శిటీలలోనూ అంతరిక్ష పరిశోధన అనేది జరగడమేలేదు. సత్యం మా యూనివర్శిటీకి వచ్చేడనడం ఓ ప్రిస్టేజి ఇష్యూ అయింది అంతే!

కంటిమీద పరిశోధనైనా, మందుల మీదైనా, ఎలక్ట్రానిక్స్ అయినా, జీవరసాయన విభాగమైనా, 'ఇందుగలడందులేడని' సత్యం ఉంటేనే ఫంక్షన్ అన్నట్లయింది.

విదేశాలలో లేదా దేశంలో నాలుగుచోట్లకీ తిరగడం, విద్యార్థులతో ఫోన్, ఫాక్స్, ఇ-మెయిల్ ద్వారా పరిశోధనలు జరిపించడం ఇలా ఓ సంవత్సరం గడిచింది. అప్పుడు సత్యం తనని గురించి తను ఆలోచించు కుంటే తన మనసుకి నచ్చినట్టు ఒక్క పనీ జరగలేదని తేలింది. తన క్లాస్‌మేట్ కోలాని రాడార్ విభాగంలో ప్రొఫెసర్‌గా ఎంపిక చెయ్యగలిగాడు. అంతరాల్లో సత్యంకి తెలుసు కోలా కూడా తనలాగే అవకాశ ముంటే అందలమెక్కే అర్హత ఉన్నవాడేనని. కానీ అదృష్టం అందరినీ వరించదని సత్యంకి తెలుసు. అన్నీ అందుబాటులో ఉన్నా ఈనాడు తనేం చెయ్యగలుగుతు న్నాడు. కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి తెప్పించిన పరికరాలు అలంకారాలుగా మిగి లాయి. ఒకటి పనిచేస్తే ఇంకోటి పనిచె య్యదు. ఏ టెక్నీషియన్‌కీ ఏ పనీ సరిగా రాదు. ఏ పరికరం పాడయినా అన్నీ విప్ప దీస్తారు. తిరిగి ఏదీ సరిగా అమర్చలేకపో తున్నారు. తయారుచేసిన కంపెనీలనుంచి మనుషులు వస్తేకానీ ఏది పాడయిందో కూడా తెలియడంలేదు. ఫారిన్ కొలాబరేటర్స్ వచ్చినప్పుడు పరికరాలు ఎలా పనిచే స్తాయో చూపిద్దామంటే పదోవంతు పరికరా లయినా సరిగా పనిచెయ్యవు. కరెంట్ ఉంటే నీళ్ళుండవు. పరిశోధనకనుగుణమైన వాతావరణం లేదనుకున్నాడు సత్యం.

కాన్ఫరెన్స్‌కోసం జర్మనీకి వెళ్ళిన సత్యంకి తన యూనివర్శిటీనుంచి భారీవర్షాలవల్ల, ఎలక్ట్రిసిటీ వైరింగ్‌లోపంవల్ల తన లాబ్‌లో పరికరాలన్నీ దగ్ధమయ్యేయనే వార్త వచ్చింది. అంతే! సత్యం జర్మనీనుంచి తిరిగి రాలేదు. అమెరికా వెళ్ళిపోయాడు. 'కష్టాల్ వస్తే రానీ, నష్టాల్ వస్తేరానీ' ఏం చేస్తామ నుకొని మళ్ళీ లాబ్స్ యథాప్రకారంగా తయారుచేసి, పరికరాలన్నీ కొత్తగా తెప్పించి, రికార్డు టైంలో అన్నీ అమర్చి సత్యంను రమ్మని అధికారులు బతిమాలడం మొదలుపెట్టారు.

స్వతహాగా పరిశోధనంటే ఆసక్తి ఉన్న సత్యం ఇండియాకి తిరిగివస్తే అక్కడ తను సాధించేదేదీ లేదని ఎప్పుడో గ్రహించుకు న్నాడు. ఇండియాకి నేను రానని ఖచ్చితంగా చెప్పడానికి సెన్సిటివ్‌గా ఫీలవుతున్నాడు. తనకున్న విలువకి తలమునకలవుతు న్నాడు.

కుటుంబవిషయాలకొస్తే సత్యంకి అక్కడా పరిస్థితులు అంతంతమాత్రంగానే ఉన్నాయి. సత్యం మెడికో భార్యకి ఇంకో మెడికోతో సాన్నిహిత్యం ఏర్పడింది. సత్యం భార్య ధనానికి, అధికారానికి ఏనాడూ ఎదు రుచూసే పరిస్థితిలేదు. వడ్డించిన విస్తరి

లాంటి జీవితం. సత్యం అమెరికా వెళ్ళి తను రావడానికి కొంతకాలం పట్టవచ్చు కాబట్టి భార్యని రమ్మని కాగితాలు పంపించాడు. సత్యం భార్య విదేశాలలో వారంకన్నా ఏపనీ లేకుండా ఉండలేనని, తన వృత్తి తనకు చాలా ముఖ్యమని తేల్చిచెప్పింది. సత్యంకి ఇండియాలో ఉన్నప్పుడైనా అతనికీ, అతని మెడికో భార్యకి టైం కుదిరి మాట్లాడుకోడానికి అవకాశం అంతగా వచ్చేదికాదు. భార్య మెడికో బోయ్‌ఫ్రెండ్ ఆవిడని ఎప్పుడూ వెన్నంటి ఉండేవాడు. భార్య బోయ్‌ఫ్రెండ్ ఉండగా అదికూడా పక్కనే ఉండగా భర్తకి మాట్లాడడానికి ప్రత్యేకం ఏముంటుంది? సత్యంని వివాహ బంధమైనా కట్టిపడేస్తుంది అనుకుంటే, ఆ బంధం కూడా కొత్త తోవ చూసుకోమంది.

సత్యంని అధికారవర్గాలు ఆకాశానికి ఎత్తటంచూసి 'ఛాలెంజ్ సత్యం ఇక్కడికి వచ్చి ఉండలేడు' అనేవాడు కోలా. ఈనాడు అతని వాక్కు నిజమైంది. సత్యం రాడని తను అనుకుంటే సరిపోదని కోలాకి తెలుసు. ఆ సంగతి అధికారవర్గాలు తెలుసుకోవాలి. సత్యం ఇండియాకి రాకపోతే ఆ స్థానంలో తాను ఉండవచ్చునని కోలా కలలు కంటున్నాడు. సత్యం విద్యార్థులు ఫోను, ఇ-మెయిల్‌ద్వారా సత్యం సలహాలు తీసుకుంటూ పరిశోధనలు పండిస్తున్నారు. సత్యమేమో తనకు నచ్చిన పరిశోధన అక్కడ అమెరికన్ లాబ్స్‌లో హాయిగా చేసుకుంటున్నాడు.

ఉండి, ఉండి యూనివర్సిటీ అధికారులు అన్నీ రెడీచేస్తాం రమ్మని వార్త పంపిస్తూంటారు.

కోలా "ఇంక సత్యం రాడు సత్యం లాబ్స్ అన్నీ నావే" అంటాడు. ఇలా ఉంది ఆ యూనివర్సిటీలో అంతరిక్ష పరిశోధన!

కోలా అమెరికావెళ్ళి సత్యంతో మాట్లాడి వీలయితే అతని రెజిగ్నేషన్ లెటర్ స్వయంగా తేవాలని ప్లాన్ చేస్తున్నాడు. ఏ కాన్ఫరెన్స్‌కో, విజిటింగ్ ప్రొఫెసర్ గానో ఛాన్స్ కొట్టేసి అమెరికా వెళ్ళాలనుకుంటూంటే అతుల్‌పాండే ఇన్విటేషన్‌తో ఆ సమస్య తీరింది. ఫ్రస్ట్రేషన్ కోలాచేత విచిత్రమైన పనులు చేయిస్తూంటుంది. కోలా తప్పులేదు, పరిస్థితుల ప్రభావం అనుకునే వాళ్ళూ ఉన్నారు.



లైబ్రరీలో కొత్తగా వచ్చిన పుస్తకాలకోసం వెతుకుతోంది ముక్త. పక్క షెల్ఫ్ దగ్గర కోలా పుస్తకాలు తీస్తూ కింద పడేస్తున్నాడు. సడన్‌గా ముక్త భుజంమీద చరిచి, "రాల్ఫ్ విలియమ్స్ టెంపరేచర్ థియరీ కనిపించదేమిటి? " అన్నాడు.

ముక్త వెతుకుతున్నట్టు నటిస్తూ, అక్కడి నుంచి ఎలా తప్పించుకుందామా? అని చూస్తోంది.

"ఇదిగో... ఇదో కొత్త పుస్తకం" అంటూ పుస్తకం చూపిస్తున్న నెపంతో ముక్తకి అతి దగ్గరగా నిలడ్డాడు.

"ఆ ఇప్పుడే చదువుతా" అంటూ ఆ పుస్తకం తీసుకుని మెయిన్ హాలులో పది మందీ కూర్చుని చదువుకునేచోటుకి వచ్చి కూర్చుంది.

మధ్యాహ్నం లాబ్‌లోకి వెళ్ళిన ముక్త పర

ధ్యానంలో ముందురోజు తయారుచేసిన గ్రాఫ్స్ టేబుల్ మీద పరుచుకుంటూ పూర్వా పరాలు ఆలోచిస్తోంది.

కోలా వచ్చాడు. గ్రాఫ్స్ ఎలా తయారుచేశావో విశదీకరించి చెప్పమన్నాడు ముక్తని.

ఇంకా లాబ్ లో నలుగురున్నారు. ముక్త చెప్పింది.

"ఆసక్తికరంగా ఉంది. వచ్చేనెల 'ఔరంగాబాద్ కాన్ఫరెన్స్'కి నువ్వు కూడా రావచ్చు. ఆ కాన్ఫరెన్స్‌లో ఈ గ్రాఫ్స్ ప్రజంట్ చెయ్యవచ్చు. గ్లాస్, మెటల్ మాత్రమే చూశావు. ప్లాస్టిక్స్ కూడా టెంపరేచర్ తేడాలు గమనిస్తూ, మూడింటిలో వేటికి ఎక్కువ శక్తి ఉందో తెలుసుకోవాలి" అన్నాడు.

"ప్లాస్టిక్ లెన్స్ స్టాక్ లాబ్ లో లేదు. అవి ఫారిన్‌నుంచి తెప్పించాలిట. ఈ కాన్ఫరెన్స్‌లో ప్రెజెంట్ చెయ్యడం కుదరదు" అంది ముక్త.

"అయితే ప్లాస్టిక్ లెన్స్‌మీద ఎక్స్పర్‌మెంట్ వదిలిపెట్టు. మిగిలినవి రెండే చాలు"

"మరి ప్లాస్టిక్స్"

"జర్నల్సు చదివి ఎవరైనా పరిశోధించారేమో చూసి రిజల్ట్సు కొంచెం సరిదిద్దితే సరి" అన్నాడు కోలా.

"రిజల్ట్సు వచ్చినట్టు ఏదోలా చూపించాలన్నమాట" అనుకుంది ముక్త.

ఈమాటే తనతోపాటు పనిచేస్తున్న విద్యార్థులతో అంటే, ఒక్కొక్కప్పుడు సూపర్‌వైజర్ ఏదోలా ఎడ్జెస్టు అవమని చెప్పినా కూడా, వీలయినంతవరకూ మనమే ఖచ్చితమైన ఫలితాలకి ప్రయత్నించుకోవాలనే అభిప్రాయం వెలిబుచ్చారు.

"అంటే ఎలా? " అంది ముక్త.

"ఏముంది. వేరే ఎవరి లాబ్స్‌లోనైనా ప్లాస్టిక్ లెన్స్ ఉన్నాయేమో ప్రయత్నించుకోవాలి. తెచ్చుకొని మీ పని మీరు చేసుకుని ప్లాస్టిక్ లెన్స్ స్టాక్ రాగానే మళ్ళీ వాళ్లవి వాళ్ళకి ఇచ్చేయాలి" అన్నారొకరు.

"వేదవతిగారి లాబ్స్‌లో ఉంటాయి. సత్యం లాబ్ లో కూడా ఉండవచ్చుగానీ వాళ్ళ లాబ్స్‌నుంచి వస్తువులు బయటికి రావడం గగనం" అన్నారు మరొకరు.

"వేదవతిగారు నాకు ఇస్తారా? " అంది ముక్త. ముక్త ముందు వేదవతిగారి దగ్గరే చేరిందని అక్కడవాళ్ళకి తెలుసు.

"వేదవతిగారు ఎకడమీషియన్. స్టూడెంట్స్‌కి హెల్ప్ చెయ్యాలనే మనస్తత్వం ఆవిడకి ఉంది. మీరు కోలాదగ్గరకి మారినప్పుడు కూడా ఈ మార్పులేమిటని ఎవరో అంటే, కావాలనుకున్నచోట పనిచెయ్యగలిగే స్వేచ్ఛ విద్యార్థులకివ్వాలి. అని మిగిలిన స్టాఫ్‌తో వాదించారుట తెలుసా" అన్నారింకొకరు.

ఆలోచనతో బరువైన ముక్త కళ్ళు విశాలమయ్యాయి.

★ ★ ★

ముక్త లాబ్ లో స్టూలుమీద కూర్చుని, రకరకాల లెన్స్ టెంపరేచర్స్ మార్చి చూసిన డేటా పరీక్షిస్తోంది. కోలా వచ్చాడు. ముక్త లేచి నిలబడబోయింది.

"ఓ... ముక్తా! సిల్లీ ఫార్మాలిటీస్. కమాన్. సిట్ డౌన్. నీ పని నువ్వు చేసుకో" అంటూ ముక్త రెండు భుజాలమీద చేతులువేసి ముక్తని స్టూలుమీద కూలేశాడు.

ముక్తకి కోలా తనని తాకడం నచ్చలేదు. చికాకనిపించింది. మనసు కుదుటపరచుకొని సీరియస్‌గా తన పనిని తను చేసుకుంటోంది. కోలా వెనకనుంచి వచ్చి ముక్త భుజాలమీద, వీపుమీద తన బరువంతా తోసి ముక్తమీద ఆనుకొని ముక్త చూస్తున్న కాగితాలని తను కూడా చూడబోయాడు.

ఈ హఠాత్ సంఘటనకి దిగ్భ్రాంతురాలైంది ముక్త. చేతికి దగ్గరలోనే ఉన్న గ్లాస్ లెన్స్‌లన్నీ విసురుగా వచ్చిన ముక్త చేతికి తగిలి కింద పడ్డాయి.

"ఆర్ యు మేడ్" అని కోలాని విదిలించుకుంది ముక్తా.

కోలా ఒక్కసారిగా సర్దుకొని, "ముక్తా

ఎందుకలా అరుస్తావు? ఏం జరిగిందని" అంటూంటే తెల్లబోయి అవాక్కయి చూస్తూండిపోయింది ముక్త

"నీకు యాంగిల్స్ డిఫరెన్షియేట్ చెయ్యడం రాకపోతే సీనియర్స్‌ని అడిగి తెలుసుకోవాలి. పనిచెయ్యడం తెలియక, విదేశాలనుంచి తెప్పించిన ఈ ఖరీదైన లెన్స్ విసిరికొడతావా? "

కసి, ఉక్రోషం, ఆవేశం, అసహాయత అన్నీ కలగలిసిపోయిన ముక్త కోలా దౌర్జన్యానికి, సిగ్గులేనితనానికి అసహ్యించుకుంటూ "మిస్టర్ కోలా మీరు సూపర్‌వైజర్. నేను స్టూడెంట్‌ని. నాకు ఏదైనా సందేహాలు వస్తే నేను మీ దగ్గరికి వచ్చి తెలుసుకుంటాను. నన్ను మీరు డిస్టర్బ్ చెయ్యకండి. ఈ విరిగిన లెన్స్ ఖరీదు తెలుసుకుని నేను డబ్బు చెల్లిస్తాను" కళ్ళనీళ్ళు సుడులు తిరగబోతుంటే ఈ దౌర్భాగ్యుడిముందు బేలగా కనబడడమా? నెవ్వర్ అనుకొని వెంటనే నిలదొక్కుకుని, అక్కడ సామానంతా సరైన రీతిలో సర్దుతోంది ఆ రోజు పని అక్కడితో ముగిద్దామని.

"ముక్తా చిన్న చిన్న విషయాలు సీరియస్‌గా తీసుకోకూడదు. నిన్ను 'ఔరంగాబాద్' తీసుకువెళుతున్నానంటే నువ్వేమంత గొప్ప పని చేశావని? " అన్నాడు కోలా.

"సారీ సర్! నన్ను మిగిలిన స్టూడెంట్స్‌ని ఎలా ట్రీట్ చేస్తున్నారో అలాగే చెయ్యండి. నో స్పెషల్ స్టేటస్ ప్లీజ్! ఐ డోంట్ నీడిట్!"

"మిగిలినవాళ్ళు మొగపిల్లలు. సిగరెట్స్ తెమ్మంటాను. డ్రింక్స్ తెమ్మంటాను నువ్వు తేగలవా? "

ఈ కిరాతకునికి సమాధానం చెప్పడం దండగ అనుకుంగి ముక్త. సర్దడమైపోయింది. పర్స్ తీసుకొంది. వెళ్ళబోతుంటే, "లాబ్ లాక్ చెయ్యకుండానే వెళ్ళిపోతావా? " అన్నాడు.

"బయటికి నడిస్తే తాళం వేస్తాను" ముక్తకి ఒళ్ళు మండిపోతోంది.

"నువ్వు నన్ను బయటకి తీసుకువెళితే" అంటూ చెయ్యందించాడు.

కోలా గూబ గుయ్యిమంది. వీడికి తను బుద్ధి చెప్పాలని దైవనిర్ణయం కాబోలనుకొని, రూం బయటకి నడిచింది. బరువెక్కిన తలతో లాబ్‌నించి 'రోబోట్ సెంటర్' వరకు ఎలా నడిచి వెళ్ళిందో ముక్తకే తెలియదు. అక్కడ నిత్యా కనిపించాడు. కాఫీ ఆర్డర్ చేశాడు. ముక్త మొహం చూసి ఏదో జరిగిందని పసికట్టాడు నిత్యా.

కాఫీ తాగుతోంది. కాని ముక్త ఏం మాట్లాడలేదు. కాఫీ బిల్లు చెల్లించాక ముక్త "పని ఉంది హాస్టల్‌కి వెళ్ళాలంటూ" లేచింది.

ఏదైనా చెప్పాలనుకొంటే ముక్త తనంతట తనే చెప్పాలికాని తనెందుకు ఆ అమ్మాయిని అడగడం అని ఊరుకొన్నాడు నిత్యా.

ముక్త మొహం దట్టంగా మబ్బులు ముసురుకొన్న ఆకాశంలా భారంగా ఉంది. ఓ చిన్న పలకరింపు, ఓ ఓదార్పు మాట వినబడితే చాలు కుంభవృష్టి కురిసేట్టుగా ఉంది. 'అయినా నిత్యాకెందుకు చెప్పాలి. ఏం చేస్తాడని? మళ్ళీ మొదలు పెడతాడు, వేదవతి దగ్గర్నుంచి మారకుండా ఉండవలసిందని. కాని తనకి కావలసింది ఏం చెయ్యకుండా ఉండవలసిందో చెప్పడం కాదు, ఏం చెయ్యాలో చెప్పగలిగేవాళ్ళు కావాలి' అనుకొంది ముక్త.

ముక్త హాస్టల్ రూంకి వచ్చి బెడ్‌మీద వాలిపోయి తలగడ తలమీదనించి మొహం మీదకి అదుముకొని గుండెలవిసేలా ఏడ్చింది. ఎప్పుడు వచ్చిందో చందన వచ్చి తలగడ మొహంమీదనించి తీసేవరకు ఆ దుఃఖం ఆగలేదు.

చందనతో ముక్త జరిగిన సంఘటనలు చెప్పింది. "కోలాకి, నాకూ మధ్య జరిగిన విషయాలకి సాక్ష్యాలు లేవు.. అందుకని నేనేమీ చేయలేను. పరిశోధన వదిలిపో

వడం తప్పు" అంది ముక్త.

"అలాకాదు నువ్వు లేచి మొహం కడుక్కొని ఫ్రెషప్ అవు. ఇలా ఊరుకొని ఏడుస్తూ కూర్చోవడం కాదు. జరిగిన విషయాలు వరదరాజేశ్వరికి చెబుదాం. వార్డెన్ సాటి స్త్రీ. విషయాలన్నీ యధాతథంగా చెప్పి ఆవిడ ఏ సలహా ఇస్తారో చూద్దాం" అంది చందన.

ఆ సాయంకాలం వరదరాజేశ్వరి రౌండ్స్‌కి వచ్చినప్పుడు ముక్త, చందన కలుసుకొన్నారు. కోలా స్టూడెంట్‌ని ట్రీట్ చేసే విధానం బాగోలేదని, కోలా ప్రవర్తన ఇలాగే కొనసాగితే ఆ లాబ్‌లో పనిచెయ్యడం కష్టమవుతుందని చెప్పారు.

దానికి వరదరాజేశ్వరి "ముక్తా! నీకూ, కోలాకి మధ్య జరిగిన సంభాషణలు ఎవరైనా విన్నారా? అతను నిన్ను తాకినప్పుడు ఎవరైనా చూశారా? సాక్ష్యముందా?" అంది.

"సాక్ష్యమా? లేదు"

"మరి సాక్ష్యం లేకుండా నీ మాట పట్టుకొని సాటి స్టాఫ్‌మెంబర్‌కి వార్నింగ్ ఇవ్వమంటావా? కుదరదే. నువ్వు నీ జాగ్రత్తలో ఉండాలి. ఈ రోజుల్లో అమ్మాయిలు తక్కువేం కాదు. ఊరికే రెచ్చగొడతారు" అంటూ ముక్తని, చందనని నఖశిఖపర్యంతం పరీక్షగా చూసి ముందుకు సాగిపోయింది.

"చూశావా? ఇంకో మనిషికి మన విషయాలు బహిర్గతం చేశామే కాని, దానివల్ల మనకి జరిగిందేమిటి? మనిద్దర్నీ చాలా చీప్‌గా చూసింది వార్డెన్" అంది ముక్త.

చందన ముక్త మాటలతో ఏకీభవించలేదు. "మనం ఊరుకొంటే కోలా ఆగడాలు మరింత మితిమీరితే? అప్పుడీ వరదరాజేశ్వరే నాకు ముందే ఎందుకు చెప్పలేదు? వార్డెన్‌ని ఒకదాన్ని ఉన్నానుకదా మీ బాగోగులు చూసేందుకు అంటుంది. ఎంతైనా చెప్పడమే మంచిదయింది" అంది చందన

★ ★ ★

"ముక్తా! మన ఔరంగాబాద్ కాన్ఫరెన్స్‌కి టికెట్స్ తెప్పించేను" అన్నాడు కోలా.

ముక్త ఏమీ జరగనట్టున్న కోలా సిగ్గులేనితనానికి ఆశ్చర్యపోయింది. "సారీ నేను కాన్ఫరెన్స్‌కి వచ్చి చెప్పగలిగేంత పనేమీ చెయ్యలేదు. తొందరపడి అక్కడకి వచ్చి నేనేపనిచేస్తున్నానో చెప్పుకోవడానికి నా పరిశోధన ప్రాథమిక దశలో కూడా లేదు. మీరు సీనియర్స్‌ని ఎవరినైనా తీసుకువెళ్ళండి. నేను రాను" అంది ముక్త.

"సూపర్‌వైజర్‌ని నేను కాన్ఫరెన్స్‌కి రమ్మంటే రానంటావా? నువ్వు పనిచేసింది చెప్పడానికి కాదు కాన్ఫరెన్స్‌కి రమ్మంటూంట. పేపర్ ఎలా చదువుతారు? ప్రశ్నలు ఎలా ఉంటాయి? సమాధానాలు ఎలా ఉంటాయి? అదే ఫీల్డులో పనిచేస్తున్న వాళ్ళ ఆలోచనావిధానాలు ఏమిటి? ఇవన్నీ తెలుసుకోవచ్చు" అన్నాడు కోలా.

"సారీ! నేను రాను" అంటూ అక్కడినించి వెళ్ళిపోయింది ముక్త.

"ఎంత పొగరు?" అనుకొన్నాడు కోలా మనసులోనే. ఆనాటినుంచి ముక్త ఒంటరిగా కనిపిస్తే చాలు. ఏదో నెపంతో మానసికంగా హింసిస్తున్నాడు. ఈ ఒత్తిడి తట్టుకోలేక ముక్త చాలా కృంగిపోతోంది.

రోబోట్ సెంటర్‌లో కూర్చొన్న ముక్తకి, విద్యార్థులందరూ ఏవో కబుర్లు చెప్పుకొంటూ, నవ్వుకొంటూ ఉల్లాసంగా కనిపించారు. ముక్తకి ఎంతో అసంతృప్తి, దిగులు. అందరిలా సంతోషంగా, ఉత్సాహంగా ఉండలేకపోతోంది. ముక్తకి ఈ మధ్యకాలంలో మనసెప్పుడూ అల్లకల్లోలంగా ఉంటోంది. ఎప్పటికైనా అందరిలా ఉంటానా! అనుకొంది ముక్త.

ముక్త హాస్టల్‌కి నడుస్తూ తోవలో పచ్చని లాన్స్, చేమంతి, జీనియా, ఆస్టర్స్, రంగురంగుల పూలు గుంపులు గుంపులుగా కనిపిస్తూ, గాలికి ఊగినప్పుడల్లా పలకరిస్తు

న్నట్టు అనిపించి, లాబ్‌లో పడ్డ శ్రమంతా మరచిపోయినట్టుగా అనుభూతి చెందేది. అవే పూలు ఇప్పుడు చూస్తుంటే, ఎంతో నిర్జీవంగా కనిపించాయి. అవే పూలు గాలికి ఊగినప్పుడల్లా తనకి టాటా, బైబై చెబుతున్నట్టుగా ఫీలవుతోంది. మళ్ళీ అంతలోనే పూలు నిర్జీవంగా లేవు. ఎప్పుడూ సౌందర్య పూరకాలుగానే జీవకళ ఉట్టిపడుతూనే ఉన్నాయి. తన మనసే మలినంగా, చికాకుగా ఉంది. అయినా ఎవరితో చెప్పుకొంటుంది? " అనుకుంది. తనమాట ఎవరు పట్టించుకొంటారు? మాటిమాటికి కణతలు నొక్కుకుంటూ తనకి తలనెప్పిగా ఉందని అనుకొంది. మళ్ళీ రోబోట్ సెంటర్‌కి వచ్చి మాత్ర కొనుక్కొంది. రోబోట్ బొమ్మ కళకళలాడుతూనే ఉన్నా, తనకెందుకో రోబోట్ బొమ్మ నిర్బంధంలో ఉండిపోయినట్టు, సమస్యల వలయంలో చిక్కుకుపోయినట్టు, చుట్టుపక్కల వాళ్ళంతా ఆ బొమ్మని ఎలా విడిపించాలా? అని చర్చించుకొంటున్నట్టుగా అనుభూతి చెందింది.

రూంకి వెళ్ళిన ముక్తకి వళ్లంతా చీదరగా అనిపించి తలస్నానం చేసింది. మాత్ర వేసుకొని చల్లటినీరు తాగి పడుకొంది. అలా ఏవేవో లోకాలకి వెళ్ళినట్టు ఒళ్లు తెలియని నిద్రపట్టింది. నిద్రలో భూమి పొరలు ఒకటొకటిగా చీల్చుకొని తనేదో పాతాళంలోకి వెళ్ళిపోతున్నట్టు కల. పైనుంచి ఎవరో గట్టిగా కుదుపుతుంటే, బలవంతంగా కళ్లు విప్పింది. ఎదురుగా చందన, సరోజ.

ఏయ్ ముక్తా! ఎంత గాఢంగా నిద్రపోయేవు. ఎంతసేపు పట్టిందో నిన్ను మేల్కొలపడానికి. ఆడిటోరియంలో మిమిక్రీ ప్రోగ్రాం ఉందట. మేం అంతా వెళ్ళాలని తయారయ్యాం. నీకోసం చూస్తే ఈ వేళప్పుడు ఇంత నిద్రా? "

"నేను రాను. మీరు వెళ్ళండి"!

"నువ్వు రావాలనుకొనే, అంతమంచి నిద్ర పాడుచేశాం. ఇంక బెట్టు చెయ్యక, రెడీకా మూడే నిమిషాలు టైం" అంది చందన.

ఇంక తనని వదిలిపెట్టరని, ముక్త లేచి రెడీ అయింది. ఆడిటోరియంవైపు గుంపుగా నడిచివెళుతున్నారు. ముక్త నడుస్తున్నా, మనసెక్కడో తిరుగుతోంది. నిత్యా, సాగర్, మరికొంతమంది మధ్యలో కలిశారు. ముక్త వాళ్ళని గమనించనేలేదు. పలకరించినా రెస్పాన్స్ లేదు.

"ముక్తా ఏదో మూడీగా ఉన్నావు. ఎక్స్పెరిమెంటు పాడయిందా? "

తనేది మరచిపోవాలనుకొంటోందో అదే విషయం గుర్తుకు తెస్తున్నారు. తమాయించుకొని,

"అబ్బే అదేంలేదు. నిద్రమత్తు" అంది.

ఆడిటోరియం వచ్చింది. అంతా కూర్చున్నారు. ప్రోగ్రాం జరుగుతోంది. ముక్త దృష్టి పెట్టలేకపోతోంది. ఎంతసేపూ 'కోలాతో సమస్య ఎలా టాకిల్ చెయ్యాలి? వేదవతి దగ్గర్నుంచి, కోలా దగ్గరకి ఎలా మారిపోయింది? ఎందుకలా జరిగిందో, ఎవరికి చెబితే సానుభూతితో తనని అర్థం చేసుకొని, పరిష్కారం చూపిస్తారు' అన్న ఆలోచనలే. మిమిక్రీ ఆర్టిస్టు పకపక నవ్వుతూంటే తన మొహం తనని చూసి నవ్వుతున్నట్టనిపించి సర్దుకు కూర్చొంది ముక్త.

★ ★ ★

రీనా పెళ్ళి హైదరాబాద్‌లో. కొంతమంది అబ్బాయిలు, అమ్మాయిలు కలిసి సరదాగా వెళదామని ప్లాన్ చేసుకొన్నారు. ముక్తని కూడా రమ్మని చాలా బలవంతం చేశారు. ముక్తకి మనసులో వెళ్ళాలని ఉన్నా నాలుగురోజులు లాబ్‌కి రానని కోలా దగ్గరికి వెళ్ళి చెప్పాలి. కోలా దగ్గరకి వెళ్ళి చెప్పాలంటేనే కంపరంగా ఉంటే, ఈ పరిశోధన ఎంతవరకు ముందుకు వెళుతుందనే వ్యథ ముక్తని కృంగదీస్తోంది.

ముక్తమీద అందరూ జోక్స్ వేశారు. పెద్ద రిసెర్చి వెలగబెడుతున్నది ఈవిడ ఒకర్తే. నోబుల్ ప్రైజ్‌కి ప్రయత్నమట. నాలుగురో

జులంటే మాటలా నాలుగు యుగాలతో సమానమంటూ ఆటపట్టించారు.

అందరూ బస్‌స్టాండ్‌కి వెళుతుంటే తనూ ఇంకో అమ్మాయి బస్‌స్టాండ్ వరకూ సాగనంపుదామని వెళ్ళారు. విద్యార్థులంతా కలిసి, బస్ వచ్చేలోగా, బస్‌స్టాండ్‌ని ఓ సంతచేసి పెట్టారు. చేతుల్లో కెమేరాలు, బైనాక్యులర్స్, ఉత్సాహమంతా అక్కడ వెల్లువై పారుతోంది.

"రీనాకో కజిన్‌బ్రదర్ ఉన్నాడట. మేమంతా నీ దగ్గరే, నీ పక్కనే ఉంటాం. పనిలోపని నీ పెళ్లి కూడా నిర్ణయం చేసుకో సరోజా" అంది జాహ్నవి.

"అదసలు ఆ పనిమీదే బయలుదేరింది. పెళ్ళి ఊరికే వంక. సూట్‌కేస్ మూడురోజులనించి సర్దుతోంది. ఏ చీర బాగుంటుందా? ఏ డ్రెస్ బాగుంటుందా? అని ఒకటే తాపత్రయం" అంది మరో అమ్మాయి.

సరోజ ఉక్రోషంగా జాహ్నవి పోనీటైల్ పట్టుకోబోతే, చేతిలోంచి పట్టుదొరకక జారిపోతోంది. బస్ రావడంతో అందరూ ఎక్కారు. చుట్టుపక్కలంతా నిశ్శబ్దంగా ఒక్కసారిగా వెలవెలబోయింది బస్‌స్టాప్. ముక్త లేబ్‌కి వెళ్ళాలంది. వెంట వచ్చిన చిత్ర హాస్టల్‌వైపు బయలుదేరింది.

రంజిత్ మోటార్‌సైకిల్ చప్పుడు చేస్తూ, ముక్త పక్కగా ఆగింది. ముక్త, "రంజిత్ నువ్వు వెళ్ళలేదేం పెళ్ళికి?" అంది.

"వెళుతున్నాను. రాత్రి ట్రైన్‌కి. హిందీ ఎమ్.ఎ. చదువుతున్న స్టూడెంట్‌కి తీవ్రమైన ఆస్తమా ఎటాక్ వచ్చింది. ఆక్సిజన్ పెట్టారు. ఇప్పుడే తీసేశారు. కొంత నయమైంది.

"నిన్న రాత్రి ఎమర్జెన్సీ అని హాస్టల్ వార్డెన్ దగ్గరకి వెళితే నిద్రాభంగం చేసినందుకు మామీద చిందులు. బాధ్యతలు తీసుకోడానికి ఇష్టం లేనప్పుడు, వార్డెన్‌గా ఉండడానికి ఒప్పుకోకూడదు. స్టూడెంట్‌కి పీకిమీదికొస్తుంటే పిలవకుండా ఎలా?

"ఓసారి ఇలాగే ఓ స్టూడెంట్‌కి ఉధృతంగా ఆస్తమా ఎటాక్ వచ్చింది. వార్డెన్ "నేను ముందే చెప్పాను. ఇలాంటి వ్యక్తికి హాస్టల్లో ఉండడం కష్టమవుతుందని. నాకు తెలుసు, వైద్య సదుపాయం ఏమాత్రం ఆలస్యమైనా ప్రమాదమని. అయినా పెద్దల రికమెండేషన్‌తో తల్లిదండ్రులు చేర్పించారు. ఇప్పుడా తల్లిదండ్రులని, పెద్దలని పిలిస్తే వస్తారా? హాస్పిటల్‌కి తీసుకెళ్ళడానికి" అంటూ మొదలెట్టింది.

"ఒళ్ళు తెలియని ఆయాసంతో బాధపడుతున్న పేషెంట్‌కి ఈ మాటలు పట్టించుకొనే స్థితి ఎక్కడుంటుంది? హాస్పిటల్‌కి ఇప్పుడు తీసుకెళ్ళడం ఎలాగా తప్పదు. ఈ లెక్చర్‌వల్ల ఇంకింత ఆలస్యం అవుతోందని కొందరి గొడవ. ఇంతకీ ఆ విద్యార్థికి హాస్పిటల్ చేరకుండానే ఊపిరి సలపక ప్రాణాలు పోయాయి. తప్పు ఎవరిది? వార్డెన్‌దా? ఆ అబ్బాయిని చేర్పించిన తల్లిదండ్రులదా? రికమెండ్ చేసిన పెద్దలదా? ఆ విద్యార్థికి సరైన సమయంలో ట్రీట్‌మెంట్ జరిగుంటే బతికేవాడే అనిపించింది మా అందరికీ! ముక్తా! మీరెందుకు పెళ్లికి వెళ్ళలేదు? "

"అదా? " రంజిత్‌ని చూస్తేనే ముక్తకి ఒళ్ళుమండిపోతోంది. అసలు రంజిత్ మూలంగా ఇలా కోలా లాబ్‌లో చిక్కుపడ్డానని ముక్త అంతరాల్లో బాధపడుతోంది. రంజిత్ అనవసరమైన విషయాల్లో కల్పించుకోకుండా ఉంటే ఎంత బాగుండుననుకొంటోంది ముక్త.

"మాట్లాడరేమిటి ముక్తా పెళ్లికి మీరెందుకు వెళ్ళలేదు? "

తన ఆలోచనల పరంపరలోంచి బయటికి వచ్చిన ముక్త "కొన్ని ముఖ్యమైన పనులుండి ఉండిపోయాను. మీకు కోలా బాగా తెలుసుకదా. ఎలాంటి ప్రొఫెసర్? "

"చాలా మంచివారు. స్టూడెంట్స్‌కి సహాయం చేస్తారు. స్టూడెంట్స్‌తో చాలా

స్నేహంగా కష్టసుఖాలు తెలుసుకొంటూ దగ్గరుండి రిసెర్చి చేయిస్తారని పేరు"

"నా గురించి కోలాకి చెప్పి ఈ అమ్మాయిని రిసెర్చికి మీ దగ్గర తీసుకోండి అంటే "సరే" అన్నారు అంతేనా? "

"అవును. అలాగే సహాయం చేస్తానన్నారు"

"మరి నేను వేదవతి గారి దగ్గరే చేరాను. ఓ నెలగా పని చేస్తున్నాను. నేనేదో 'కోలా దగ్గర పని చేసిన స్టూడెంట్ వర్క్ బాగుంది, కంటిన్యూ చేస్తే బాగుండేది' అన్నందుకు మీరు సారథ్యం వహించి, నానా గందరగోళం చేసి కోలా దగ్గర చేర్పించారు. నేను వేదవతిగారి దగ్గరనించి మారి పోతానని చెప్పినప్పుడు ఆవిడ ఎలా ఫీలవ్వాలి? నేను చాలా చాలా పొరపాటు చేశాను ఇలా మారినందుకు. నేను రీసెర్చి టాపిక్ సెలెక్టు చేసుకుని, ఈ రకంగా చెయ్యాలనుందంటే కాదనేవారా? మీలాంటి విద్యార్థినాయకులుండబట్టే ఎకడమిక్ వాతావరణం దెబ్బతింటోంది. వేదవతిగారి మొహం చూడ్డానికి నాకు అర్హత లేకుండా చేశారు. కోలా దగ్గర నన్ను చేర్చడం మీ పాపులారిటీకి ఉపయోగమైంది, నా రీసెర్చికి కాదు. ఇవన్నీ తల్చుకుంటుంటే నా బుర్ర పగులుతోంది. నా అంత దురదృష్టవంతులు ఎవరూ ఉండరు" అంది.

రంజిత్ అవాక్కయ్యాడు. "ఆపని చేసిపెట్టు, ఈ పని చేసిపెట్టు అంటారే తప్ప చేసిన సహాయాన్ని ఇలా విసుగ్గా వ్యాఖ్యానిస్తుందేమిటి? " అనుకొన్నాడు రంజిత్.

★ ★ ★

ఓసారి ప్రతిపక్ష నాయకుడు వరదలు చూడ్డానికి రంజిత్ సొంత ఊరు వచ్చాడు. వచ్చిన వాడు ఊరుకోక ఊగిపోతున్న వంతెనమీద నడిచి, కాలు జారి కాలువలో పడ్డాడు. వరద నీరుతో నిండిన కాలువలో ఈతరాని ప్రతిపక్ష నాయకుణ్ణి అంతమందీ చూస్తూ నిలబడితే రంజిత్ ప్రాణాలకి తెగించి నీటిలోకి దూకి ఈదుకొంటూ వెళ్ళి అతణ్ణి గట్టుకి చేర్చాడు.

ప్రతిపక్ష నాయకుడికి రంజిత్ ఆ క్షణంలో ప్రాణదాతగా కనిపించాడు. రంజిత్‌ని కౌగలించుకొని వరాలిచ్చే దేవుడిలా 'నీకేం కావాలో కోరుకో'మన్నాడు.

రంజిత్ ప్రతిపక్ష నాయకుడి కోటలో పాగా వేయగలిగేననుకొన్నాడు. అప్పటికి రంజిత్ వయసు పదహారేళ్లు. అతడు పెరిగిన వాతావరణాన్నిబట్టి, వయసుకి మించిన అనుభవం జీవితమే నేర్పింది. చిన్నచిన్న ఆశలకి అసలు లొంగిపోకూడదనుకొన్నాడు. మీ అడ్రస్ ఇవ్వండి మిమ్మల్ని పట్నం వచ్చినప్పుడు కలుసుకొంటానన్నాడు. వెంటనే ప్రతిపక్ష నాయకుడు పి.ఏ దగ్గర్నుంచి ఓ విజిటింగ్ కార్డు తీసిచ్చాడు. ఆంతరంగికులకు మాత్రమే ఇచ్చే ఫోన్ నెంబర్ కూడా ఇచ్చి తప్పకుండా పట్నం వచ్చి కలుసుకొమ్మని మరీమరీ చెప్పి వెళ్లాడు.

ఊళ్లో గుమిగూడిన జనం రంజిత్‌ని తెగ మెచ్చుకోసాగారు. ఇంటికి వెళ్లిన రంజిత్‌కి తల్లి దిష్టి తీసింది. రంజిత్‌కి తల్లి మొహం చూస్తే గుండె తరుక్కుపోతూ ఉంటుంది. చీమకైనా అపకారం తలపెట్టని మనస్తత్వం ఆవిడది.

పన్నెండేళ్లకే రంజిత్ తల్లి సూరమ్మకి ఆ రోజుల్లో సోమనాథ్‌తో పెళ్లైంది. పెళ్లయ్యాక కూడా సూరమ్మ తల్లీతండ్రీ తీరుబడిగా నలుగురిని కన్నారు. పోయిన వాళ్లు పోగా చివరకి ఆరుగురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు మిగిలారు. సూరమ్మ మూడో ఆడపిల్ల.

సూరమ్మ తండ్రి శేషాచలం, ఓ చిన్న వ్యాపారం చేసుకొంటూ ఆడ పిల్లలకి పెళ్లిళ్లు చేసి, మరి వాళ్ల మొహం చూడలేదు. శేషాచలం భార్య నరాల బలహీనత అంటూ మంచంమీద నుంచి లేచేదికాదు. శేషాచలం పిల్లల పెళ్లిళ్లు చాలా సునాయాసంగా చెయ్యగలిగాడు. వచ్చిన వాళ్లని పొగడ్తలతో ఆకా

శానికి ఎత్తేసేవాడు ఆ వచ్చిన వాళ్లు తమంతటి మంచి పెళ్లివారు నిజంగానే ఉండరేమో అనుకొంటూ శేషాచలం వూదిన బూరాకి వశమైన నాగుల్లా అతడేం చెప్తే అది వింటూ పెళ్లి చేసుకొని కోడలిని ఇంటికి తీసుకువెళ్లేవారు.

సోమనాథం పెళ్లి చేసుకొంటే కుదురు వస్తుందనే మాటకి విరుద్ధంగా పెళ్లయిన తర్వాత మరింత కుదురు లేని మనిషిలా తయారయ్యాడు. ఉద్యోగం చేసే చోట అధికారులకి ఇతగాడి ప్రవర్తన ఓ తలనొప్పిగా తయారయ్యింది. ఆలస్యంగా వచ్చినందుకు సంజాయిషీ అడిగిన అధికారిని పేపర్ వెయిట్‌తో కొట్టాడు. ఆ శుభముహూర్తాన సోమనాథం ఉద్యోగం ఊడింది. కొద్దిపాటి పొలం, ఇల్లు ఉన్న సొంత ఊరు పల్లెటూరులో సూరమ్మ, రంజిత్‌లతోపాటు సంసారం పెట్టాడు.

సోమనాథం పాకుడు మెట్ల మీదనించి కాలుజారినట్టు ఓ తప్పు పని తర్వాత ఒకటి చేస్తూ జీవితంలో సాటివాళ్ల మధ్య నిలబడలేక ఆత్మన్యూనతా భావంతో రోజురోజుకి మరింత దిగజారి పోతున్నాడు. సూరమ్మకి సోమనాథం అవలక్షణాలన్నీ క్షుణ్ణంగా అవగతమవుతున్నాయి. సూరమ్మ బాధ పుట్టింటిలో చెప్పుకుందామన్నా వినిపించుకొనే జీవిలేడు. అంతకీ ఓసారి రంజిత్‌తో కలసి వెళ్లి తన బాధలు చెప్పుకోబోతే నీకూ, వాడికీ ముడేసిన నాడే మా బాధ్యత తీరిపోయిందని తండ్రి అనడంతో ఆ ఇంటిలో మూడో పూట భోజనం చెయ్యడానికి కూడా సూరమ్మ మనసు మారాం చేసింది. రేపు ఉదయం వెళతాను అనగానే తండ్రి ప్రయాణానికి సిద్ధంగా ఉండమని చెప్పాడు. ఈమధ్య బలహీనత తగ్గిన ఆమె తల్లికి తిరిగి యవ్వనం పుంజుకొందేమో పౌడరు రాసుకొంటూ వినీవిననట్లూరుకొంది. పుట్టింట్లో అవమానాలు పొందేకన్నా ఆ సోమనాథం దగ్గరే దినాలు వెళ్లమారుస్తాననుకొని బయలుదేరి సోమనాథం దగ్గరకు వచ్చి మళ్లీ పుట్టింటి మాట ఎత్తలేదు అభిమానం ప్రాణం అనుకొనే సూరమ్మ.

రంజిత్ పెరుగుతున్న కొద్దీ డబ్బు ఇబ్బందులు కూడా ఎక్కువయిపోతున్నాయి. సోమనాథానికి వ్యవసాయం మీద శ్రద్ధ లేదు. రెండు వేలు పెట్టుబడి పెడితే వెయ్యి రూపాయలు రావడం గగనమయ్యేది. అప్పులు తేవడం, ఇక్కడిది అక్కడ అక్కడిది ఇక్కడ సర్దడం, చీట్ల పేక ఆడడం, కాఫీలు తాగడం, సిగరెట్లు పీల్చడం, సమయానికి తనకి నచ్చినట్టుగా అన్నీ అమర్చకపోతే సూరమ్మని తన్నడం అతని దినకృత్యం. సూరమ్మ ఎందుకిలా అయిపోతున్నారని అనబోతే 'లగ్నంలో శని. ఇదంతా నీ జాతక ప్రభావమే' అనేవాడు. ఏ ఆసరా లేని సూరమ్మ మంచి రోజులకోసం ఎదురు చూసేది. సూరమ్మ దుఃఖం భరించలేనపుడు చిన్నారి రంజిత్ ఒడిలో తలపెట్టుకొని ఏడ్చేది. రంజిత్‌కి వయసు వస్తుంటే 'నా తండ్రీ నువ్వు బాగా చదువుకోవాలి. బాగా డబ్బు సంపాదించాలి. గొప్ప పేరు తెచ్చుకోవాలి' అనేది. రంజిత్ అనే దీపం వెలగడానికి అవసరమయ్యే తైలం ఆవిడ దగ్గర లేదు. కన్నీరే ఆరారా పోసేది.

రంజిత్‌లో చిన్నతనం నుండీ ఏదో విధంగా అమ్మ కోరుకొనేట్టు గొప్పవాడై పేరు తెచ్చుకోవాలనే తపన అణువణువూ ఆక్రమించుకొంది. అందుకనే ఊళ్లో చిన్నవాడైనా సహాయపడే తత్వం ఉన్నవాడిగా ముద్రవేసుకొన్నాడు. ప్రతిపక్ష నాయకుడిని రక్షించడంతో రంజిత్ కీర్తి రెట్టింపయింది. తండ్రి మాత్రం 'ప్రతిపక్ష నాయకుడు డబ్బులేమైనా ఇచ్చాడా?' అని అడిగాడు. 'లేదు! వద్దన్నా'నన్నాడు రంజిత్.

"ఆ తల్లికి తగ్గ కొడుకు. ఈ గాడిద బరువులన్నీ నేనే మొయ్యాలి" అంటూ రంజిత్ మీద విరుచుకుపడ్డాడు తండ్రి. రంజిత్ తండ్రి ప్రేమానురాగాలకి ఏనాడు నోచుకో

న్నాడు కనుక. ఇలాంటి చీదరింపులు మామూలే.

రంజిత్ ఇంటర్ రిజల్ట్సు వచ్చాయి. ఎనభై శాతం మార్కులు వచ్చాయి. ఇంజనీరు కావాలనే కోరిక ఉన్నా, అది రంజిత్‌కి అందుబాటులో లేదు. కనీసం డిగ్రీ చదువుదామన్నా ఎవరికి చెప్పుకోవాలి. ఇంటర్ పరీక్షలు రాస్తున్న నాటికి ఇంజనీరింగ్ చదవగలననే ఆశలేక ఎంట్రన్స్ పరీక్షలు రాయలేదు. ఇంటర్‌తో చదువు ఆపడం ఇష్టంలేక ఓ ప్రయత్నం చేసి చూద్దామని ప్రతిపక్ష నాయకుడిని కలుసుకోడానికి రంజిత్ పట్నం వచ్చాడు. రంజిత్ తన పేరు కాగితం మీద రాసి పంపగానే ప్రతిపక్షనాయకుడు అరుణాచలం రంజిత్‌ని చాలా ఆదరంగా లోనికి ఆహ్వానించి డిగ్రీ చెయ్యమని తను తప్పక అతని చదువుకి సహాయపడతానని చెప్పాడు. రంజిత్ డిగ్రీ కాలేజీలో చేరాడు. అందరితో స్నేహంగా మసులుకొంటూ రంజిత్‌కి ఏ పని చెప్పినా పట్టుదలతో ఆ పని చేసి పెడతాడనే పేరు తెచ్చుకొన్నాడు.

అరుణాచలం రంజిత్ పేర బ్యాంక్ ఎకౌంట్ తెరిపించి అతనికి అవసరమైన డబ్బుకన్నా రెట్టింపువేసి ఓ మోటర్ బైక్ కొనిచ్చాడు. హాస్టల్లో రూం, మెస్‌లో భోజనం ఏర్పాట్లతో రంజిత్ విద్యార్థి జీవితం సాఫీగా సాగిపోతోంది. స్టూడెంట్ లీడర్‌గా ఎన్నికయ్యాడు. డిగ్రీ పూర్తయింది. పోస్ట్ గ్రాడ్యుయేషన్ పూర్తిచేసి ఐ.ఎ.యస్ అవ్వాలి అన్నాడు ప్రతిపక్ష నాయకుడు అరుణాచలం. రంజిత్ ఎమ్.ఎ చదవడానికి యూనివర్సిటీలో చేరాడు. ఎలక్షన్స్‌లో స్టూడెంట్ లీడర్‌గా యూనివర్సిటీలో ఎక్కువ ఓట్లతో ఎన్నికయ్యాడు. అరుణాచలం అదనంగా ఇచ్చే డబ్బు మళ్లీ ఏ విద్యార్థి అవసరానికో ఉపయోగించే వాడే కాని ఇంటికి డబ్బు పంపి తల్లితండ్రుల అవసరాలకి ఆదుకొందామని ఏనాడూ అనుకోలేదు. అసలు రంజిత్ తండ్రికి రంజిత్ ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో కూడా తెలీదు. తల్లికి మాత్రం తన చదువూ వివరాలన్నీ చెప్పి తండ్రిలేని సమయంలో ఏ ఆరు నెలలకో ఓసారి తల్లిని కలుసుకొని ఆమె పడే అవస్థలకి జాలిపడి తనో ఉద్యోగస్థుడయ్యాక కాని ఆమెకు సహాయపడలేనని తల్లిని సుఖపెట్టే రోజు త్వరలోనే వస్తుందని జోస్యం చెప్పి వెళ్లిపోయేవాడు.

రాష్ట్రంలో ఎలక్షన్స్ వచ్చాయి. ఆ సమయంలో రంజిత్ స్నేహితులతోపాటు అరుణాచలానికి కుడి భుజంలా పనిచేశాడు. ప్రతిపక్ష నాయకుడు అఖండ విజయాన్ని సాధించి కొత్త ప్రభుత్వంలో మినిష్టరయ్యాడు. రంజిత్ పెద్ద దండ తీసుకొని మంత్రిగారిని కలిసి అభినందించాడు. అరుణాచలం ఆనందంతో "రంజిత్ నీకు ఎప్పుడు ఏది కావలసినా నేనున్నాను" అన్నాడు.

"నేను పత్రిపక్షం వాడిని కద" అన్నాడు రంజిత్ నవ్వుతూ.

మంత్రి మొహంలో అలజడి కనిపించింది. అతనికి తెలుసు రంజిత్ ఎంత సిన్సియర్‌గా ప్రచారం చేశాడో. కంగారు అణచుకొని "నువ్వు నా ప్రాణదాతవి రంజిత్" అన్నాడు.

"వస్తాను సార్! ఓ ఫోన్ కాల్ చేస్తే ఏ అవసరమున్నా వస్తాను. ఓ స్టూడెంట్ సీరియస్‌గా ఉన్నాడు. హాస్పిటల్‌కి వెళ్లిచూడాలి. ఓ కోర్టు కేసుకి సాక్ష్యం చెప్పాలి. వస్తాను" అంటూండగానే మినిష్టర్ ఫోన్ మ్రోగింది. బయట పి.ఏలు ఫైల్స్‌తో నించుని ఉన్నారు.

"అలాగే రంజిత్! నువ్వు కూడా నాలాగే చాలా బిజీ" అన్నాడు అరుణాచలం.

"అన్ని కాలేజీల విద్యార్థి నాయకులు నా స్నేహితులు. మీరు ఎప్పుడు ఏ క్షణంలో అవసరమన్నా వస్తాం" అని అన్నాడు రంజిత్. రంజిత్ మాటలు అణకువగా,

నిబ్బరంగా ఎదుటి వారిలో విశ్వాసాన్ని కల్గించేలా ఉంటాయి.

రంజిత్ బయటకి వచ్చాడు. ఆ రోజే అతని అభిమాన హీరో సినిమా రిలీజ య్యింది. స్నేహితులు సినిమా హాలు దగ్గర రంజిత్‌కి టికెట్ కొని ఎదురు చూస్తు న్నారు. సినిమా చూసి రూంకి వచ్చి చల్లని నీళ్లతో మొహం కడుక్కొని టవల్‌తో తుడు చుకొంటూంటే తల్లి గుర్తుకి వచ్చింది. అబద్ధం ఆడిన రోజున తల్లి గుర్తుకు రావడం రంజిత్‌కి మామూలే. ఆవిడకి అబద్ధం ఆడడం చేతకాదు. అందుకే భర్త సోమనాథం అబద్ధం చెప్పినా తెలుసుకోలేక పోయేది. వయసు వస్తున్న కొద్దీ రంజిత్‌కి తండ్రి మాటలలో ఏమాత్రం నిజంలేదని తెలిసేది. ఆ మాట తల్లితో చెప్పాలనుకొని చెప్పలేకపోయేవాడు.

తుడుచుకొన్న ముఖం అద్దంలో చూసు కొంటూంటే తల్లి "హాస్పిటల్ అన్నావు, స్టూడెంట్ సీరియస్ అన్నావు, జడ్జిమెంట్ అన్నావు, ఎందుకు బాబూ ఈ చిన్ని అబ ద్ధాలు" అని నిలేసి అడుగుతున్నట్టనిపిం చింది.

"లేదమ్మా! ఈ మాయా ప్రపంచం నీకు తెలీదమ్మా! ఖాళీగా ఉన్నానంటే విలువ లేదమ్మా! బిజీ, బిజీగా ఉన్నాననే చెప్పాలి. సారీ! అమ్మా నేను నీ దగ్గర పెరిగినంత కాలం పెద్దవాడినైపోయి పేరు తెచ్చుకోమ న్నావేకాని ఎలాగో చెప్పావా! ప్లీజ్ అమ్మా! అద్దంలోంచి వెళ్లిపో" అన్నాడు. ఎవరో తలుపు కొట్టిన చప్పుడై చూస్తే కరెంట్ లేక తలుపు హాండిల్‌తో చప్పుడు చేస్తున్నారను కొని టవల్ హాంగర్‌కి పెట్టి తలుపు తీశాడు.

ఎదురుగా శ్రీనివాస్ తలుపు అవతల నిలబడి ఉన్నాడు. చెప్పలేని దైన్యం అతని మొహంలో ఉట్టిపడుతోంది.

"హాయ్ శ్రీనివాస్ ఏంటిలా వచ్చావు"

"హాయ్... ఈ నెల మెస్ బిల్ ఇంకా కట్టలేదు. రెండు వందలు కావాలి. ఇంకా ఇంటినించి డబ్బు రాలేదు. ప్రస్తుతం నువ్వు సర్దుబాటు చేస్తే రాగానే ఇస్తాను"

రంజిత్ అతడి భుజంమీద వాత్సల్యంగా చేయివేసి "సరే అలాగే! ప్రస్తుతం నా దగ్గర ఉంది ఇస్తాను. డబ్బు రాగానే తిరిగి ఇచ్చెయ్యి. మనలాంటి వాళ్ల అవసరానికి ఉపయోగపడుతుంది. ఇవిగో మూడొం దలు" అని ఇవ్వబోయాడు రంజిత్.

"తప్పకుండా ఇస్తాను. రెండొందలు చాలు" అంటూ రెండొందలు తీసుకొని రంజిత్‌కి థాంక్స్ చెప్పి వెళ్లిపోయాడు శ్రీని వాస్.

అలాంటి పరోపకారి రంజిత్ అనుకో కుండా అన్యాయం చేశాడు ముక్తాకు.



సోషియాలజీ లెక్చరర్ అరుంధతిగారి క్లాసు జరుగుతోంది. ఆవిడ మూడ్ బాగో లేక రెండు లైన్ల పాఠం చెప్పి హెడ్‌ని, మిగతా ఉపాధ్యాయుల్ని స్టూడెంట్స్ దగ్గర హేళనగా మాట్లాడడం మొదలెట్టింది. ఈ సందర్భంలేని ఉపన్యాసాలు వినాలంటే స్టూడెంట్స్‌కు మహా చిరాకుగా ఉంది. కాని ఏం చేస్తారు? అనాసక్తంగా కిక్కురుమన కుండా వింటున్నారు. కొందరి బుర్రలు వేరే

ఆలోచనలతో బిజీగా ఉన్నాయి.

"ఢిల్లీకి నన్ను సెమినార్స్‌కి పంపకుండా వేరే వాళ్లని పంపడానికి ఆ తలకాయలేని హెడ్‌కి ఎంత ధైర్యం? నేనెంతో వర్క్ చేశాను. పేపర్ సెమినార్‌లో చదవడానికి పంపాను. ఆర్గనైజర్స్‌కి డబ్బులేక నాకు డబ్బు ఇవ్వలేమన్నారు. డిపార్టుమెంట్ డబ్బుతో హెడ్ తనకిష్టమైన వాళ్లని పంపుతున్నాడు. ఆ హక్కు హెడ్‌గాడికి ఎవరిచ్చారు?" అని బాధపడుతోందామె ఆ విద్యార్థులముందు.

ఎవరిచ్చారో ఆ పిల్లలకేం తెలుసు? గుప్పెట్లో చిక్కుకొన్న రామచిలుక రెక్కల్లా టపటపా వాళ్ల మనసు కొట్టుకొంటోంది. ఈపాటికి కొంత పోర్షన్ కవర్ చెయ్యవచ్చు కదా ఈ మహాతల్లి అనుకొన్నారు.

ఒకరిద్దరు పాపం ఈవిడకి హెడ్ ఇంత అన్యాయం చేశాడా? ఛీఛీ అతణ్ణి గౌరవించకూడదనుకొన్నారు. మర్నాడు హెడ్ కనిపించినపుడు అతని లెక్చర్ వింటున్నప్పుడు అతని మొహం వాళ్లకి చాలా దుర్మార్గం ఉట్టిపడుతున్నట్టుగా కనిపించింది. నాలుగు రోజులయ్యాక లెక్చరర్‌ని ఏదో పుస్తకం అడగడం కోసం స్టాఫ్ రూంకి వెళ్లిన స్టూడెంట్స్‌కి అరుంధతి, ఇంకో లెక్చరర్, హెడ్ నవ్వుకొంటూ జోక్స్ వేసుకొంటూ కాఫీలు తాగుతూ కనిపించారు.

వాళ్లలో వాళ్లకి ఆశ్చర్యం వేసింది. ఓ రోజు లెక్చరంతా పాడుచేసి తమ టైం వృధా చేసిన అరుంధతమ్మ అదే హెడ్‌తో ఎంత సంతోషంగా కాలం గడిపేస్తోందో అనుకొన్నారు. ఆ రోజు క్లాసులో హెడ్‌ని దుమ్మెత్తి పోసింది. అదే హెడ్‌తో ఇంతటి సఖ్యత ఎలా వచ్చిందో పెరుగుతున్న వాళ్ల బుర్రలకి అంతుపట్టక అయోమయం అనిపించింది. హెడ్ మొహం మళ్లీ చూసినప్పుడు మామూలుగా కనిపించింది. అందరూ కలసి సెమినార్ హాల్‌కి వచ్చారు. లోకల్ డిపార్టుమెంటుకి సంబంధించినదే అయినా చాలా చక్కగా ఎరేంజ్ చేశారని హెడ్‌గారు అరుంధతిని మెచ్చుకొంటే ఆ అవకాశం ఇచ్చిన హెడ్‌గారు ఎంత గొప్పవారో అరుంధతిగారు అర్ధగంటసేపు మైకు వదలకుండా మాట్లాడారు. దీన్ని మనం జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఇంకెప్పుడూ ఈ ఉపాధ్యాయులు ఒకరిమీద ఒకరు చెప్పుకొనే నేరాలు విని రియాక్టు అవకూడదని ఆ లేత బుర్రలు ఒకరికొకరు రోబోట్ సెంటర్‌లో చెప్పుకొంటూ నవ్వుకున్నారు.

★ ★ ★

సాగర్‌కి పి. హెచ్. డి. కి కానీ ఎమ్. ఫిల్ కి కానీ సీటు రాలేదు. చాలా డిప్రెషన్‌లో ఉన్నాడని, రోబోట్ సెంటర్‌లో నిత్యాతో ప్రమోద్ ఏదో మాటల్లో చెప్పాడు.

"నీకు వచ్చిందా సీటు?" నిత్యా ప్రమోద్‌ని అడిగాడు.

సాగర్‌ది, ప్రమోద్‌ది ఒకే సబ్జక్ట్.

"నాకు వచ్చింది. ఫారిన్ వెళదామనుకుంటే వీసా ఇవ్వలేదు. తప్పేదేముందని, ఇక్కడే చేరుదామనుకుంటున్నాను. మళ్ళీ మరోసారి వీసాకి ప్రయత్నిస్తూ, రిసెర్చి చేస్తూ గడపడమే. ఇక్కడ ఉండి రిసెర్చి చెయ్యడం నా ఛాయస్ కాదు. స్టాప్‌గాప్ ఎరేంజిమెంట్. ఈ విషయం దాపరికం లేకుండా ఇంటర్వ్యూలో కమిటీ మెంబర్స్‌కి చెప్పాను"

"సాగర్‌కి ఎందుకు రాలేదు?"

"సాగర్‌కి పేపర్‌మీద అందరికన్నా అర్హతలు ఎక్కువ ఉన్నాయి. యూనివర్సిటీ ఫస్ట్. గోల్డ్ మెడలిస్టు. ముందుగా ఏ ప్రొఫెసర్నీ కలిసి, తన రిసెర్చి గురించి, తన ప్లాన్స్ గురించి చర్చించినట్టులేదు. అన్ని అర్హతలు ఉన్నాయికదా. రాకేం చేస్తుందని అనుకున్నట్టున్నాడు. ఏ ప్రొఫెసర్ అయినా సాగర్ అప్లికేషన్ చూసి సీటులేదని చెప్పడం కష్టం. అప్లికేషన్ చూసి, ఇంటర్వ్యూ చేసి ఇంత బ్రిలియంట్

స్టూడెంట్ మనదగ్గర ఎడ్మిషన్ తీసుకుని, ఇంకెక్కడికో మారిపోవచ్చని, అటువంటి పరిస్థితిలో ఎడ్మిషన్ ఇవ్వడం దండగ అనుకొని ఏ ప్రొఫెసర్ పట్టించుకోకపోవచ్చు అయినా పూర్తి వివరాలు మనకి తెలియవు కదా"

"సాగర్ మరెక్కడైనా ప్రయత్నిస్తున్నాడా? "

"అదే పిటీ. మరెక్కడా అప్లై చెయ్యలేదుట. ఇక్కడ తనకి సీటు గ్యారంటీ అనుకున్నాడట. నార్త్‌లో ఎక్కడో ఎడ్మిషన్స్ స్ట్రైక్‌లతో లేటయి ఎంట్రెన్స్ పరీక్ష లేకుండా డైరక్టుగా, ఇంటర్వ్యూ చేసి తీసుకుంటారంటే అక్కడ ట్రై చేద్దామని టికెట్ కొనుక్కునేందుకు స్టేషన్‌కి వెళ్ళాడు. ఊరికే ఓ సంవత్సరం దండగ చేసేకన్నా నార్త్‌లో సీటు వచ్చినా ఎమ్.ఫిల్. పూర్తి చేస్తానన్నాడు"

"అలాగా బాగానే ఉంటుంది. చదువుకొందుకు ఎక్కడైనా ఒక్కటే. సాగర్ కనిపిస్తే మాట్లాడి వస్తా" అంటూ నిత్యా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

★ ★ ★

సాగర్‌కి రిజర్వేషన్ దొరకలేదు. ఆరోజు బయలుదేరకపోతే అక్కడ ఇంటర్వ్యూ టైంకి చేరుకోలేడు. జనరల్ కంపార్ట్‌మెంట్ అయినా తప్పదనుకొని సామాను సర్దుకొని రైలు ఎక్కాడు. ఓ నాలుగు గంటలు నిలబడి ప్రయాణం చేశాక, కూర్చుందుకి సీటు దొరికింది. కానీ సాగర్ ఏదైనా తాగడానికి, తినడానికి కూడా వెనకాడాడు. తిని తాగితే బాత్‌రూంకి వెళ్ళవలసి వస్తుంది. వెళితే సీటు ఎవరో ఆక్రమించుకుంటారు. అందుకే కదలకుండా కూర్చున్నాడు. ఎట్టకేలకు స్టేషన్ వచ్చింది. ఆ స్టేషన్‌కి ఆరు కిలోమీటర్ల దూరంలో యూనివర్సిటీ క్యాంపస్ ఉంది. సాగర్‌కి "ఆతా హై! జాతా హై" లాంటి మాటలు తప్ప హిందీ రాదు. అసలు హిందీ నేర్చుకోవడానికి అతనెప్పుడూ ప్రయత్నించలేదు.

సూట్‌కేస్, బ్యాగ్ తీసుకుని, బయటకు వచ్చాడు. ఆటోలు తక్కువ. రిక్షాలు ఎక్కువ. రిక్షాలవాళ్ళు సాగర్‌ని చుట్టుముట్టారు.

సాగర్ "యూనివర్సిటీ క్యాంపస్" అన్నాడు.

వాళ్ళలో ఒకడు "బీస్ రూప్‌యా" అన్నాడు.

సాగర్‌కి అర్థంకాక రెండు చేతివేళ్ళు పది రూపాయలుగా చూపించాడు.

'దస్ రూప్‌యా' అంటూనే రిక్షావాడి మనసులో ఈ కుర్రాడికి హిందీ రాదని అర్థమైంది. హిందీ రాని స్టూడెంట్స్ వాళ్ళకి అప్పుడప్పుడు తగులుతుంటారు.

రిక్షావాడు సాగర్ చేతిలో సూట్‌కేస్, బ్యాగ్ తీసుకుని రిక్షాలో పెట్టాడు. రిక్షాముందుకు సాగుతోంది. తనిస్తానన్న పదిరూపాయలకి ఒప్పుకున్నాడన్నమాట అనుకున్నాడు. ఊరంతా పాతగా ఉంది. కొంత దూరం వెళ్ళాక యూనివర్సిటీ మెయిన్‌గేట్ దగ్గర రిక్షా ఆపాడు. సామాను తీసి కింద పెట్టాడు. లోపలికి అని సాగర్ సంజ్ఞ చేశాడు. "అందర్ జానాహైతో ఔర్ దస్ రూప్‌యా" అన్నాడు. గేటు బయటనుంచే ఆ క్యాంపస్ పరిసరాలు అద్భుతంగా కనిపించి, గేటువైపు సామాను తీసుకుని వెళ్ళాడు. గేట్లు మూసేసి ఉన్నాయి. ఇద్దరు సెక్యూటిరీ గార్డులు గేటుదగ్గరగా వచ్చారు. సాగర్ లోపలికి వెళ్ళాలని, ఇంగ్లీషులో చెప్పాడు. సెక్యూరిటీ గార్డుకి కొంత అర్థమై "అందర్ నహీ. స్ట్రైక్" అన్నాడు. మాట్లాడుతున్న గార్డులకి మరో నలుగురు తోడయ్యారు.

"మద్రాసీ హై" అన్నాడు అందులో ఒకడు.

"నో ఆంధ్ర" అన్నాడు సాగర్.

"క్యా ఆంధ్రా? తుమ్ మద్రాసీహై. ఓ బ్యాగ్‌మే క్యా హై" అంటూ నాటుబాంబులున్న సంచి లాక్కున్నట్టు ఫోర్స్‌గా లాక్కొ

న్నాడు.

బ్యాగ్‌లో కాగితాలు, మొహం కడుక్కునే సామాను చెల్లాచెదురుచేసి ఓ చాక్లెట్ ఉంటే నోట్లో వేసుకుని పర్స్ తీసి డబ్బు జేబులో వేసుకుని ఖాళీ పర్స్ చేతి సంచిలో వేసి సాగర్ చేతిలో పెట్టి "క్యా హై, క్యా హోనా? " అన్నాడు.

సాగర్‌కి మతి స్థంభించింది. తేరుకొని "హెల్ప్, హెల్ప్... ప్లీజ్ హెల్ప్" అంటూ కేకలు పెట్టాడు. సాగర్ ఘోష ఆ విశ్వవిద్యాలయ ప్రాంగణంలో అరణ్యరోదనే అయింది.

చుట్టుపక్కలవాళ్ళు అదేదో సెక్యూరిటీ గార్డులు అల్లరివాళ్ళని అదుపులో పెడుతున్నారని అనుకుని సెక్యూరిటీగార్డుల చుట్టూ చేరారు. చూసేవాళ్ళకి, సాగర్ ఏ బాంబో, కత్తో విసిరాడేమోననే అనుమానం వచ్చేలా ఓ సెక్యూరిటీ గార్డు మళ్ళీ సాగర్ దగ్గరకి వచ్చి చొక్కా పట్టుకుని ఏదేదో హిందీలో మాట్లాడాడు. చెయ్యని నేరానికి సాగర్ చెమటలు కక్కుతున్నాడు. సాగర్ ఇంగ్లీషులో చెప్పడానికి ఎంత ప్రయత్నిస్తున్నా, అతని మాట పెదవిదాటి రాకుండానే వాళ్ళల్లో వాళ్ళు గట్టిగా మాట్లాడేసుకుంటున్నారు. గేటులోపల ఇద్దరు తెల్లకోటు వేసుకున్న మెడికల్ డాక్టర్లో మెడికల్ స్టూడెంటో, హాస్పిటల్ అన్న బోర్డువైపు వెళుతూ కనిపించారు. సాగర్ తన శక్తికొద్దీ "డాక్టర్ ప్లీజ్ హెల్ప్‌మి" అని గట్టిగా అరిచాడు. ఆ డాక్టర్లిద్దరూ సాగర్ ఉన్న చోటికి వచ్చారు.

సాగర్‌కి ప్రాణం లేచివచ్చినట్లనిపించింది. సాగర్ జరిగిందంతా చెప్పాడు.

"డబ్బు అంతా ఒకే పర్స్‌లో ఎందుకు పెట్టుకున్నావు? ఇక్కడ స్ట్రైక్ జరుగుతోంది. స్ట్రైక్ సమయంలో ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తారు. అతనే తీసినట్లు రుజువేంటి? అంటారు" అన్నారు.

"అదిగో, అతనే తీశాడు" అన్నాడు ఇంగ్లీషులో.

"ఆ సంగతి నీకు, ఇంకో ముగ్గురికే తెలుసు. వాళ్ళూ వాళ్ళూ ఒకటే. సాక్ష్యం చెప్పరు. బలవంతంగా రుజువు చేస్తే కక్ష కడతారు. మేం మెడికల్ స్టూడెంట్స్‌మి. వీళ్ళందర్నీ పడగొట్టడానికి స్టూడెంట్స్‌లో ఎంత ఐక్యత ఉండాలి. నీకు తెలియనిదేముంది? ఇవన్నీ ఇప్పటిలో తేలవు" అంటూ మెడికల్ స్టూడెంట్స్ ఇంగ్లీషులో, హిందీలో తెగ జాలిపడ్డారు. అక్కడున్న జనం చెల్లాచెదరయ్యారు. సెక్యూరిటీగార్డులు ఎవరి స్థానాలలోకి వాళ్ళు వెళ్ళి కూర్చున్నారు.

మెడికల్ స్టూడెంట్స్ "ఆపరేషన్ కేసులు చూడ్డానికి వెళ్తున్నాము. స్ట్రైక్ చేస్తున్న వాళ్ళు డాక్టర్లని వెళ్ళనివ్వడంలేదు. పేషెంట్స్‌ని చూడ్డానికి స్టూడెంట్స్‌ని పంపిస్తామంటే, మా ఇద్దరినీ పంపడానికి ఒప్పుకున్నారు. అందుకని మేం హాస్పిటల్‌కి వెళ్ళి పేషెంట్స్‌ని చూసి వస్తాం. ఈలోగా, మెయిన్ బిల్డింగ్ అదిగో ఆ పక్కన ఉంది అక్కడికి వెళ్ళి లోపల 'స్టూడెంట్ ఎడ్వయిజర్' అన్న బోర్డు ఉన్న దగ్గరకి వెళ్ళు. అతనితో వివరాలన్నీ చెబితే డబ్బు సహాయం, నీవు ఉండడానికి ఏర్పాట్లు చూడవచ్చు. ఒకవేళ అతనిని కలవడం కుదరకపోతే ఆ బిల్డింగ్ ఎదురుగా ఉన్న పెద్దచెట్టుకింద, సిమెంట్ బెంచీమీద కూర్చుని ఉండు. ఓ గంటలో హాస్పిటల్‌లో పని ముగించుకుని వచ్చి నీకు వీలైన సహాయం చేస్తా"మని చెప్పారు.

సాగర్ సరేనని సామానుతో ముందుకు నడిచాడు.

ఆ స్ట్రైక్ టైంలో అనవసరంగా జోక్యం కలిగించుకున్నా, సెక్యూరిటీ గార్డులతో తల బద్దా వచ్చే అవస్థలు ఆ మెడికోలకి బాగా తెలుసు. అందుకే సాగర్‌కి అన్యాయం జరిగిందని తెలిసినా ప్రతిఘటించలేదు.

యూనివర్సిటీలలో విద్య బోధించేవారు

ఉపాధ్యాయులు. విద్య నేర్చుకునేవారు విద్యార్థులు. విద్యాబోధన సక్రమంగా జరగ డానికి ఇతరత్రా అనేక సంబంధిత పను లలో సహాయపడే ఉద్యోగులున్నారు. ఈ ఉద్యోగులనే బోధనేతర సిబ్బంది అని కూడా అంటారు. ఈ ఉద్యోగులందరూ ఒక సంఘంగా ఏర్పడి అధ్యక్షుడిని ఎన్నుకుం టారు. ఆ అధ్యక్షుడు ఇంకొంతమంది సభ్యు లతో ఒక చిన్న కమిటీగా ఏర్పడి, ఉద్యోగు లందరికీ కష్టనష్టాలలో సహాయపడుతూ అండదండగా ఉంటారు. ఏ ఏ యూనివర్సి టీలలో ఉద్యోగులకి ఎటువంటి సదుపా యాలు ఉన్నాయి? అవన్నీ తాము పనిచే స్తున్నచోట లేకపోతే, యాజమాన్యంతో మాట్లాడి సమకూర్చడమో, మాటలతో సాధ్యంకానపుడు, స్ట్రైక్ చేసి, పోరాడి తమ కోరికలు నెరవేర్చుకోవడమో చేస్తుంటారు. మొత్తంమీద ఉద్యోగులకి ఏ అన్యాయం జరిగినా వెంటనే యాజమాన్యం దృష్టికి తెచ్చి, సమస్య పరిష్కారమయ్యేలా చూస్తారు.

హిమాలయ యూనివర్సిటీలో హిల్ స్టేషన్ ఎలవెన్స్, స్వెట్టర్ ఎలవెన్స్, వర్షాలు ఎక్కువ కాబట్టి గొడుగుల ఎలవెన్స్ ఇస్తున్నారని అవన్నీ ఈ యూనివర్సిటీ ఉద్యోగులకు కూడా ఇవ్వాలని ప్రస్తుతం ఆందోళన జరుగుతోంది.

యూనివర్సిటీ యాజమాన్యం, "ఉద్యోగులకి యూనిఫారం ఇస్తే వేసుకోకుండా మామూలు బట్టలు వేసుకుని యూనిఫారం కిచ్చిన బట్ట అమ్ముకుంటున్నారు. ఆరునెలలకోసారి బాటా షూస్ ఇస్తే షాపువాళ్ళతోనే లాలూచీ పడి హవాయి చెప్పులు వేసుకొస్తున్నారు. మెడికల్ బిల్స్, ఎల్.టి.సి.లు సద్వినియోగం చేసుకోకుండా వంకర పనులు చేస్తున్నారు. మన యూనివర్సిటీ అంత చలి ప్రదేశంకాదు. స్వెట్టర్ల అవసరం లేదు. వర్షాలు తక్కువ. గొడుగులు అవసరమూ తక్కువే. ఇవన్నీ ఒప్పుకుంటే మళ్ళీ అవన్నీ అమ్ముకుంటారు. హిల్ స్టేషన్ కానప్పుడు హిల్ ఎలవెన్స్ ఎలా ఇస్తాం?" అంటున్నారు.

"యూనివర్సిటీ కొండలమీద, పర్వతాల మీద లేకపోవడం మా తప్పుకాదు. కావాలంటే కొండలు, పర్వతాలు కట్టించండి కానీ మాకు ఎలవెన్స్ కావాల్సిందే"నంటారు ఉద్యోగులు.

"ముందో సంవత్సరం పాటు ఇచ్చిన యూనిఫారం వేసుకునేలా చూడండి. షూస్ వేసుకోమనండి. సైకిల్ ఎలవెన్స్, స్కూటర్ ఎలవెన్స్, మెడికల్, ఎల్.టి.సి. అన్నీ సవ్యంగా వాడుకునేట్టు చూడండి. అప్పుడు మాట్లాడుదాం" అంటారు యూనివర్సిటీ యాజమాన్యం. అంతేకాదు ఫ్యాక్టరీలలో పనిచేసే వాళ్ళతో సమానంగా చూడాలంటున్నారు. యూనివర్సిటీలలో వర్క్‌లోడ్ కితేడా ఉంటుంది. ఫ్యాక్టరీలలో పనికాలం ఒకేతీరున ఉండదు. ప్రమాదకరమైన పరికరాలతో పనిచెయ్యవలసి వస్తుంది. ఉత్పత్తి, లాభనష్టాలు ఫ్యాక్టరీలలో స్పష్టంగా తెలుస్తాయి. కాబట్టి బోనస్ ఇస్తారు. మీరు ఫ్యాక్టరీలలో పనిచేసే వాళ్ళ హక్కులు గురించే ఆలోచిస్తున్నారు. బాధ్యతలు, క్రమశిక్షణా గురించి కూడా ఉద్యోగస్థులకి తెలియచెయ్యండని యూనివర్సిటీ యాజమాన్యం లీడర్లకు నచ్చచెబుతోంది. ఈ పరిస్థితులలో ఆ యూనివర్సిటీ తాత్కాలికంగా మూతబడింది. ఏవో యమర్జెన్సీ సర్వీసెస్ నడుస్తున్నాయి. ఏ పూటకాపూటే స్ట్రైక్ అయిపోతుందనుకుంటే పొడిగింపబడుతోంది. ఈ పరిస్థితులలో వచ్చిన సాగర్‌కి బిల్డింగ్ లోపల ఒక్క వ్యక్తీ కనిపించలేదు.

కిలోమీటరు దూరం సామానుతో నడిచి వచ్చిన సాగర్‌కి నిరాశే ఎదురైంది. మెడికోలు వస్తారేమో కొంచెంసేపు చూద్దామని వాళ్ళు చెప్పిన చెట్టుకింద బెంచీమీద కూలబడ్డాడు.

మెడికోలకి అనుకున్న దానికంటే ముందే పని అయిపోయినట్టుంది. ఇంకో వ్యక్తిని కూడా వెంటబెట్టుకుని సాగర్ దగ్గరికి వచ్చారు. ఆ వచ్చిన వ్యక్తిని కర్ణాటక మ్యూజిక్‌లో లెక్చరర్‌గా పరిచయం చేశారు.

రావుగారి నోట "డబ్బంతా పోయిందా?" అనే తియ్యటి తెలుగుమాట వినగానే సాగర్ ప్రాణం స్థిమితపడింది. ఆయన్ని చూడగానే, తను గేటుదగ్గర సెక్యూరిటీ వాళ్ళతో గొడవపడుతున్నప్పుడు, చూస్తూ నిలబడ్డ వాళ్ళలో ఒకరని గుర్తుపట్టాడు. ఈయన ఆ గొడవ చూస్తూ కూడా మాట్లాడలేదనుకున్నాడు.

సాగర్ మొహంమీద ఉట్టిపడుతున్న భావాలన్నీ చదివేస్తూ రావుగారు "ఇక్కడ తెలుగువాళ్ళంటే... అదే మద్రాసీలంటే అసలు విలువలేదయ్యా. ఏం చేస్తాం? స్వదేశంలోనే రెండోతరగతి పౌరులం. డబ్బు పోయినందుకు బాధపడకు. వచ్చిన పని సవ్యంగా జరిగేట్టు చూద్దాం" అన్నారు.

మెడికోలు పనుందని వెళ్ళిపోయారు. సాగర్ థాంక్స్ చెప్పాడు.

రావుగారు "సాగర్ నిన్ను హాస్టల్‌కి తీసుకువెళతాను. అక్కడ నా స్టూడెంట్ నీకు సహాయపడతా"డన్నారు.

"మరి ఈ పరిస్థితులలో ఇంటర్వ్యూలు జరుగుతాయా. నేను ఎమ్. ఫిల్., పి. హెచ్. డి. కి ఇంటర్వ్యూకి వచ్చాను"

"ఆ జరుగుతాయి. మాకీ స్ట్రైక్‌లు మామూలే. మేమే అన్నిపనులూ చూసుకొంటూ, ఎగ్జామ్ సిస్టమ్ సాధ్యమైనంతవరకు మారకుండా చూస్తాం" అని దూరంగా ఉంచిన స్కూటర్ తెచ్చారు రావుగారు.

సామానుతోబాటు సాగర్‌ని హాస్టల్‌కి తీసుకువెళ్లి తన స్టూడెంట్ వర్మకి అప్పగించారు. ఓ నాలుగువందలు తీసి సాగర్‌కి ఇచ్చారు.

"అవసరమైతే ఇంకా తీసుకో వెళ్ళాక పంపుదువుగాని" అన్నారు. సాయంకాలం వరకు పనులు చూసుకొని సాగర్‌ని తనింటికి తీసుకురమ్మని వర్మకి చెప్పారు.

సాగర్ "థాంక్స్" చెప్పి సాయంకాలం ఇంటి దగ్గర కలుస్తానన్నాడు. వర్మ తన లాగే, ఎడ్మిషన్‌కి ప్రయత్నిస్తున్న ఇద్దరు స్టూడెంట్స్‌ని పరిచయం చేశాడు. వర్మ సాయంకాలం వస్తాను రెస్టు తీసుకోమని సాగర్‌కి చెప్పి వెళ్ళిపోయాడు.

సాయంకాలం వర్మ వచ్చి సాగర్‌ని, రావుగారింటి దగ్గర దింపి, లైబ్రరీలో పనుందని వెళ్ళాడు. రావుగారు సాగర్ వివరాలన్నీ తెలుసుకొని, "ఇన్ని మంచి విద్యార్హతలున్న నీకు మీ స్టేట్‌లో సీటెందుకు రాలేద"ని అడిగాడు.

"కారణం తెలీద"న్నాడు సాగర్.

"ఇక్కడ ఎడ్మిషన్స్‌లో తేడా ఉంది. ముందునించీ ఇక్కడే చదివిన విద్యార్థులకి మార్కుల పట్టిక తయారుచేశాక ఇరవైఐదు మార్కులు కలుపుతారు. ఎలాగంటే నువ్వు ఎమ్. ఫిల్ పి. హెచ్. డికి అప్లికేషన్ పెట్టేవు కదా! నీ పాత రికార్డుకి యాభై మార్కులు, ఇప్పుడు రాసిన ఎంట్రన్స్ పరీక్షకి ఇరవైఐదు మార్కులు, ఇంటర్వ్యూకి ఇరవైఐదు మార్కులు...మొత్తం నూరు మార్కులకి ఎనభైమార్కులు నీకు వచ్చాయనుకో. ఇక్కడే చదివిన విద్యార్థులకి డెబ్బయ్యయిదు వచ్చినా అదనంగా ఇరవై అయిదు మార్కులు కలిసి నూరు మార్కుల జాబితాలోకి చేరిపోతారు.

"ఈ ఏడాది కొన్ని సమస్యల మూలంగా ఎంట్రన్స్ పరీక్ష పెట్టలేదు. పాత రికార్డుకి ఏభై మార్కులు, ఇంటర్వ్యూకి ఏభైమార్కులు, మొత్తం నూరు మార్కులకి పట్టిక తయారుచేస్తారు. నీకు ఇక్కడ సీటు రావడం కష్టమే" అన్నారు.

"ఎందుకు సర్! నన్ను నిరుత్సాహపరుస్తున్నారు?"

"నిరుత్సాహపరచడం కాదు. నా అనుభవంతో జరగబోయేది చెబుతున్నాను. స్ట్రైక్

చేసేవారు అనేదేమంటే "ఇక్కడే చదువంతా చదివి తీరా రీసెర్చి టైమ్‌కి ఎక్కడికి ఎలా పోవాలి? మీరు చెప్పిన చదువులతో మేం ఈ అర్హతలు సంపాదించుకున్నాం. మీరు చదువు చెప్పి శిక్షణ ఇచ్చిన విద్యార్థులకి మీరే సీటు ఇవ్వకపోతే వేరేవాళ్లు ఎందుకు ఇవ్వాలి?" అనే ఓ సూటి ప్రశ్న వేస్తున్నారు"

"ఇది అన్యాయం సార్! దేశమంతా చదువుకు ఒకే రూలు ఉండాలి"

"అన్యాయం ఎవరికి?"

"వేరే యూనివర్శిటీలో చదివినవారికి"

"అవును. బయటనించి వచ్చిన వాళ్లని వేరు చేసి చూసే ఎకడమీషియన్సు, కుర్చీ కాపాడుకునే అధికారులు ఉన్నంతకాలం యూనివర్శిటీలు పట్టాలు ఇవ్వగలవేమో. కానీ ఆ పట్టా విలువని తామే పరిమితం చేస్తున్నామని ఆలోచించలేకపోతున్నారు.

"ఈనాడు ఎంతమంది ఫలానా వ్యక్తి నా గురువు, ఫలానా వ్యక్తి నా శిష్యుడు అని చిరకాలం గుర్తుంచుకోగలుగుతున్నారు? గురువు డబ్బు తీసుకుని పాఠం చెబుతున్నాడు. ఫీజు కడుతున్నాం, డిగ్రీ వస్తోంది. ఇదీ ఈనాటి విద్యార్థి దృక్పథం.

"నేనో విద్యావేత్తని. విద్యార్థి విద్యని ఓ దీక్షగా చూసుకోవాలి. నేను కష్టపడి శిష్యుణ్ణి నన్ను మించినవానిగా తీర్చిదిద్దుతాను, అనే గురువు మీదకి ఎదురు తిరిగే శిష్యులున్నంతకాలం మెరిట్ మంట గలుస్తుంది.

"ఎంత సులువుగా పట్టు దొరికితే అంత సులువుగా బయటపడ వచ్చుననే ధోరణి యువతలో ఉన్నంతకాలం విద్యకు విలువేముంది?" అన్నారు రావుగారు.

సాగర్‌లో నిరుత్సాహపు నీడలు కమ్మాయి. ఇక్కడ కూడా సీటు దొరుకుతుందన్న నమ్మకం లేదనుకొన్నాడు.

బయటి ఊరినుండి వచ్చినవాడు సాగర్ కాక మరో ఇద్దరున్నారు. మర్నాడు రిజల్ట్సు పెట్టారు. బయటనించి వచ్చిన వాళ్ళెవ్వరికీ సీటు రాలేదు. రావుగారిని కలిసి వెళ్ళగానే డబ్బు పంపుతానని కృతజ్ఞతలు చెప్పి సెలవు తీసుకొన్నాడు. వర్మ స్టేషన్‌వరకు వచ్చి రిజర్వేషన్ లేకపోతే కండక్టర్ చుట్టూ తిరిగి ఓ ఏభై రూపాయలు లంచం ఇచ్చి టికెట్‌మీద బెర్త్‌నెంబర్ రాయించి టికెట్ సాగర్ చేతిలో పెట్టాడు.

సాగర్ ట్రైన్‌లోంచి వర్మని సాగనంపుతూ కృతజ్ఞతలు చెప్పి ట్రైన్ కదులుతూండగా తన సీటు దగ్గరకి వచ్చేసరికి, ఓ మిలటరీ జవాను, భార్య, ఇద్దరు పిల్లలు సాగర్ సీట్లో కూర్చొని ఉన్నారు. సాగర్ వాళ్ళ టికెట్ నెంబర్ ఎంతని ఇంగ్లీషులో అడిగాడు. మిలటరీ జవాను వినిపించుకోలేదు.

సాగర్ నా నెంబర్ ఇది అని టికెట్ తీసి చూపించాడు. మిలటరీ జవాను టికెట్ చూసి తలవంచుకొన్నాడు. కండక్టర్ వచ్చాడు. సాగర్ కండక్టర్‌కి ఫిర్యాదు చేశాడు. కండక్టర్ హిందీలో "లేవయ్యా! ఈ సీటు ఇతనిది. నీకు రిజర్వేషన్ లేదు. మిలటరీ కోటా ప్రయాణాలన్నీ పూర్తి చేసేసినట్టున్నావు" అన్నాడు.

మిలటరీ జవాను మాట్లాడలేదు. కండక్టర్ ముందుకు సాగిపోయాడు.

మిలటరీ జవానుకి మౌనంలో ఉన్న క్రమశిక్షణకి జోహారు అనుకొన్నాడు సాగర్.

రెండు మూడుసార్లు కండక్టర్ అటు ఇటు తిరగడం చూసి మళ్ళీ సాగర్ కండక్టర్‌ని ఆపి ఈ జవాను సంగతి తేల్చుమని అడిగాడు.

కండక్టర్ "ఏంటయ్యా నేచేసేది? రిజర్వేషన్ నీకు ఉంది. నువ్వే లెమ్మను. రిజర్వేషన్ ఉండి, ఎవరైనా రిజర్వేషన్ కావాలంటే డబ్బు తీసుకొని టికెట్‌మీద నెంబర్ వేసి ఇవ్వటంవరకే మా బాధ్యత.

రండమ్మా! రా బాబూ! అంటూ కూర్చోపె ట్టాలనీ, కూర్చున్న వాళ్ళని లేవదియ్యాలనీ నాకెవడూ ఉద్యోగ బాధ్యతగా చెప్పలేదు" అంటూ బడబడా హిందీలో వాగాడు.

బిక్కచచ్చిపోయిన సాగర్ మొహంలో చేతకాని కోపం, తీవ్రత స్పష్టంగా కనబడు తోంది. తను డబ్బిచ్చి రిజర్వేషన్ చేయిం చుకొన్నాడు. దేశాన్ని కాపాడవలసిన జవాను. బాధ్యత గల పౌరుడు. సాటి పౌరుడి హక్కుని కాపాడలేకపోతున్నాడు. రిజర్వేషన్ డబ్బు కట్టక్కరలేకుండానే భార్యా పిల్లలతో సీటు ఆక్రమించుకొన్నాడు. ఆ మిలటరీ డ్రెస్ మార్చుకొని మామూలు బట్టలతో ఉన్నా బాగుండేది. అమ్మయ్య అదృష్టవంతుడు, మూగవాడేమోనని ఇత రులు అనుమానపడకుండా ఒళ్ళో కూర్చున్న కొడుకుతో ఏదో మాట్లాడుతున్నాడు అనుకొ న్నాడు సాగర్.

సాగర్‌కి ఎదురుసీటులో సాగర్ వయసు వాడైన ఓ వ్యక్తి కూర్చొని ఉన్నాడు. సాగర్ అవస్థ చూసి తన పక్కన కూర్చోమని చోటు ఇచ్చాడు. పరిచయ వాక్యాలతో ఆ వ్యక్తీ స్టూడెంటేనని సాగర్ తెలుసుకొన్నాడు. విద్యార్థులకి సహజమైన వివరాలు ఒకరినొకరు తెలుసుకోవడంలో ఇద్దరికీ స్నేహం కలిసి క్షణాల్లో మాటల్లో మైమరచిపోయారు. ఆ విద్యార్థి కేదార్‌గు ప్తాదీ సాగర్ సబ్జెక్టే.

"మీ యూనివర్సిటీకే వస్తున్నా"నని చెప్పాడు. ఇద్దరి మధ్య సంభాషణ పెరి గింది. సాగర్ తనకెక్కడా సీటు రాలేద న్నాడు.

"నాకీ యూనివర్సిటీలో సీటు వచ్చింది. నేను పొద్దున్న జరిగిన ఇంటర్వ్యూలో ఉన్నాను. మీరు మధ్యాహ్నం వచ్చి ఉంటారు. అందుకే కలుసుకోలేకపోయాం" అన్నాడతను.

"మరి ఈ యూనివర్సిటీలో చేరకుండా మా యూనివర్సిటీకి ఎందుకు వస్తు న్నారు? " అన్నాడు సాగర్ ఆశ్చర్యంగా.

"మీ యూనివర్సిటీ డిపార్టుమెంటుకు ప్రత్యేక నిధి ఉంది. ఎమ్-ఫిల్,పి. హెచ్. డి, సీట్లు ఇరవైశాతం బయటనించి వచ్చినవా ళ్ళకే ఇవ్వాలనే రూలుంది. అంటే ఓ పది సీట్లుంటే, రెండు సీట్లు బయట వాళ్ళకి ఇవ్వాలి. బయటవాళ్ళు రావడానికి ఆకర్ష ణగా స్కాలర్‌షిప్ కూడా ఇస్తారు. అందు కని మీ యూనివర్సిటీలో చేరదామనుకొం టున్నాను" అన్నాడతను. ఇద్దరూ కాసేపు యూనివర్సిటీలు, విద్యావిధానం గురించి చర్చించుకొన్నారు. గుప్తా మేగజైన్ తీశాడు.

ప్రశాంతత లేని సాగర్ మనసు అల్లకల్లో లంగా ఉంది. ఎవరు పెట్టారీ రూల్సు. అందరూ చదివి పరీక్షలు రాసి సమాన మైన అర్హతతో సీటు ఎందుకు సంపాదించు కోలేకపోతున్నారు? ఈ యూనివర్సిటీలో అక్కడే చదివినవాళ్ళకి లాభం. తన యూనివర్సిటీలో బయటనించి వచ్చినవా ళ్ళకి మరింత ఎంకరేజిమెంట్. అన్ని యూనివర్సిటీలలో రూల్సు ఒకేలా ఎందు కుండవు? తను యూనివర్సిటీలో మేధా వులు బయటవాళ్ళని ఆకర్షించేందుకు సీటు ఇవ్వడమేకాక స్కాలర్‌షిప్ కూడా మంజూరు చేయించారు. ఆ రూలు ఈ యూలో ఉన్నా, ఈ రూలు ఆ యూలో ఉన్నా తన రేఖ మరోవిధంగా ఉండేది. ఓ క్షణం గుప్తా అంటే సాగర్ అసూయపడ కుండా ఉండలేకపోయాడు.

గుప్తా ఏం చేస్తాడు. ఈ రూల్స్ గుప్తా పెట్టలేదే!

సాగర్‌కి తలనొప్పిగా ఉండి కణతలు నొక్కుకొంటుంటే, గుప్తా తన దగ్గరున్న టైగ ర్‌బామ్ తీసిచ్చాడు. గుప్తా సాగర్ ముఖక వళికలు గమనిస్తూ, "సారీ బ్రదర్ నీకు సీటు రానందుకు" అన్నాడు కాసేపాగి.

మళ్లీ గుప్తానే "అధికారులు, మేధావులు, విద్యావేత్తలు కూర్చొని గంటలు గంటలు ఆలోచించి రూల్సు తయారుచేస్తారు.

వాటిలో అవకతవకలు జాగ్రత్తగా గమనించకపోవడంతో మనలాంటి వాళ్ళం నష్టపోతుంటాం" అన్నాడు.

సాగర్ "సీటు రానందుకు తలనెప్పి రాలేదు. బడలిక అంతే" అన్నాడు టైగర్‌బామ్ తిరిగిస్తూ.

స్టేషన్‌లో రైలాగింది. మిలటరీ జవాను, భార్య, పిల్లలు దిగిపోయారు. సాగర్ తన సీటులో తను కూర్చున్నాడు. సైడు సీట్లో ఓ ఆసామి టేప్‌రికార్డరు సన్నంగా పెట్టుకొన్నాడు. "గంగ వెల్లువై ప్రవాహమైతే కమండలంలో ఇమిడేనా!"అనే పాట వినిపిస్తోంది. ప్రపంచానికెందుకు బాధ, ఓ వాక్‌మెన్ పెట్టుకోవచ్చుకదా! అనుకొన్నాడు సాగర్.

టేప్‌రికార్డరు ఆఫ్‌చేసి ఆ ఆసామి సాగర్ కూర్చున్నవైపు పై బెర్త్‌మీద పడుకొన్న వ్యక్తితో ఇంగ్లీషులో మాటలు ప్రారంభించాడు. మార్కెట్ విషయాలు, రాజకీయాలు, బంధువుల గురించి మాట్లాడుతుంటే ఆ మాటల్లో తెలుగు పాట ఆసామీ రాజమండ్రివాడని తెలిసింది. ఇంగ్లీషు తెలుగులా మాట్లాడుతున్నాడు.

ట్రైన్ స్టేషన్‌లో ఆగింది. బెర్త్‌మీద పడుకొన్నాయన కిందకి దిగాడు. అతనికోసం ఇంకొకాయన క్యారియర్, పళ్ళు, ఏవో సామానులున్న బుట్ట పట్టుకొచ్చాడు. ఇద్దరూ ఆ సామానుతో సీటు దగ్గరకి వచ్చారు.

"ఆ! సో! ఎలా ఉన్నావ్ బ్రదర్? మామ్ ఎండ్ డాడ్ ఎలా ఉన్నారు?" ఇంకా తర్వాత ఇద్దరి మధ్య సంభాషణ అంతర్జాతీయ భాషలోనే జరిగింది.

క్యారియర్ విప్పేడతను. మొత్తం వంటలన్నీ అతి ఆప్యాయంగా తిన్నాడు. నాకిష్టమైన కాకరకాయ పులుసు, కొత్త ఆవకాయ, పెరుగువడ, అమ్మ చాలా కష్టపడుంటుంది. కాని చాలా రుచిగా ఉన్నాయని చెప్పు. తను ఎక్కడికి ఎందుకు వెళ్తున్నాడో మళ్లీ ఎప్పుడు వెనక్కి వచ్చి తను పల్లెటూరులో ఎన్నాళ్లు గడుపుతాడో, అన్నీ ఇంగ్లీషులోనే మాట్లాడుతూ, క్యూరియాసిటీ ఉన్న చుట్టుపక్కల ప్రయాణీకులకి ఇబ్బంది తగ్గించాడు. రైలు కాజీపేట చేరుకోవడంతో ఇంగ్లీషు బ్రదర్స్ ఇద్దరూ కిందకి దిగారు.

ఎదురుసీట్లో కూర్చొన్న బెంగాలీబాబు, ఇంగ్లీషు బ్రదర్స్ దిగగానే ఉండబట్టలేక రాజమండ్రి తెలుగాయనతో అన్నాడు. "ఆ బెర్త్‌మీద పడుకొని ఇప్పుడు భోజనం చేసిన వ్యక్తి, మీకు పరిచయస్థుడిలా కనబడుతున్నాడు. మీరు శ్రమపడి ఇంగ్లీషులో మాట్లాడారు. కాని మాటలని బట్టి ఆయనా తెలుగువాడేనని తెలుస్తోంది. భోజనం తెచ్చిన తను తమ్ముడిలా ఉన్నాడు. అమ్మ చేతివంటని ఇంగ్లీషులో తెగమెచ్చుకొన్నాడు. మీవాళ్ళు అన్నదమ్ములు కలుసుకొన్నా మాతృభాషలో మాట్లాడుకోరా?" అనడిగాడు.

రాజమండ్రి ఆసామి మొహం కురిడీచిప్పలా అయింది.

మళ్ళీ బెంగాలీబాబే "నేను విశాఖపట్నం స్టీలు ప్లాంట్‌లో పనిచేస్తున్నాను. తెలుగు భాష నేర్చుకొన్నాను. అక్కడా అంతే! శ్రమపడి ఇంగ్లీషులో మాట్లాడుతారు. నేను తెలుగులో మాట్లాడినా, వాళ్ళు ఇంగ్లీషులోనే సమాధానమిస్తారు. ఏమి భాషాదాస్యమండీ మీ తెలుగువాళ్ళకి" అన్నాడు.

"లేదు మాష్టారూ లేదు. అందరూ ఇలాగే ఉండరు. మాలో కొంతమంది మధ్యతరగతివాళ్ళు ఇలాంటి భేషజాలు వంటపట్టించుకొని, ఇంగ్లీషు మాట్లాడటమే నాగరికత అని ఫీలవుతూ, మాతృభాషని కించపరిచే జాతినొకదాన్ని తయారుచేస్తున్నారు. అలా చేస్తున్నామని కూడా తెలుసుకోలేని అనాగరికులు. మాలోనూ ఆత్మీయులు, బంధువులు, అయినవాళ్ళు కలిసినప్పుడు మా భాషే మాట్లాడుకొంటాం"

"మంచిమాట విన్నాను. మన జాతిని, మన భాషను మనవాళ్ళని మనమే గౌర

వించకపోతే వేరేవాళ్ళు గౌరవించడం జరగదు. నేను మా బెంగాలీవాళ్ళకైనా ఇదే చెబుతాను" అన్నాడాయన.

ట్రైన్ తమ గమ్యం చేరుకొంటోందని గుప్తా, సాగర్ సామాను సర్దుకొన్నారు. ట్రైన్ ఆగాక యూనివర్సిటీ క్యాంపస్‌కి ఇద్దరు కలిసే చేరుకొన్నారు.

సాగర్ ఈ సంవత్సరం వృధా అయిందనుకొని మళ్ళీ సంవత్సరానికైనా యూనివర్సిటీని అంటిపెట్టుకొని ఉండి, సీటుకోసం ప్రయత్నిద్దామనుకొన్నాడు. యూనివర్సిటీతో ఏవిధమైన సంబంధం లేకుండా ఎవరి రూంలోనో రూల్సుకి వ్యతిరేకంగా ఉంటూ గడపడం సాగర్‌లాంటివాళ్లు చేయలేరు. అందుకే అప్పుడే మొదలుపెట్టిన చైనీస్ డిప్లమా కోర్సుకి అప్లికేషన్ పెట్టాడు. తగినన్ని అప్లికేషన్స్ లేకపోవడంతో సాగర్‌కి చైనీస్ డిప్లమా కోర్సులో సీటు వచ్చింది. కొంతకాలం యూనివర్సిటీలో ఉండే అవకాశం వచ్చింది. డిప్లమా కోర్సు చేస్తూ వచ్చే సంవత్సరం తనుకొన్న కోర్సుకి ముందుగానే ప్రిపేరవ్వాలనుకొన్నాడు.



కోలా అమెరికాకి తన స్టూడెంట్ అతుల్ పాండేకి బదులు తనే వచ్చి పేపర్ చదివితే ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందని ఇ.మెయిల్ ఇచ్చాడు. వాళ్ళు ఆ వర్క్ చాలా ఆసక్తికరంగా ఉందని, స్టూడెంట్‌తో పాటు కోలా కూడా రావచ్చని ఆహ్వానిస్తూ ప్రయాణఖర్చులు, వసతి కూడా ఏర్పాటుచేస్తామని చెప్పారు.

కోలా అమెరికా ప్రయాణంలో ఉన్నాడు. అతుల్ కోపం కొంత చల్లారింది. అతుల్ చేత దగ్గరుండి సెమినార్‌కి పంపిన పేపర్‌కి సంబంధించిన ముఖ్యమైన ఎక్స్పర్‌మెంట్స్ చేయిస్తున్నాడు.

అతుల్‌కి విసుగ్గా ఉంటోంది. థీసిస్ పూర్తయినా ఈ కాన్ఫరెన్స్ గోలతో ఈ పని మళ్లీమళ్లీ చెయ్యాల్సి వస్తోందని. థీసిస్‌లో రాసినప్పుడు వచ్చిన రిజల్ట్సు మళ్లీ రావడం లేదు. ఏదో కాన్ఫరెన్స్ వంకన ఓసారి అమెరికా వెళదామనుకున్నాడు. అసలు ఈ రిసెర్చి లైన్ కంటిన్యూ చేసే ఉద్దేశ్యంలేదు. ఎడ్మినిస్ట్రేటివ్ జాబ్‌లో చేరే ఉద్దేశ్యంలో ఉన్నాడు.

ముక్త కోలా కాన్ఫరెన్స్‌కి వెళ్లినా ఓ పదిహేను రోజులలో వచ్చేస్తాడనే వార్త వింది. తను మొదలు పెట్టవలసిన పరిశోధనాంశం గురించి కోలాతో మాట్లాడదామని మూడుసార్లు వెళ్లింది.

మూడుసార్లు కూడా బిజీ అన్నాడు.

ఇప్పుడు బిజీ తర్వాత ఇలా ఎన్నిసార్లు తిప్పించుకొంటాడో అనుకొంది ముక్త.

విసిగిపోయిన ముక్త ఏమైనా సరే ఈ రోజు కోలాని కలుసుకు తీరాలని గట్టి నిర్ణయం తీసుకొంది. పొద్దున్నే కోలా ఆఫీసుకొచ్చే టైంకి అతని ఆఫీసులోనే ఉండి, కోలా రాగానే విష్‌చేసి పేపర్లు ఇచ్చింది. కోలా "టేబుల్ మీద పెట్టి నువ్వెళ్లి పని చూసుకో. తర్వాత చూస్తాన"న్నాడు. మూడు రోజులైంది. ఆ కాగితాలు అలాగే ఉన్నాయి. లైబ్రరీలో కూర్చొని చదువుకుంటూ ఎంతకాలం గడపడం? ఓ ప్రాబ్లమ్ తీసుకొని పని మొదలుపెడితే



కొంత ఉత్సాహం వస్తుందనుకొని సాయం కాలం కోలా ఆఫీసుకి వెళ్లింది.

"సార్ నా పేపర్లు చూశారా? ఆ రకంగా పని చేయాలనుకొంటున్నాను. పని మొదలుపెట్టమన్నారా? "

"నీ పరిశోధనా ప్రణాళిక తప్పుల తడక. అలా చేస్తే ఏమీ ఉపయోగముండదు"

"మరి మార్పులేమైనా సజెస్ట్ చెయ్యండి సార్"

"నీలాంటి వాళ్లకి వేరే ఎవరి సలహాలు అక్కరలేదనుకొంటా! లైబ్రరీకి వెళ్లి చదువుతున్నావుకదా! ఇంకో నాలుగు అంశాలు ఎలా పని మొదలుపెట్టి పూర్తి చెయ్యాలనుకొంటున్నావో రాసి తీసుకురా ఆలోచిద్దాం"

"నాలుగు అంశాలు ప్లాన్ చెయ్యడమంటే నాలాంటి వాళ్లకి అంటే స్టూడెంట్స్‌కి అంత సులువైన పని కాదు సార్"

"పరిశోధనంటే మరేమిటి? బీరకాయ కూర చెయ్యడమా? "

ఈ వ్యంగ్య సంభాషణ ముక్తకి బాధ కల్గించింది.

"లేదు సార్. ఇప్పటికే నెల రోజులు టైం

దండగైంది. పరిశోధనా ప్రణాళికలో మార్పులు చెయ్యమంటే చేస్తాను. పని మొదలు పెడతాను"

"చెప్పిన పని చెయ్యలేని దానివి కొత్త పనేం చెయ్యగలవు? "

ముక్త అతనితో సంభాషణ వక్రమార్గం పట్టేటట్టుందని బయటకి వచ్చేసింది.

ఆ రోజు భోజనం చెయ్యలేదు. చందన, సరోజలతో మాటల్లో "పని మొదలు కాలేదు. నేను చేయదలచుకొన్న పని సూప ర్వైజర్ ఆమోదం లేకుండా ఎలా? నేను తీసుకెళ్లి ఇచ్చిన పరిశోధనాంశంలో లోపాలు ఉండవని అనడంలేదు. లోపా లుంటే చర్చించి సరైన విధానం సూచిస్తే ఆ ప్రకారం చేస్తాను కదా! మీకు తెలియదు ఈ అంతర్యుద్ధం. కోలాకి, నాకే అర్థమవు తుంది. నేను పైవాళ్లకి ఎంత చెప్పినా అర్థం చేసుకోవడం కష్టం" అంది.

నిత్యాతో చెప్పబోతే "నువ్వు కావాలని కోలా దగ్గర చేరావు. రంజిత్ మాట విన కుండా ఉండాల్సింద"ంటాడు. జరిగిన దాని గురించి చర్చిస్తాడే తప్ప వర్తమానం ఏమిటి? భవిష్యత్తు ఏమిటి? అన్నదానికి అతని దగ్గర సమాధానాలు లేవు. తన గురించి అంతగా ఆలోచించాల్సిన అవసరం అతనికేముంది?

ఇంక వార్డెన్ వరదరాజేశ్వరి. ప్రపంచా నికి ఆవిడో స్త్రీ విమోచనా సంఘ సభ్యు రాలు. ఆడవాళ్లకి ఎక్కడ ఏ అన్యాయం జరిగినా సహించదు. కాని తన సమస్య విని ఓ పది నిమిషాలు ఆలోచించి సలహా చెప్పే ఓర్పులేదు. వార్డెన్ వరద తన పాలిట వరదనీరే అయింది.

నా సూపర్వైజరే నా హెడ్. కావాలని వేదవతి దగ్గరనుండి మార్పించుకొన్నాను. ఏ మొహం పెట్టుకొని ఎవరికి కంప్లయింట్ ఇవ్వగలను? ప్రఖ్యాత శాస్త్రవేత్త దగ్గర పని చెయ్యాలని కలలు కన్నాను. నచ్చిన పరిశో ధన చెయ్యవచ్చుననుకొంటే పని చెయ్యడా నికి అడుగడుగునా అడ్డంకులెదురవుతు న్నాయి.

తల్లితండ్రులతో చెబుదామంటే ఇన్ని చిక్కులతో నువ్వా పరిశోధన చెయ్యనక్కర లేదు. వెంటనే రమ్మంటారు.

మైగాడ్! నన్నెందుకు భూమిమీదకు తెచ్చేడో ఈ దేముడు!" అనుకుంది ముక్త.

చందన, సరోజ, ముక్త బెడ్ పక్కనే కూర్చొని ఉన్నారు. ముక్త కళ్లు మూసు కొంది. సరోజ, చందన మాటల్లో పడ్డారు.

"ముక్త సమస్య జటిలమవుతోంది. మనం ఊరుకొని లాభంలేదు. వార్డెన్ వర దకి మళ్లీ చెబుదాం" అంది చందన.

"ఓసారి చెప్పడమైంది కదా!" అంది సరోజ.

"అప్పుడో చిన్న విషయంగా తీసిపారేసిం దికదా"

"సరే జరిగినదంతా మరచిపోతాను. ఓ చిన్న విషయంగానే తీసిపారేస్తాను. పని మొదలుపెట్టనివ్వడంలేదు. అతనితో మాట్లాడడానికి వెళ్లినప్పుడల్లా సింహం గుహలోకి అడుగు పెట్టినట్టు వెళ్లాల్సి వస్తే ఎలా? " అంది ముక్త.

"మనం వరదరాజేశ్వరి హాస్టల్ రౌండ్స్ తిరుగుతున్నప్పుడు అడ్డంపడి మాట్లాడటం కాదు. ఇంటికి వెళ్లి విశదంగా నాలుగు సంగతులూ చెప్పి ఏం చెయ్యమంటుందో సలహా తీసుకొందాం" అంది సరోజ.

సాయంకాలం నాలుగు గంటలకి వరద రాజేశ్వరి ఇంటి అడ్రసు తెలుసుకొని ముగ్గురూ కలసి ఇంటికి వెళ్లారు.

ఇంటిముందు బోర్డులేదు. ఇంటికో పెద్ద తాళంకప్ప వేళ్లాడుతోంది. పక్క ఇంటికి వెళ్లి వరదరాజేశ్వరి ఇల్లు అదేనని నిర్ధారిం చుకొని ఇంటిముందు మెట్లమీద కొంచెం సేపు నిరీక్షిద్దామని ముగ్గురూ కూర్చు న్నారు.

చుట్టుపక్కలంతా పరమ ఛెత్తగా ఉంది. వరద రచయిత్రిగా తన రచనలన్నిటిలోనూ

ఇంటిచుట్టూ అందమైన తోట, లాన్స్, లాన్స్ చుట్టూ రంగురంగుల గులాబులు, వెనక అన్ని జాతుల పళ్లచెట్లు కళ్లకి కట్టినట్టు అద్భుతమైన పెయింటింగ్‌లా ఉందని పరిసరాలని వర్ణిస్తుంది.

ఇక్కడ ఇంటి చుట్టూ ఎంతో ఖాళీ స్థలం ఉన్నా ఆవిడ రచనలలో వర్ణనకి వ్యతిరేకంగా పరిసరాలున్నాయి.

ఇంటి ముందుపక్క తాగిపడేసిన కొబ్బరి బొండాలగుట్ట, రంగురంగుల గులాబీలకి బదులు రంగురంగుల ప్లాస్టిక్ కవర్లు ఇంటి చుట్టూ గాలి వచ్చినప్పుడల్లా నాట్యం చేస్తున్నాయి. అడవిలా పెరిగిన పిచ్చిమొక్కలు, ఖాళీ బీరుసీసాలు, ఈగలు, చీమలు మొత్తంమీద అశుభ్రానికి ప్రతీకలా ఉంది ఆ ఇంటి ముందు స్వరూపం అనుకున్నారు ఆ ముగ్గురూ.

“మొన్న ఆదివారం టీవీలో గర్ల్ ఛైల్డ్, ఛైల్డ్ లేబర్ మీద మేడమ్ వరదగారి ఇంటర్వ్యూ జరిగింది చూశావా? అదరగొట్టేశారు” అంది సరోజ.

“ఆవిడ ఇంటర్వ్యూ సంగతి నాకు తెలీదు. ఆ టైంలో ఏం చేస్తున్నానో” అంది ముక్త.

“ఆడపిల్లలంటే ఆవిడకెంత జాలో! ఈనాడు ఆడపిల్ల ప్రతి చిన్న విషయానికి నిర్దయగా తప్పులేకపోయినా హింసకి గురవుతోందని ఆడపిల్లని మగపిల్లవాడితో సమానంగా చూడగలిగిననాడే మానవ జాతికి నిష్కృతనీ నాగరిక సమాజంగా గుర్తింపబడాలంటే స్త్రీ విలువ స్త్రీకి ఇవ్వాలనీ చివరికి ఓ అమ్మాయి సభ్య సమాజంలో పడిన ఆవేదన చెబుతూ కళ్లనీళ్లు తెచ్చుకొన్నారు”

“ఆవిడ వ్యక్తిత్వం చాలా ఉన్నతమైంది. స్త్రీజాతి గర్వింపదగ్గది. నా సంగతి అసలు వినిపించుకొంటుందా? ”

“అ తప్పకుండా. ఆవిడ రౌండ్స్‌కి వచ్చినపుడు యథాలాపంగా చెప్పేవు. అనుకొని ఉండవచ్చు. అసలు ఆవిడ బుర్రలో అప్పుడేముందో ఏ కథ థీమ్ గురించి ఆలోచిస్తోందో ఏమైనా నా ఉద్దేశ్యంలో స్త్రీజాతికి జరిగే అన్యాయాలని ఖండించే వ్యక్తే” అంది సరోజ.

సరోజకి వరదంటే కొంత ఆరాధన. ఆవిడని ఎప్పుడూ మెచ్చుకొంటూంటుంది.

“సరే నీ మాట వినేకద హాస్టల్ కాకుండా ఇంటివరకు వెతుక్కుంటూ వచ్చేం” అంది ముక్త.

ముక్త మాట పూర్తి కాకుండానే ఇంటి ముందు కారాగింది. వరదరాజేశ్వరి కిందికి దిగింది. ఆవిడతోపాటు ఓ నడివయస్కుడు చూడగానే ఆకర్షించే కళ్లున్నవాడు. సిల్కు చొక్కా, పైజామా, చొక్కామీద పులిగోరు పతకం వేళ్లాడుతూ సన్నని బంగారు గొలుసు, ఓ చేత్తో మోయలేని బరువుపట్టుకొని రెండో చేత్తో తలుపు తీసుకు దిగాడు.

“పవన్ వెనక హిట్లర్‌ని దింపు”

“వరద బోయ్ ఫ్రెండ్. అందరూ అనుకొంటూంటారు” అంది చందన గుసగుసగా.

వరదరాజేశ్వరిని చూస్తూనే అమ్మాయిలు ముగ్గురూ విష్ చేశారు.

“ఏమిటిలా వచ్చారు. హాస్టల్‌లో కలుసుకొనే వాళ్లంకదా!” ఆమె గొంతులో చికాకు, విసుగు మిళితమై ఉన్నాయి.

“మీతో కొన్ని వ్యక్తిగత విషయాలు చెప్పాలనుకుంటోంది ముక్త. తోడుగా మేం ఇద్దరం వచ్చేం” అంది చందన.

“ఇది వరకటి సంగతేనా! ఇంక వేరే ఏమైనా ఉందా” తలుపు తీయకుండానే మాటాడుతోంది వరద.

పవన్ చేతిలో సామాను కిందపెట్టి వరద హ్యాండ్‌బాగ్ తీసుకొని తాళం తీసి తలుపు తెరిచి సామాను తీసుకొని లోపలికి వెళ్లాడు.

ఈలోగా హిట్లర్ అనే కుక్కపిల్ల ముక్త, సరోజ, చందనల కాళ్లు వాసన చూస్తుంటే

ముక్త, సరోజ భయంతో బిగుసుకుపోయి ఒకళ్లనొకళ్లు చుట్టుకు పోతుంటే వరద హిట్లర్‌ని తన దగ్గరకి రమ్మని ఆర్డర్ జారీ చేసింది. హిట్లర్ వరద చేతుల్లోకి వెళ్లగానే వరద కుక్కపిల్లని దువ్వుతూ అనాసక్తంగా ముగ్గురినీ లోపలికి ఆహ్వానించింది.

అందరూ లోపలికి వెళ్లారు. అవసరం వాళ్లది కాబట్టి వెళ్లాలని లేకపోయినా వెళ్లారు.

వరద "కూర్చోండి" అందేకాని ప్రతి సోఫాలోనూ చదివి పడేసిన న్యూస్ పేపర్లు, నేలమీద తిని పడేసిన ఖాళీ బిస్కెట్ కవర్లు, దానిమ్మకాయ సగం వలి చిపడేసినట్టున్నారు, దానిమీద దోమలు ముసురుతున్నాయి. ఎదురుగా ఉన్న దివా న్‌మీద విడిచిపడేసిన బట్టలు, టవల్స్ ఆరీ ఆరనివి మొత్తంమీద డ్రాయింగ్‌రూం అస్త వ్యస్తంగా ఉంది.

పొద్దున్నించీ నలిగిపోయి దుమ్ము కొట్టు కొన్న బట్టలయినా ఆ సోఫాలో కూర్చోం దుకి ఆ మిత్రత్రయానికి కొంచెం ఇబ్బంది గానే ఉంది. తమ బట్టలకి ఏదైనా అంటు కొని తమ రాకకో చెరగని ముద్రవేస్తాయే మోనని భయపడుతూ నిలబడ్డారు.

"కూర్చోండి" అంటూ ఒక్క వేటులో సోఫాలో సామానంతా దివాను మీదకి విసి రేసింది. తాగి వదిలేసిన కూల్‌డ్రింక్ బాటిల్స్, గ్లాసులు ఒక కవరులో వేసి అల్మారాలోకి తోసేసింది.

"సారీ అమ్మాయిలూ! ఇల్లంతా సరిగా లేదు. అయినా ఆడవాళ్లు ఇల్లు సరిదిద్దుకో వడమే పరమావధిగా పెట్టుకోకూడదు. వీలుంటే ఇల్లు సర్దుకోవచ్చు లేకుంటే లేదు. పైనించి లేబర్ చేత చేయించుకొంటాను. రానురాను మనదేశం కూడా అమెరికాలా అయిపోతోంది. పనివాళ్లు దొరకడంలేదు. నాకసలు చిన్న పిల్లలు పనిచేస్తేనే ఇష్టం. అనవసరమైన ఆరాలు ఉండవు. ఏ పని చెయ్యమంటే ఆ పని చేస్తారు. పవన్ మంచినీళ్లు తీసుకురా" అంది.

పవన్ నీళ్లు తెచ్చిచ్చాడు. "మేడం! మొన్న ఆదివారం మీరిచ్చిన ఇంటర్వ్యూలో చైల్డ్ లేబర్ తక్షణం నిషేధించాలన్నారు. ఇప్పుడు చిన్న పిల్లలు పని చేస్తేనే ఇష్టం అంటున్నారు! అదెలా" అంది సరోజ.

"అవునమ్మా చిన్న పిల్లలచేత పనిచే యించు కోవడం బాధే. నిజంగా! పసికూ నలు మాడి వీధులంట తిరిగేకన్నా నా ఇంట్లో పనిచేయించుకొని తిండిపెట్టి డబ్బి స్తున్నాను కద! పిల్లల చేత పనిచేయించుకో డానికి నేను వ్యతిరేకిని. పిల్లలు చదువు కొంటూ ఆరోగ్యంగా ఉండేలా ప్రభుత్వం చూడాలి. వాళ్లు ఫెయిలవబట్టే కద! వీళ్ల రోడ్లమ్మట తిరుగుతున్నారు. నేను వాళ్లని పని చెయ్యమని ఎప్పుడూ పిలవను. వాళ్లే పని కావాలంటూ నా దగ్గరకి వస్తారు. అసలు నాకు పనివాళ్లే ఇష్టం ఉండదు. ఎవరి పని వాళ్లు చేసుకోవాలి"

అసలు విషయం మూలపడి వితండవా దనలోకి దిగేట్టుందని చందన "ముక్తా! చెప్పేదేదో మేడమ్‌కి స్పష్టంగా చెప్పు" అంది.

ముక్త నోరు విప్పేలోగా వరదరాజేశ్వరి "అమ్మాయి ముక్తా! నువ్వేదో చెబుతావు. అతనిని అడిగితే అతనేదో చెబుతాడు. దేనికీ సాక్ష్యాధారాలు ఉండవు. తాకేడేమో! అది తప్పు అనుకునే స్వభావం నీది. కోలా ఫార్వర్డ్, ప్రపంచాన్నంతా పలుమార్లు చుట్టి వచ్చినవాడు. గురుశిష్య సంబంధాలు, ఒక్కొక్కళ్లలో ఒక్కోరకంగా ఉంటాయి. వార్డెన్‌గా హాస్టల్‌లో ఎవరైనా, మర్యాదనతి క్రమిస్తే చర్య తీసుకోడానికి వీలుంటుంది. ఎక్కడో లాబ్స్‌లోనో పార్క్‌లోనో సినిమా హాలులోనో ఏదో ప్రాబ్లమ్ వచ్చిందని నా దగ్గరకు వస్తే నేనేం చేయాలి? ఆడ, మగ సమానమంటున్నాం కద! దాంతో ఆడవా ళ్లని, మగవాళ్లని సమానంగా చూడాలని కొందరనుకొంటారు"

ముక్తకింక మాట్లాడటం దండగనిపించింది. "వస్తాం మేడమ్. ఉమన్స్ లిబ్ మూవ్‌మెంట్‌కి వెన్నెముక లాంటివారు. సాటి స్త్రీ అశక్తత మీరు అర్థం చేసుకొని పరిష్కారం చూపిస్తారని ఆశతో వచ్చాను. మీ విలువైన కాలం పాడుచేసినందుకు సారీ మేడమ్" అంది ముక్త లేస్తూ.

"ఏమిటి అర్థం చేసుకోవడం? ఏమిటి పరిష్కారం? " గోళ్లరంగు చూసుకొంటూ గొణుక్కొంది వరద.

ముగ్గురూ బయటకి వచ్చేశారు.

"మరోసారి పొరపాటు చేశాం ఈవిడ దగ్గరకి రావడం" అంది ముక్త.

"సారీ ముక్తా! ఆమధ్య షాపులో ఊడ్చి నీళ్ళు తెచ్చే అమ్మాయిని షాపువాడు చెయ్యి పట్టుకున్నాడని ఎంత అలజడి లేవదీసింది. ఇక్కడ తమదగ్గరే చదువుకుంటూ తను వార్డెన్‌గా ఉన్న హాస్టల్‌లో ఉన్న అమ్మాయి విషయం సాటి స్త్రీగా వినడానికి కూడా ఇష్టపడటంలేదు. ఒకేచోట పనిచేస్తున్న వ్యక్తితో తనకెందుకు రాద్ధాంతం అని ఆవిడ సిద్ధాంతం అయి ఉంటుంది"

"షాపులో అమ్మాయి అంటే పబ్లిక్‌కి చెందినది. తనకి పబ్లిసిటీ తేగలిగే సంఘటన. ఇక్కడ తనో ఉద్యోగస్తురాలు. సాటి స్టాఫ్ మెంబర్‌తో గొడవ పెట్టుకోవాలి. అందుకే తెలుసుకోడానికి కూడా ఇష్టపడడం లేదు"

"వరద చేసిన సోషల్ వర్క్‌కి పద్మశ్రీ వస్తుందంటున్నారు"

"ఆవిడ ఎంత గొప్పదైనా, నా పాలిట వరద నీరేనని, ఇదివరకూ అన్నాను. ఇప్పుడూ అంటున్నాను" అంది ముక్త.

ముగ్గురూ హాస్టల్ చేరుకున్నారు.

★ ★ ★

సత్యం ఇంజనీరింగ్ చదువు పూర్తయ్యాక అమెరికా వెళ్ళి పి. హెచ్. డి. చేశాడు. డిగ్రీ పూర్తయి వచ్చినప్పుడు తండ్రి పెళ్ళి ప్రస్తావన తెస్తే తనకప్పుడే పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం లేదన్నాడు. కానీ సత్యం తండ్రి మెడికోగా ఉన్న కోటీశ్వరులపిల్ల నవ్యని చేసుకుంటే ఉండే ఫ్యామిలీ రిలేషన్స్ మరీ మరీ నొక్కి చెప్పి ఎలాగైతేనేం సత్యాన్ని ఒప్పించి నవ్యతో ఆ సంవత్సరమే పెళ్ళి చేశారు.

పెళ్ళిలో, రిసెప్షన్‌లో సత్యం మరీ మూడీగా ఉన్నాడనుకుంది నవ్య. సత్యంతో కన్నా ఫ్రెండ్స్‌తోనే ఎక్కువ ఆనందంగా గడపగలిగాను అనీ అనుకుంది. సత్యం ప్రపంచంవేరు. తన ప్రపంచం వేరు. ఇద్దరికీ అతకదేమో అనిపించింది నవ్యకి.

పెళ్ళికాగానే హనీమూన్‌కి ఎటు వెళదామంటే "ఇక్కడే ఉందాం. మళ్ళీ అమెరికా వెళ్ళిపోవాలి" అన్నాడు సత్యం.

నవ్య ఉత్సాహానికి నీరుజల్లినట్లయింది. నవ్యకి ఇక్కడే ఉండి హౌస్‌సర్జన్ పూర్తయ్యాక అమెరికా వెళ్ళాలనే ప్లాన్‌లో ఉంది.

అయితే, హౌస్ సర్జన్సీ పూర్తయ్యేనాటికి గౌతమ్‌తో పరిచయం, అది పెరిగి ఇద్దరూ కలిసి ఎమ్. డి. ప్రోగ్రాంలలో చేరడానికి నిర్ణయం తీసుకోవడం వరకూ వెళ్ళింది. మధ్యలో సత్యం వస్తే నవ్యకి అతనితో ఎక్కువకాలం గడపడానికి వీలుకాలేదు. సత్యం అదేం పట్టించుకోలేదు.

నవ్య ఎమ్. డి. పూర్తిచేసుకునేసరికి తండ్రి తాలూకు హాస్పిటల్ మేనేజిమెంట్ కూడా తనే చూసుకోవడంలో గౌతమ్ నవ్యకి నీడలా నిలబడ్డాడు. గౌతమ్ కనబడకపోతే నవ్యకి ఒక్కక్షణం ఒక యుగం. సత్యంకి నవ్య మనసులో ఇసుక రేణువంతచోటు కూడా లేకుండా పోయింది.

అయితే, సత్యం తనకు నచ్చిన పరిశోధనలు చేసుకుంటూ ఆ ఫీల్డులో గొప్పపేరు ప్రఖ్యాతులు సంపాదించాడు.

సత్యం, నవ్యల పేరెంట్స్, పిల్లల సక్సెస్ తలచుకుని మురిసిపోతున్నారే తప్ప నవ్య, గౌతమ్‌ల మధ్య పెరిగిన అనుబంధం సంగతి తెలీదు. నవ్య తన మంగళసూత్రం,

ఎంగేజిమెంట్ రింగ్ బ్యాంక్ లాకర్స్‌లో పదిలం చేసిందనీ గ్రహించలేకపోయారు.

★ ★ ★

సుమిత్ర పొద్దుటినుంచీ ఎన్నిసార్లు టెలిఫోన్ ఉన్న కారిడార్‌వైపు వెళ్ళిందో లెక్క పెట్టి చెప్పడం కష్టం.

మూడురోజులు వరసగా శలవులు.

బంధువులున్నారని కొంతమంది ఊళ్ళోకి వెళుతూ ఉంటారు. కొంతమంది ఆ శలవులలో లైబ్రరీ పని చేసుకోవడం, భవిష్యత్ ప్లాన్స్, సాటి స్నేహితులతో మాట్లాడడం, వాళ్ళ సలహాలు తీసుకోవడం, చెప్పబోయే పాఠ్యాంశాలు గురించి ముందుగానే ఓ అవగాహన ఏర్పరచుకోవడం చేస్తుంటారు.

సుమిత్రకి ఫ్రెండ్స్‌తో అందులోనూ బాయ్‌ఫ్రెండ్స్‌తో కలిసి తిరగకుండా వెళ్ళి ఇంటివద్ద శలవులన్నీ గడిపేసి కాలం వృధా చెయ్యడమేనా! అని మూడ్ పాడైపోతోంది. రాజేష్, శంకర్, మైత్రీ, జోగీవాలా ఒక్కడూ ఫోన్ చెయ్యడు ఎట్లైనా వెళదామంటే. వాళ్ళకోసం ఎంతసేపు కాసుకుని కూర్చోవాలని ఉడికిపోతోంది.

తోటి అమ్మాయిలతో కలిసి సినిమాలకి, షికార్లకి వెళ్ళడం సుమిత్రలాంటివాళ్ళకి అవమానం, బిలోడిగ్నిటీ.

సుమిత్ర అస్తమానూ తలుపు తియ్యడం, వెయ్యడం ఓ నిమిషం కూర్చోగానే టెలిఫోన్ దగ్గరకి పోవడం, చదువుకుంటున్న రూం మేట్ శాంతకి, డిస్టబెన్స్ అనిపించి "సుమిత్రా ఎందుకే అలా ఫోన్ కోసం అన్నిసార్లు వెళతావు. మాథ్స్‌లాంటి మంచి సబ్జక్ట్ మరోటుందా? ఎన్నిలెక్కలైనా ఆసక్తి ఉంటే చేసుకుంటూ పోవచ్చు. మిడ్ సెమిస్టర్ టెస్టులు మొదలవుతున్నాయి. లెక్కలు చేసుకోవచ్చుకదా" అంది.

"ఏం లెక్కలే! ఒక్క వెధవా ఫోన్ చేయలేదు. మళ్ళీ నిన్నటివరకూ ఇక్కడికెళదాం, అక్కడికెళదాం అన్నవాళ్ళే! విసుగొచ్చి ఇలా ఫోన్ గురించి వెళ్తున్నాను"

"ఫోన్ దగ్గర మెసెంజర్ ఉన్నాడు. నీకు ఫోన్ వస్తే తలుపు తట్టి మరీ చెబుతాడు కదా!"

"అవుననుకో, నాకేం తోచడం లేదాయె"

"నీకు బాగా బలాదూర్ తిరగడం అలవాటయింది. వాళ్ళు పాపం చదువుకొంటున్నారేమోనే!"

"అందరూ చదువుకొంటున్నారు. నేనొక్కదాన్ని తప్ప!" చిరాకుపడింది సుమిత్ర. "నేను రోబోట్ సెంటర్‌వరకు పోతున్నా, ఓ గంటవరకూ రాను. నీకు డిస్టబెన్స్ లేదు. శ్రద్ధగా చదువుకో" అంటూ రోబోట్ సెంటర్‌కి బయలుదేరింది. అక్కడో 'చాయ్' తాగింది. బిస్కట్ పాకెట్ కొనుక్కొంది. తెలిసున్న వాళ్ళెవరూ కనిపించలేదు. హాస్టల్‌కి వచ్చి వరండాలోనే తనకేమీ ఫోన్ రాలేదని తెలుసుకొని రూంకి వచ్చింది.

"ఏం ఏ చేపా గేలంలో పడలేదా? "

"లేదు. ట్రిప్ వేస్టయింది"

"సుమిత్రా! ఓపని చెయ్యవే! నీతో తిరిగే ప్రతి ఒక్కడికీ, నువ్వు డబ్బులు అప్పిచ్చేవు. అందుకే వాళ్ళు నీకు మొహం చూపించడం లేదు. నువ్వు డబ్బున్న దానివని తెలుసుకొన్నారు. వాళ్ళకి వీలయినప్పుడు వచ్చి నీతో కాలక్షేపం చేస్తూ, డబ్బు ఖర్చు పెట్టిస్తున్నారు. ఆ 'ఆదర్శ్'గాడి నాటకం తర్వాతనైనా నీకు జ్ఞానోదయం అవుతుందనుకొంటే మళ్ళీ మొదలుకు వచ్చావు. ఆదర్శ్ ప్రేమించేడన్నావు. పెళ్ళన్నావు. చివరికి వాడు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌ని చేసుకొంటున్నానని పెళ్ళికార్డులు పంచేవరకూ వేలు తగలేస్తూనే ఉన్నావు. ఆ డిప్రెషన్‌కి తట్టుకోలేక ప్రాణంమీదకి తెచ్చుకొన్నావు. చాలు చాలు సుమిత్రా నిన్నెలా అర్థం చేసుకోవాలో తెలీడంలేదు. నా మాట విని వాళ్ళ దగ్గర అప్పుచేసి వాళ్ళచేత ఖర్చుపెట్టించు. అప్పుడు చూడు వాళ్ళ నిజస్వరూపం"

"సరే అదీ చూస్తా. ఆ అప్పు తీర్చమని

అడగడానికైనా నా చుట్టూ తిరుగుతారు"

"ఓ మైగాడ్! సుమిత్రా, కుక్కతోక వంకర ఎవరు సరిచెయ్యగలరే! నా టైం దండగ చేసుకొన్నా"నంటూ మూసిన పుస్తకం తెరిచింది శాంతి.



వరద జ్ఞానం వచ్చినప్పటినించీ తల్లిదండ్రులలో సామరస్యం లేకపోవడం అడుగడుగునా చవిచూసింది. వరదని స్కూల్లో ఎడ్మిట్ చెయ్యడానికి పెద్ద రగడ. తల్లి ఓ స్కూలంటే, తండ్రి మరో స్కూలు పేరు చెబుతాడు. చివరకి వరద మేనమామ కలగజేసుకొని ఆ రెండు స్కూళ్ళూ కాకుండా మూడో స్కూల్లో చేర్పించాడు.

వరద పెరిగి పెద్దదవుతున్నకొద్దీ తల్లితండ్రుల కీచులాటతో విసిగి వేసారిపోయింది. ఇద్దరూ చదువుకున్నవాళ్ళే. ఉద్యోగస్థులే! ఆస్తిపరులే! మంచి కుటుంబాల్లోంచి వచ్చిన వాళ్ళే. దేనికీ లోటులేదు.

ఆ ఇంట్లో కరువైనవి రెండే రెండు. ఆప్యాయత, అనుబంధం. వరద తండ్రి ప్రభాకరం ప్రతిపని తనకి నచ్చినట్టుండాలి అంటాడు. తమచేత నచ్చని పని చేయించాలని చూడవద్దని తల్లి సరస్వతి అంటుంది.

ప్రభాకరం ప్రతిదానికీ పద్ధతి, ఖచ్చితం అంటాడు. ఏది కొంచెం అటూ ఇటూ ఉన్నా సహించడు.

సరస్వతి "రోజూ అన్నీ అనుకున్నట్లే జరగాలంటే కుదరదు. మానవమాత్రులంకదా!" అంటుంది.

సరస్వతి ఏ పనిచేసినా ప్రభాకరం తప్పు పట్టడానికి చూస్తాడు.

"ప్రభాకరంలో తానొక అధికారిని, యజమానిని చూడగులుగుతోందే కాని, ఆయనలో ఒక స్నేహితుడిని, సన్నిహితుడిని కాదు" అనుకొంటుంది సరస్వతి.

వరద స్నేహితులు, బంధువుల ఇళ్ళకి వెళ్ళినప్పుడు, వాళ్ళ తల్లిదండ్రుల మధ్య ఉండే ఆత్మీయతకి, అనురాగానికి అబ్బురపడేది. పిల్లలపట్ల వాళ్ళకుండే బాధ్యత, శ్రద్ధ, ఓర్పు చూసి కించిత్ అసూయపడేది కూడా. తల్లీతండ్రీ ఒకరికొకరు అనుకూలంగా ఉండి మమత, మమకారంతో సంసారం చేస్తూంటే వాళ్ళ ప్రేమలో తను సేదతీరాలనుకొనేది.

ఒకసారి వరద మేనమామ వచ్చినప్పుడు ఐదు సంవత్సరాల వరద రెండు చేతులలో రెండు ఏభైరూపాయల నోట్లు పెట్టాడు.

"ఏం చేస్తావు వరదా?" అన్నాడు గోముగా.

"ఓ యాభై రూపాయలు, నాన్నతో వెళ్ళినప్పుడు ఐస్‌క్రీం తింటా. ఓ యాభై రూపాయలు పెట్టి అమ్మతో బజారుకెళ్ళినప్పుడు ఐస్‌క్రీమ్ తింటా" అంది.

"ఇద్దరితో కలసి వెళ్ళి ఐస్‌క్రీం తినవచ్చు కదా. పోనీ రెండుసార్లు వెళ్ళి తిను" అన్నాడు.

"ఇద్దరితోనా! వద్దు బాబోయ్! బోలెడన్ని జగడాలు పెట్టుకొంటారు. నాకు వేరే వేరే వెళ్ళడమే ఇష్టం. వాళ్ళు కొట్లాడుకొంటే నాకు బోర్" అంది వరద.

"పెరుగుతున్న పిల్ల మనసు కాలుష్యంతో నింపుతున్నారు. మీ సమస్యలు మీలోనే

పరిష్కరించుకొని, జీవితం ఆనందంగా గడ పవచ్చుకదా!" అని అక్కగారికి చెప్పాడు.

"నేను ఆనందంగా గడపనన్నానా? ఆ సంగతేదో నీ మూర్ఖపు బావకి చెప్పు" అంది సరస్వతి.

"బావా! ఎందుకలా చీటికి మాటికి చికా కుపడతారు. మీ స్వభావం మార్చుకోకపోతే విలువలు తగ్గుతాయి. వరదమీద మీ భార్యాభర్తల అసంతృప్తి నీడ విస్తరిస్తుంది. ఆ తర్వాత మీకు కూతురు కూడా దూరమ వుతుంది" అన్నాడు.

ప్రభాకరం నవ్వేసి, ఊరుకొన్నాడు.

ప్రభాకరం నవ్వితే సరస్వతి ఏడ్చింది.

'ఎవరూ తీర్చలేని సమస్య. ఇద్దరికీ శాంతి లేదు. కొన్ని జీవితాలంతే' అనుకొన్నాడు వరద మేనమామ.

వరద దేముడిమీద అప్పుడప్పుడు కోపం తెచ్చుకొంటుంది. ప్రేమగా ఉండే తల్లితం డ్రులని ఎందుకివ్వలేదని. ఇంటర్‌వరకూ వరద యుద్ధభూమిలో ఉన్నట్టే కాలం గడి పింది. డిగ్రీకి వచ్చిన తర్వాత తను ఇంట్లో ఉండి చదవలేను. హాస్టల్‌లో ఉండి చదు వుతానని పట్టుబట్టింది. తల్లి హాస్టల్‌లో చేరడానికి ఒప్పుకోలేదు.

తల్లికి ఇష్టంలేదని తెలిసి తండ్రి వరదని హాస్టల్‌లో చేర్పించి వచ్చాడు. వరదకి హాస్టల్ వాతావరణం స్వర్గంలా అనిపిం చింది. ఎంతో ప్రశాంతత. స్టూడెంట్ లీడ రైంది. స్వేచ్ఛాభావాలు, ఆధునికత మీద ఉపన్యాసాలిచ్చేది. ఉమన్స్‌లిబ్ మూవ్ మెంట్ వైపు అమితంగా ఆకర్షితురాలైంది. మెంబర్లై మీటింగులు పెట్టి, ఎక్కడ ఏ అన్యాయం జరిగినా వెంటనే స్పందించి తన కున్న పరిధిలో స్త్రీకి న్యాయం జరిగేలా చూసేది. స్త్రీ ఎవరికీ, ఎక్కడా, ఎట్టి పరిస్థి తులలోనూ బానిస కాకూడదన్నదే వరద స్త్రీలకిచ్చే సందేశం. కాలేజీకి సెలవులిచ్చినా, వరద ఇంటికి వెళ్ళేది కాదు. ఏ పండగకో తల్లి బతిమాలి తీసికెళ్ళినా మధ్యాహ్నానికి వాళ్ళ దెబ్బలాటతో విసిగిపోయి ఇద్దరూ విడిపోయి శాంతిగా ఉండమని సలహా ఇచ్చేది.

డిగ్రీ అయిపోయాక వరదకి అదే ఊళ్ళో సీటు వచ్చినా విదర్భ యూనివర్శిలో సీటు వస్తే అక్కడ చేరింది. అక్కడే పవన్ పరి చయమయ్యాడు. వరద వాక్చాతుర్యానికి పవన్ ఆకర్షితుడయ్యాడు. వరద ఏమంటే దానికి "అవును" అనేవాడు.

"స్త్రీలని అణచి వేస్తున్నారు" అని వరద అంటే "అవును ఊరుకోకూడదు, తిరగబ డాలి" అనేవాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ పవన్, వరదల మధ్య స్నేహం పెరుగుతోంది. ఎక్కడికైనా వెళదామనుకొనేసరికి పవన్ వెహికల్తో సహా ప్రత్యక్షమయ్యేవాడు. అన్ని పనులు స్వంతంగా మనసుకి నచ్చేవిధంగా చేసుకొనే అలవాటున్న వరద తనకి తెలియకుండానే పవన్‌తో తిరుగుతూ అతనిమీద అన్నిటికీ ఆధారపడిపోతోంది. లైబ్రరీ బుక్స్, లాండ్రి, బజారులో వస్తువులు, స్టేషన్‌లో టిక్కెట్స్, బ్యాంక్ పనులు, అన్నీ తనకి చేసుకొంటూ వరదకి కూడా చేసుకొస్తున్నాడు.

పవన్ స్వంత ఊరు వెళుతూ బజారులో ఏవోకొంటూ, మూడేళ్ళ పాపకి ఓ ఫ్రాక్ కొనాలన్నాడు. ఇద్దరూ ఓ చక్కని ఫ్రాక్ సెలక్ట్ చేశారు. పాప పవన్‌కి ఏమవుతుం దని వరద అడగలేదు. పవన్ మాటల్లో చెప్పాడు. ఆ ఫ్రాక్ తన పాపకేనని. వరద "అహా" అని ఊరుకొంది.

పవన్‌తోపాటు బజారునించి తిరిగి వస్తూ పవన్‌కి భార్య, పాప, ఉంటే ఉండు గాక తనకేమిటి? పవన్ తన వెంటబడుతు న్నాడు. తనేం కావాలని పవన్ వెంటపడ లేదు. ఏదో కాలక్షేపం. అంతవరకే తమ స్నేహం అని మనసులోనే విశ్లేషించుకొంది.

వరదకి పెళ్ళి, భర్త, కుటుంబ వ్యవస్థ లాంటివంటే అంత విలువలేదు. స్త్రీ స్వేచ్ఛకి పెళ్ళి ఓ ప్రతిబంధకం అని నమ్మే

వ్యక్తి. పెళ్ళి చేసుకోవాలి, సంసారం ఉండాలి, అనుకొంటేకదా, వరద పవన్‌కి భార్య, కూతురున్నారని అనుకోడానికి.

విదర్భ యూనివర్సిటీలో చదువులయ్యాక వరద సోషియాలజీ లెక్చరర్‌గా, పవన్ ఫ్రెంచి ప్రొఫెసర్‌గా యూనివర్సిటీలో చేరారు. ఇక్కడే పవన్‌కి స్వంతిల్లు, తల్లి, భార్య, కూతురు ఉన్నా కూడా ఎక్కువకాలం వరద క్వార్టర్స్‌లోనే గడిపేవాడు.

వారానికోసారి మాసిన బట్టలు తీసికెళ్ళి ఇంట్లోపడేసి ఉతికి ఇస్త్రీ చేసిన బట్టలు సర్దుకొని మూడ్‌ని బట్టి పూటో, రెండు పూటలో ఉండి వచ్చేవాడు.

పవన్ తల్లి సుందరమ్మ పవన్ భార్య తులసికన్న ఎక్కువగా పవన్‌ని నిలదీసి అడిగేది. "ఇదేమైనా లాండ్రీ షాపా? " అనేది. ఒక్కగానొక్క కొడుకు పవన్ ఆవిడ అదుపులో లేడు. మేనకోడలినే కోడలుగా చేసుకొన్న సుందరమ్మ ఒకోప్పుడు తులసి ఓర్పుకి విసుక్కొనేది. ఇంకో రెండు మాటలు అంటే ఆ వారం పవన్ ఇంటికే వచ్చేవాడు కాదు.

వరద పశుపక్ష్యాదుల సంఘానికి సెక్రటరీగా ఎంపికైంది. ఆ వార్త పేపరులో చదివి "సాటి స్త్రీకి అన్యాయం చేసే వరద పశుపక్ష్యాదులని సంరక్షిస్తుందన్నమాట. అవునులే వాటికి నోరు లేదనేమో. నా కోడలి మంచితనంతో నోరు విప్పడంలేదు. నేనే ఈరోజు వరదని అడిగి వస్తాను. నిన్నిలా పశువుని కట్టినట్టు కట్టిపడేసి సాటిస్త్రీ కాపురంలో నిప్పులు పొయ్యడం చదువుకొన్న వరదకి తగదని చెప్పివస్తా"నంది సుందరమ్మ.

"ఆవిడేం చేసింది. నాకిష్టమై నేషెళుతున్నాను. ఏమైనా అంటే నన్ను అనుకో. ఆవిడని కలుసుకొంటే నేనీ గుమ్మం మళ్ళీ తొక్క"నన్నాడు పవన్.

"పోనీ అత్తా! మురికి ఉతుక్కొందుకైనా వస్తున్నాడు నీ కొడుకు. వారానికోసారి కళ్ళబడుతున్నాడు. ఆ అమ్మాయి నెందుకంటారు. నేను నీ కొడుకుని ఆకర్షించలేకపోయాననుకోండి. తల్లిపోతే ప్రేమామృతాన్ని తనివితీరా తాగించారు. ఈనాటికీ మీ ఒడిలో చేర్చుకొని సేదతీరుస్తున్నారు. నాదనుకొందుకు దేముడు నాకో కూతురిని చ్చాడు. మనం ముగ్గురమూ పవన్‌మీద డబ్బుకి ఆధారపడిలేం. కాలమే సమస్యలకి పరిష్కారం చెబుతుంది. భగవంతుడిమీదే భారం వేశాను. నా గురించి మీ తల్లీకొడుకులు ఘర్షణకి దిగి ఈ మాత్రపు అనుబంధాన్ని కూడా దూరం చేసుకోకండి" అంది తులసి.

"పిచ్చి తల్లీ తులసీ! నీకు దేముడు తప్పక న్యాయం చేస్తాడు" అని తలనిమిరింది సుందరమ్మ.

★ ★ ★

కోలా, ఆయన స్టూడెంట్ అతుల్‌పాండే ఎవరి తోవన వారు అమెరికాలోని అట్లాంటాలో జరిగే కాన్ఫరెన్స్‌కి ప్రయాణం ఏర్పాట్లలో ఉన్నారు. అతుల్ వారంముందే లండన్ వెళ్ళి అక్క, బావ, పిల్లలని చూసి కాన్ఫరెన్స్‌కి చేరుకొంటానని చెప్పాడు.

కోలా ఎయిర్‌ఇండియా ఫ్లైట్ నెంబర్ ఎ-1-ఏడు నాలుగు ఏడులో కూర్చున్నాడు. కాన్ఫరెన్స్ అయ్యాక సత్యంని కలుసుకొని వస్తాడో, రాడో తేల్చుకోవాలని అనుకున్నాడు. ఒకవేళ సత్యం రాకపోతే ఆ తర్వాత తనకి దక్కబోయే ఉన్నతి గురించి ఊహిస్తూ కోలా మనసు విను వీధులలో ఎగురుతూ తుళ్ళుతోంది.

సత్యంని ఎలాగైనా కలుసుకోవాలి కాన్ఫరెన్స్ లిస్టులో పేరైతే ఉంది. సత్యంతో ముఖాముఖీ మాట్లాడి రాజీనామా ఇస్తానంటే వెంటనే ఆ కాగితం తీసుకొని స్వయంగా యూనివర్సిటీ అధికారులకి సమర్పించాలి. కోట్లాది విలువైన లాబ్స్ తన ఆధీనంలోకి వస్తాయి. ఏ పనిచేద్దామన్నా పదోవంతు పరికరాలే తన దగ్గరున్నాయి. పోనీ సత్యం వచ్చి హాయిగా మంగళగిరిలో

ఉండవచ్చుకదా! అలాగా చెయ్యడు. అసలు సత్యంని అనుకొనేం లాభం? ఇతని ట్యూన్స్‌కి డాన్స్ చేస్తున్న యూనివర్శిటీ అధికారులని అనాలి.

ఎయిర్‌హోస్టెస్ కోలా ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ, "డ్రింక్స్ కావాలా? " అని అడిగింది.

స్వదేశీ, విదేశీ ప్రయాణాలు తరచుగా చేసే కోలా ఇంటర్నేషనల్ ఫ్లైట్‌లో డ్రింక్ తీసుకోవడం ఓ స్టైల్‌గా భావించి డ్రింక్ ఆర్డరిచ్చాడు. ఒకటి తర్వాత ఒకటి నాలుగు డ్రింక్‌లు తాగాడు.

టెన్షన్ వల్ల, భోర్డమ్ వల్ల, స్టేటస్ అనుకొని, తాగడం అలవాటు లేదంటే నామర్దా అనుకొని... కొంతమంది డ్రింక్స్ తీసుకొంటారు. ఎక్కువగా తాగి వెర్రిమొర్రి వేషాలు వేసే ప్రయాణీకులు అప్పుడప్పుడు తగులుతూవుంటారు. కోలాకి మోతాదు ఎక్కువయిందో, కావాలనో, ఫ్రస్ట్రేషనో... వీటిలో ఏదో ఓ కారణంవల్ల అతని కళ్లకి అందంగా కనిపించిన ఎయిర్‌హోస్టెస్‌ని పదేపదే ఏదో వంకన పిలిచి విసిగిస్తున్నాడు.

అప్పుడప్పుడు విమాన సిబ్బందికి ఇటువంటివాళ్లు తటస్థపడుతూంటారు. కోలా నటిస్తున్నాడో, తూలుతున్నాడో తెలియదు. ఎయిర్‌హోస్టెస్ వినిపించుకోవడంలేదని ఆమె వెంటబడి తూలుతూ అడుగులేస్తూ ఏదేదో మాట్లాడుతున్నాడు.

అసలే ఎయిర్ఇండియాలో ఎయిర్‌హోస్టెస్‌లకి స్వదేశీ ప్రయాణీకులను చూస్తే చిన్నచూపు. గౌరవించాల్సినప్పుడు కూడా 'మనవాడే కదా!' అని 'మహా ఎక్కేవులే ఎలాగైతే విమానం' అన్నట్టు ప్రవర్తిస్తారు. విదేశీ ప్రయాణీకులకి అతిగౌరవం చూపిస్తారు. ఆరోజు ఎయిర్‌హోస్టెస్ చాలామందికన్నా మర్యాదస్తురాలు. కోలాని "మిష్టర్! మీ సీట్లో కూర్చోండి. రెస్ట్ తీసుకోండి" అని అనునయంగా చెప్పి ముందుకు వెళ్లబోయింది.

రెండడుగులు ముందుకు వేసి వెళ్లబోతున్న ఎయిర్‌హోస్టెస్‌ని చెయ్యిపట్టుకుని ఆపడానికి ప్రయత్నం చేశాడు కోలా. ఆమె నెమ్మదిగా చెయ్యి విడిపించుకుని వెళ్లబోతూంటే పైటచెంగు పట్టుకుని రఫ్‌గా లాగాడు. అతడెంత మొరటుగా లాగాడంటే ఎయిర్‌హోస్టెస్ పైటపిన్ను ఊడిపోయి పైట కిందికి జారిపోయింది.

అది చూస్తూ కోలా "సారీ!" అని కూడా అనకుండా అదేదో పెద్ద ఘనకార్యం చేస్తున్నట్టు పగలబడి నవ్వాడు. అతడి నవ్వులో కోలా చెంపమీద ఎయిర్‌హోస్టెస్ ఒక్కటిచ్చిన చప్పుడు కూడా కలగలిసి పోయింది. గూబ పగిలిన కోలా అదిరిపడి సీటులో కూలబడ్డాడు. ప్రయాణీకులలో కలకలం బయలుదేరింది. ఎయిర్‌హోస్టెస్ లోపలికెళ్లి క్రూకి జరిగినదంతా చెప్పింది. కో పైలెట్ ఎయిర్‌హోస్టెస్‌కి జరిగిన అవమానానికి మండిపడ్డాడు.

ప్రయాణీకుల రాకపోకల సౌకర్యార్థం విమానం కైరోలో ఆగుతుంది. కైరో విమానాశ్రయంలో కోలా దిగిపోవాలని విమాన సిబ్బంది పట్టుబట్టారు. ప్రయాణీకులు కూడా వాళ్ళని సపోర్టు చేశారు. ఫ్రాంక్‌ఫర్ట్ వరకు ప్రయాణం చెయ్యవలసిన కోలా కైరోలో దిగిపోవలసివచ్చింది.

కైరో ఎయిర్‌పోర్టులో దిగిన కోలాకి ఫ్రాంక్‌ఫర్ట్‌కి వెళ్ళాలంటే ఎయిర్ ఇండియా విమానం మర్నాడుగానీ లేదని తెలిసింది. ఇతను ఎందుకు దిగిపోవలసి వచ్చిందో తెలుసుకున్న కైరో విమానాశ్రయ సిబ్బంది ఇతని సంగతి ఇండియన్ ఎంబసీలో తేల్చుకొమ్మని ఎయిర్‌పోర్ట్ బస్ ఎక్కించి పంపించారు. ఎంబసీవాళ్ళు కోలాని క్షమాపణ పత్రం రాసిమ్మని అంతటితో దయతలచి మర్నాడు ఎయిర్ ఇండియాకి టికెట్ మార్పించి పంపించారు.

అనుకోకుండా కైరోలో ఓరోజు ఆగిపోయిన కోలా, ఇరవైనాలుగు గంటలు

టూరిస్టు వీసా తీసుకుని, ఓ మూడోరకం హోటల్లో దిగాడు. హోటల్ రూంలో మంచంమీద పడుకుని ఓ నిమిషం జరిగిన దానికి బాధపడి భోజనం కానిచ్చాడు. భోజనం చేస్తుంటే కైరోలో బెల్లీడ్యాన్స్‌లు ప్రసిద్ధి చెందినవని చెప్పుకోవడం గుర్తుకువచ్చింది. రిసెప్షన్‌లో వివరాలు అడిగాడు. "టాక్సీలో వెళతారా?" అంటే "సరే" అన్నాడు. రిసెప్షనిస్ట టాక్సీని పిలిపించి, సగంసగం ఇంగ్లీషులో కోలాని బెల్లీ డ్యాన్స్‌కి తీసుకెళ్ళమని చెప్పాడు. టాక్సీవాడికి అర్థమైందనే కోలా అనుకున్నాడు.

అనేక దేశాల్లోలాగే కైరోలోనూ మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు ఉన్నారు. విహారయాత్రలో వచ్చేవాళ్ళదగ్గర విదేశీమారకం కోసం అన్యాయం చేసేవాళ్ళున్నారు. ఫారిన్ కరెన్సీ దోచుకుపోయేవాళ్ళ పాలబడడం ఒకరకంగా కోలా దురదృష్టం. ముఖ్యంగా భాష అర్థంకాదు.

టాక్సీ మైళ్ళకి మైళ్ళు పోతోంది. ఊరంతా అయిపోయి, ఊరిబయటికి వచ్చారు. ఎడారి మొదలైంది. టాక్సీవాడు దారితప్పలేదు కదా. అని కోలా అనుకున్నాడు. అయినా, అనుమాన నివృత్తికోసం "బెల్లీ డ్యాన్స్‌కేనా వెళుతున్నది? తొందరగా పోనీ నీకు టిప్ ఇస్తా"నన్నాడు ఇంగ్లీషులో.

"పిరమిడ్స్ రాత్రిపూట తెల్లని చందమామ వెలుగుపడి బంగారుకొండల్లా మెరిసిపోతాయి. అవి ముందు చూపిస్తా. పిరమిడ్స్ బై మూన్‌లైట్" అన్నాడు డ్రైవర్ వచ్చీరాని ఇంగ్లీషులో.

కోలా మాటాడేలోగా ఎదురుగా అద్భుతంగా అపురూపమైన కట్టడాలు, మూడు బంగారు కొండలు మెరిసిపోతున్నాయి. డ్రైవర్ కారాపాడు. "ఇదే లాస్ట్ పాయింట్. ఇంక టాక్సీ ముందుకు పోదు. అంతా ఇసుక" అంటూ డోర్ తెరిచి పట్టుకున్నాడు. కోలా దిగుతున్నాడు. మెరుపులా నలుగురు మనుషులు వచ్చి డ్రైవర్ మెడమీద ఒక దెబ్బవేసి వాడి పర్స్ లాక్కున్నారు. కోలాకి చెంపమీద ఒక్కటిచ్చి పర్స్, వాచ్, కెమేరా లాక్కున్నారు. మంత్రించినవాడిలా వాళ్ళన్నీ లాక్కుంటుంటే నిశ్చేష్టుడై నిలబడ్డాడు.

కోలా వాళ్ళని ఏమీ చెయ్యలేననుకున్నాడేమో, "బెల్లీ డ్యాన్స్‌కి వెళదామంటే ఇక్కడకెందుకు తీసుకొచ్చావ్?" అన్నాడు మూలుగుతున్న డ్రైవర్‌తో.

డ్రైవర్‌కి బదులు ఆ దొంగల్లో ఒకడు "వీడికి బెల్లీడ్యాన్స్ కావాలట" అంటుంటే పర్స్ ఖాళీ చేసిన ఇంకోడు, "ఇదిగో నీ టికెట్లు, పాస్‌పోర్ట్" అంటూ కోలామీదికి విసిరాడు.

కోలాకి చెంప దెబ్బ తీవ్రతకి తాగకుండానే కళ్ళు తిరుగుతున్నట్టయి భూకంపమేమోనని కాళ్ళకేసి చూస్తే టికెట్, పాస్‌పోర్ట్ కనిపించాయి. కోలా వాటిని చేతిలోకి తీసుకొని తలెత్తేలోగా టాక్సీలోకి ఆ నలుగురు ఎక్కడం, ఇసుక రేగగొడుతూ స్పీడుగా టాక్సీ ముందుకు పోవడం సెకెండ్లలో జరిగిపోయింది. కోలా దిక్కుతోచక అయోమయంలో పడ్డాడు.

కొంచెం సర్దుకున్నాక ముందుకు నడిచి అక్కడినుంచి అతి దగ్గరగా కనిపిస్తున్న పిరమిడ్లు సుమారు రెండు కిలోమీటర్ల దూరం ఉండవచ్చునని గ్రహించి, ముందుకు నడిచాడు. కొంచెందూరం నడిచాక ఫారిన్ టూరిస్టులు కలిశారు. వాళ్ళకి జరిగినదంతా చెప్పాడు. వాళ్ళు "హౌశాడ్" అని కోలాని అతనుండే హోటల్‌దగ్గరకు తమ టాక్సీలో తీసుకువెళ్ళారు.

కోలా రిసెప్షనిస్ట్‌కి వెళ్ళగానే కంప్లయింట్ చేశాడు. "టాక్సీవాళ్ళు వందలమంది ఉంటారు. ఆ టాక్సీ వాడెవడో మేం ఎలా గుర్తుపట్టగలం. అసలు అప్పుడు మీకు టాక్సీ ఎరేంజి చేసిన రిసెప్షనిస్టు నేను కాదు. అప్పుడు నేను డ్యూటీలో లేను" అన్నాడు.

కోలా కంప్లయింట్ ఇచ్చి హోటల్

రూంకి చేరుకున్నాడు. సూట్ కేస్‌లో పెట్టుకున్న ట్రావెలర్స్ చెక్స్ మార్చుకొని మర్నాడు హోటల్ బిల్ చెల్లించి ఎయిర్ పోర్ట్‌కి చేరుకున్నాడు.

★ ★ ★

కోలా కాన్ఫరెన్స్‌లో అతుల్ చేత పేపర్ చదివించాడు. అతుల్ స్పష్టంగా చెప్పలేని విషయాలు తను వివరించి చెప్పాడు. ఒక అమెరికన్ శాస్త్రవేత్త అంతరిక్షంనుంచి భూమిని ఫొటోలు తీసే కెమేరా లెన్స్ ఏఏ మెటీరియల్‌తో తయారుచేస్తే ఎక్కువ స్పష్టత ఉంటుందో చాలా చక్కగా చెప్పారని మెచ్చుకున్నారు.

ఇంకో అమెరికన్ ప్రొఫెసర్ "కోలా! మీరు వివరించి చెప్పిన ఈ ప్రత్యేక లెన్స్ మీ లాబ్స్‌లో తయారుచేశారా? " అని అడిగాడు.

"తయారుచెయ్యలేదు. ఇలా తయారుచేసే విధానం మాకు తెలుసు. కానీ తయారుచేయడానికి కావలసిన ఆధునిక పరికరాలు ఒక్క లాబ్‌లోనే ఉన్నాయి. తొందరలోనే అవి తయారుచేసే ప్రయత్నంలో ఉన్నా"మని చెప్పాడు.

ఇంకో ప్రొఫెసర్ "మీరు చెప్పిన పద్ధతిలో ఎన్నిసార్లు మా లాబ్‌లో చేసినా ఏంగిల్స్ డిఫరెన్స్ వస్తోంది. మీ లాబ్‌కి వచ్చి కొంత కాలం ఆ టెక్నిక్ నేర్చుకోవాలనుకుంటున్నాను. మీతోపాటు విజిటింగ్ సైంటిస్టుగా మీ యూనివర్సిటీకి రావడానికి వీలవుతుందా? " అని అడిగాడు.

కోలా కొంత తడబాటుతో "తప్పకుండా రావచ్చు. నేను ఇంకో పదిరోజులలో మా యూనివర్సిటీ చేరుకుంటాన"ని చెప్పాడు.

కోలాకి సత్యాన్ని తలచుకున్నా, తమ యూనివర్సిటీ అధికారులని, గవర్నమెంట్‌ని తలుచుకున్నా కడుపు మండిపోతోంది. వీళ్ళందరివల్ల ఇలా తన పరిశోధన అర్థాంతరంగా మిగిలిపోయి ఆత్మస్థైర్యంతో సమాధానం చెప్పుకోలేని పరిస్థితులలో ఉన్నందుకు కలతపడ్డాడు.

అమెరికన్ ప్రొఫెసర్, కోలా ఇండియాకు తిరిగివెళ్ళి తన యూనివర్సిటీ చేరుకునేసరికి తను కూడా వస్తానని చెప్పాడు.

కోలాకి సత్యం కాన్ఫరెన్స్‌లో కనిపించలేదు. సత్యం వస్తాడనుకుంటే రాలేదు. కోలా కాన్ఫరెన్స్ అయిపోయాక సత్యం పనిచేస్తున్న వరల్డ్ సైన్స్ యూనివర్సిటీకి పని గట్టుకొని వరల్డ్ హెవెన్ అనే ఊరువెళ్ళాడు.

యూనివర్సిటీకి వెళ్ళి సత్యాన్ని కలుసుకుందామనుకుంటే సత్యం లాబ్ మేనేజర్ 'ఎవరడిగినా వారంవరకూ తనని కలవడం కుదరదని సత్యం ఆర్డర్స్' అని చెప్పాడు.

సెక్రటరీని బతిమాలాడు.

సెక్రటరీ "చాలా బిజీగా ఉన్నారు. మీరు పైదేశంనుంచి అదీ సత్యం ఊరునుంచి వచ్చానంటున్నారు కాబట్టి ఇంటి నెంబర్ ఇస్తాను. ఒకోప్పుడు ఇంటికి వెళ్ళకుండా ఛాంబర్స్‌లోనే ఉండిపోతున్నారు. ప్రయత్నించి చూడ"మని ఇంటి ఫోన్ నెంబర్ ఇచ్చింది.

కోలా హోటల్‌రూంకి చేరుకొని ఆగలేక సత్యంకి ఫోన్ చేసి ఓ రికార్డెడ్ మెసేజ్ అయినా ఇద్దామని ఫోన్ చేశాడు.

కోలా ఆశ్చర్యపోయేలా ఓ విదేశీ స్త్రీ ఫోను ఎత్తి హలో చెప్పింది. సత్యం ఇంటికి ఎప్పుడొస్తాడని, తను ఇండియానుంచి తమ యూనివర్సిటీ తరపున వచ్చానని తనని తను పరిచయం చేసుకున్నాడు కోలా.

"ఈరోజు రాత్రి తొమ్మిది తర్వాత ఇంటికి రావచ్చు. మీరు ఫోన్ చేసినట్టు చెబుతా"నంది.

కోలా రాత్రి భోజనం చేస్తూ ఆలోచనలో పడ్డాడు.

సత్యం ఎదురుపడితే నువ్వు వస్తావా? రావా? రాకపోతే రాజీనామా ఇచ్చెయి. ఆ లెటర్ తీసుకుపోతాను అనగలడా? అలా అడగాలని తనకి తహతహగా ఉంది.

అయినా సత్యం ఏం చేస్తాడు. తనని అందరూ ఊయలలో కూర్చోపెట్టి ఊపు తుంటే ఊగుతున్నాడు.

యూనివర్సిటీ అధికారులు ఎందుకు చెప్పరు? నీ శెలవయిపోయింది. వస్తేరా లేకపోతే మరొకరిని నీ స్థానంలో పెట్టుకొం టామని. అత్యధిక జనాభాగల దేశంకదా! మనిషే కరువయ్యాడా? గ్రేట్ ఇంటలెక్చ్యు వల్ సత్యంకిచ్చే అవకాశం ఆమాత్రం ఎవ రికిచ్చినా సత్యంని అందుకోలేకపోరు.

'పాపం సత్యం! తను ఇంతో అంతో ప్రజ్ఞ గలవాడిగా గుర్తించే ప్రొఫెసరయ్యేందుకు సహాయపడ్డాడు. తన పద్ధతి తను చూసు కునే ఈ రోజుల్లో ఈమాత్రం సహాయం చేసేవాళ్ళు అరుదే' అని కోలా తర్కించుకు న్నాడు.

సత్యంని కలుసుకునే ముందు ఆ విదేశీ స్త్రీ ఎవరో, తెలుసుకుని, ఆవిడద్వారా సత్యం భవిష్యత్‌లో ఏం చేద్దామనుకుంటున్నాడో రాబట్టవచ్చునుకొని ఆ రాత్రి సత్యంకి ఫోన్ చేయలేదు. సత్యం ఆ రాత్రి ఇంటికి రాలేదు.

మర్నాడు ఫోన్‌ద్వారా టెలిఫోన్ డైరక్టరీ నుంచి సత్యం ఎడ్రస్ నోట్ చేసుకొని మళ్ళీ ఓసారి సత్యం ఇంటికి ఫోన్ చేశాడు. మళ్ళీ అదే గొంతు. ఆ మనిషెవరో తెలుసుకోవా లని కోలాకి గొప్ప కుతూహలంగా ఉంది. ఫోన్ డిస్‌కనెక్ట్ చేశాడు.

కోలా రాత్రి డ్రింక్స్ తాగాడు. పొద్దున్నే తొందరగా మెళకువ రాలేదు. లేచేసరికే తొమ్మిదైంది. రెడీ అయి సరాసరి ఇంటికి వెళ్ళి వద్దామనుకుని బయలుదేరాడు.

కేబ్‌ని పిలిచి సత్యం ఇంటి ఎడ్రస్ చెప్పి అక్కడికి తీసుకువెళ్ళమన్నాడు. సత్యం ఇంటి కాంప్లెక్స్ ముందు కాబ్ ఆగింది. వెయిట్ చెయ్యమని డ్రైవర్‌కి చెప్పి కోలా అపార్ట్‌మెంట్ బిల్డింగ్‌లోకి వెళ్ళి సత్యం డోర్‌బెల్ రింగ్ చేశాడు.

తలుపు తెరుచుకుంది. విదేశీ స్త్రీ కోలాని చూసి ఎవరా? అనుకుందేమో. పచ్చని మొహంలో రంగులు మారాయి. అది ఫోన్ కూడా చెయ్యకుండా సరాసరి ఇంటికి వచ్చిన ఆగంతకుడిని చూశా? లేక ఈ ఇండియన్ సత్యం ఇంటికి రావడంలో పరమార్థమే మిటా? అనో తెలుసుకోవడం కష్టం.

కోలా తనను తను పరిచయం చేసుకు న్నాడు. "ఇండియానుంచి వచ్చాను. రేపే వెళ్ళిపోవాలి. ఎక్కువ టైంలేదు. మీరు సత్యం సెక్రటరీనా? " అనడిగాడు.

"ఆ... నాపేరు లూసీ. నేను సెక్రటరీని కాను. సత్యంకి ఫోన్ చెయ్యనా?. లాబ్స్‌లో ఉంటాడు. లోనికి రండి" అంది.

లూసీ లోపలికి వెళ్లి సాఫ్ట్ డ్రింక్ తెచ్చే లోగా కోలా మనసు గెంతులేస్తోంది. సత్యం రాకపోవచ్చు పెళ్లయింది కానీ ఆ తర్వాత వివరాలు ఎక్కువ తెలియవు. ఆమధ్య ఎవరో అన్నారు, "సత్యం భార్య ఇక్కడే ఉంది. తండ్రి కట్టించిన మల్టీ స్పెషాలిటీస్ హాస్పిటల్ చూసుకుంటోం దని. మరి ఈ స్త్రీ? సత్యం ఇహ ఇండియా రాకపోవచ్చు" అనుకున్నాడు.

లూసీ డ్రింక్ ఇచ్చింది.

కోలా "మీతో ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి" అన్నాడు.

"నాతోనా? నాతో మాట్లాడడానికేముం టుంది?

"నేను మీతో మాట్లాడాక సత్యంకి చెబు దురుగాని"

"సరే చెప్పండి"

"ఇంట్లో కాదు" కోలాకెందుకో సత్యం ఇంట్లో సత్యంని కలుసుకోకుండా మాట్లా డడం అసౌకర్యంగా ఉంది.

"మరెక్కడ? "

"బయట కలుద్దాం" అన్నాడు.

"సరే నాలుగు గంటలకి వరల్డ్ ఆర్ట్స్ మ్యూజియం దగ్గరకు రండి.. అక్కడ మెయిన్ బిల్డింగ్ ఎదురుగా లాన్స్‌లో

కూర్చుని ఉండండి వస్తాను" అందామె.

★ ★ ★

ముక్తని చూడ్డానికి ముక్త తండ్రి గురునాథం వచ్చాడు. ముక్త మొహంలో ఏదో తీరని వేదన కనిపించిందతనికి. పచ్చని మేనిఛాయ మూలంగా ముక్త కళ్ళకింద నల్లనిచారలు మరింత విశదంగా కనిపిస్తున్నాయి.

తరచి తరచి అడిగాడు,

"ముక్తా ఏదోలా ఉన్నావు. వర్క్ ఎలా జరుగుతోంద"ని.

"బాగానే జరుగుతోంది" అందిముక్త. ఆ మాటల్లో బరువులేదనిపించింది గురునాథానికి.

"సాయంకాలం అరవింద్‌నగర్‌లో నా పినతండ్రి కూతురుంది. తులసి అని చెబుతుంటానే. నీకు వరసకు అత్త అవుతుంది. చూడ్డానికి వెళదాం" అన్నాడు.

"నేనెందుకు? "

"అదేమిటి. అలా అంటావు. అయినవాళ్ళ ఇళ్ళకి అప్పుడప్పుడు వెళ్ళకపోతే బంధుత్వాలు మిగలవు. ఆమధ్యన ఓ. పెళ్ళిలో కలిశాం. నువ్విక్కడ చదువుతున్నట్టు చెప్పాను. తన భర్త కూడా ఇదే యూనివర్సిటీలో ఫారిన్ లాంగ్వేజెస్‌లో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నట్టు చెప్పింది. ఇదివరకు నార్త్‌లో పనిచేసేవాడుట. ఎడ్రస్, ఫోన్ నెంబర్ ఇచ్చి రమ్మని చెప్పింది. మీ అమ్మ సంగతి నీకు తెలియనిదేముంది. పెళ్ళికున్న పిల్ల నలుగురి కళ్ళలో పడితే సంబంధాలు తెలుస్తాయంటుంది" అన్నాడు.

ముక్త మాట్లాడలేదు. ఆ వయసులో చదువుకునే పిల్లలకి బంధువుల ఇళ్ళకి వెళ్ళాలని సరదా ఏముంటుంది.

ముక్త ఆలోచనలో పడింది. తనకి సంతృప్తిగా ఏ పనీ జరగడంలేదు. కనీసం తనని చూడ్డానికి వచ్చిన తండ్రినైనా సంతోషపెడదామనుకుని ఇష్టం లేకపోయినా బయలుదేరింది.

బజారులో ఆగి పళ్ళు, స్వీట్స్ తీసుకున్నారు. అందమైన ఆవరణలో అంతకన్నా అందమైన ఇల్లు. కాలింగ్‌బెల్ మోగగానే తలుపు తీసింది ఓ మధ్యవయసు స్త్రీ. కుడి చేతినిండా పిండి అతుక్కుని ఉంది. మొహమంతా చెమటతో జుట్టు నుదిటికి అతుక్కుని ఉంది. ఆకర్షణ కలిగించే నవ్వు.

"రా అన్నయ్యా!" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించింది. "ముక్తేనా! ఏ పదిహేనేళ్ళయిందో చూసి ఎంత మారిపోయింది" అంటూ సోఫా దగ్గరకు తీసుకువెళ్ళి కూర్చోపెట్టింది.

డైనింగ్ టేబుల్ దగ్గర అప్పటికే టిఫిన్ ముగించి కాఫీ కప్పు ఓ చేత్తో పట్టుకొని పేపర్ తిరగేస్తున్న ఓ పురుషుడి మొహం సరిగా కనిపించడంలేదు డ్రాయింగ్ రూంలో కూర్చొన్న ముక్తకి, గురునాథానికి.

తులసి లోపలికి వెళ్ళి రెండు గ్లాసులలో మంచినీళ్ళు తీసుకువస్తూ ఓ అరవై సంవత్సరాలు పైబడ్డ స్త్రీని కూడా వెంటబెట్టుకు వచ్చింది.

ఎర్రంచు బోర్డరు ఉన్న తెల్లటి గ్లాస్కో చీర, తెల్లని జాకెట్టు, కళ్ళద్దాలు, ఆవిడ అనుభవాలకి నిదర్శనమా అన్నట్టు పూర్తిగా నెరిసిన జుత్తు, చూడగానే ప్రశాంతత ఉట్టిపడే ఆ మొహానికి వాత్సల్యంతో పలకరించే కళ్ళు అదనపు అకర్షణ. ఆవిడే తులసి మేనత్త, అత్తగారు కూడా.

తులసి అత్తగారు సుందరమ్మ ముక్తని, గురునాథాన్ని పలకరించి ముక్తని చదువుకి సంబంధించిన ప్రశ్నలు వేసి గురునాథంతో మాటలలోకి దిగింది. టేబిల్‌మీద ఉన్న 'ఇండియాటుడే' తిరగేస్తూ కూర్చొంది ముక్త.

తులసి టేబుల్ దగ్గరున్న వ్యక్తితో ఏదో చెప్పింది. అతనేదో గొణుక్కుంటూ లోపలికి వెళ్ళాడు. కాసేపటికి షూస్ విసిరిన చప్పుడు ఏదో సణుగుడు 'షూస్ పాలిష్ చేయించి ఉంచాలని తెలీదా?' అంటూ హాల్లోకి

# ఏరిన ముత్యాలు

★ సత్యస్వరూపునిగా కనిపిస్తూ, అసత్యాన్ని తొలుదొల్త ఆచరణలో పెట్టినవాడు సైతాను.

–మిల్టన్

★ కష్టనష్టాలు ఎన్నింటినో తనలో ఇముడ్చుకుని వున్న బలహీనత సోమరితనం.

–రిక్టర్

★ అబద్ధం చెప్పిన వ్యక్తికి మంచి జ్ఞాపకశక్తి వుండటం ఎంతైనా అవసరం.

–కార్నీల్

★ నిరర్థకమైన జీవితం కేవలం అకాలమరణం వంటిది మాత్రమే.

–గెరే

★ మతంలో దానధర్మాలు చేయడంలాగే, యుద్ధంలో విజయం సాధించడం మూలంగా పాపాలెన్నో కప్పిపెట్టుకోవచ్చు

–నేపియర్

★ యుద్ధాలవల్ల యుద్ధాలు అంతంకావని ఇప్పుడు నేను తెలుసుకున్నాను.

– హెన్రీఫోర్డ్

★ కష్టాలవలన మనస్సుకు బలం చేకూరుతుంది. కష్టపడి పనిచేయడం వలన శరీరానికి బలం చేకూరుతుంది.

– సెనేకా

★ మనం భగవంతుని సేవకులం. కష్టించి పనిచేయడమే కర్మయోగం.

–బాలగంగాధర్

★ ఏ దేశానికైనా కీర్తిప్రతిష్టలు తీసుకుని వచ్చేది ఆ దేశపు కళాకారులే కానీ, రాజకీయవేత్తలు కారు.

–జవహర్‌లాల్ నెహ్రూ

★ పనిచేయడంకన్నా పనిచేయాలన్న ఆలోచనే బద్ధకస్తులకు అలసట కలిగిస్తుంది.

–అల్బర్ట్ ప్రీ

★ మనిషి పుట్టిన ముహూర్తానికి విలువవుంది. చనిపోయిన ముహుర్తానికి విలువవుంది. రెండు ముహుర్తాలమధ్య కాలం మహత్తరమైనది. దాని విలువ గ్రహించగలవాడు వివేకవంతుడు.

–రిచ్‌మండ్

★ మీకు అవసరంలేనిది కొంటే అచిరకాలంలోనే అవసరం వున్నది అమ్మివేయవలసి వస్తుంది.

–ఫ్రాంక్లిన్

సేకరణ: పంతంగి రవీంద్రశ్రీనివాస్

వచ్చాడు. తప్పుదురా భగవంతుడా! అన్నట్టు గురునాధానికి ఓ నమస్కారం చేసి ముక్తకేసి చూసి ముక్తసరిగా 'హలో' అన్నాడు.

సుందరమ్మ గురునాధంతో "మా అబ్బాయి పవన్. చాలాకాలమైంది మీరు గుర్తుపట్టారో లేదో" అంది.

ముక్త పవన్‌ని తేరిపార చూసింది. ఎక్కడా ఆత్మవిశ్వాసం లేని ఆ మొహం, మెడలో పులిగోరు పతకమున్న గొలుసు. అక్కడ మనుషులతో మాట్లాడటానికి ఏ మాటలూ దొరకని కారణంగా నేలవేపు చూస్తున్నాడు. ఈమధ్యనే చూడ్డంవల్ల ఇదే మొహం ఎక్కడ చూశానా అనిపించింది. పేరు పవన్ గదూ! అదే అతడే ఇతడు! వరద బోయ్‌ఫ్రెండ్.

ఆశ్చర్యపోయింది ముక్త.

★ ★ ★

ముక్త తండ్రి మర్నాడు ముక్తతోపాటు లాబ్‌కి వచ్చి వేదవతిని కలుస్తానన్నాడు. ముక్తకి నిజం చెప్పక తప్పలేదు.

"నాన్నా! నేనిప్పుడు వేదవతిగారి దగ్గర పనిచెయ్యడంలేదు. కోలా అని ఇంకో ప్రొఫెసర్ ఉన్నారు. ఆయన దగ్గర పనిచేస్తున్నాను"

"ఏం ఎందుకు? వేదవతిగారి దగ్గర నుంచి ఇంకో ప్రొఫెసర్ దగ్గరకి ఎందుకు మారావు? "

"అదో పెద్ద గాథ నాన్నా? నీకు కట్టె, కొట్టె, తెచ్చె అంటే అర్థం అవదు. సత్యం గారు త్వరలోనే వచ్చేస్తారని అంటున్నారు. ఆయన రాగానే ఆయన దగ్గరకి మారిపోతాను. నా పేరు ఎవరి దగ్గరా రిజిష్టర్ కాలేదు. అందుకని మారడానికి అవకాశం ఉంది"

"ఏమిటో ఇప్పటికి రిసెర్చి ఏం చెయ్యాలో ఎవరి దగ్గర చెయ్యాలో నిర్ణయం కాలేదు. నీకు డిగ్రీ వచ్చేసరికి ఎంతకాలమవుతుందో ఊహించుకోలేకపోతున్నాను. ఇప్పటికైనా మించిపోయింది లేదు. మీ అమ్మ పెళ్లి సంబంధాలు చూడాలని తొందరపెడుతోంది. ఇంటికి వచ్చేయమని నీకు చెప్పమంది"

"వచ్చేస్తానేమో నాన్నా! ఒక్క రెండు నెలలు ఓపిక పట్టాలి మీరు, నేను కూడా. సత్యం రాకపోతే వచ్చేస్తా"నంది.

తండ్రి ఇంకేం మాట్లాడలేదు. మాట్లాడి చెయ్యగలిగేదీ లేదు. ఆరోజు సాయంకాలమే తిరిగి వెళ్లిపోయాడు.

★ ★ ★

గ్రీన్‌కార్డు ఉన్న సత్యం అమెరికాలో తనకి నచ్చిన పరిశోధన చేసుకొంటూ ఇండియా నించి త్వరగా రమ్మనే ప్రాధేయపూర్వక సందేశాలకు వీలయినప్పుడు త్వరలో వస్తానని సమాధానం ఇస్తూ ఇండియాలోని విద్యార్థులచేత పరిశోధనలు అమెరికానించే చేయిస్తున్నాడు.

ఆమధ్య ఇది సరైన పద్ధతి కాదని కోలా తోటివారితో అంటే అలాగ కూడా రిసెర్చి చెయ్యవచ్చునని సత్యం నిరూపిస్తున్నాడన్నారు వారు.

"ఇలా ఏ యూనివర్సిటీ అయినా ఒప్పుకొంటుందా? " అని కోలా ప్రశ్నిస్తే, కొందరికి ఆ సమర్థత ఉంటుంది. వాళ్లకో అవకాశం ఇవ్వడం తప్పులేదంటారు.

రాముడు, కృష్ణుడు లాంటి యుగపురుషులు లేరా? అలాగే సత్యం యూనివర్సిటీ పురుషుడనుకో. పుట్టుకతోనే అదృష్టవంతులు కొందరుంటారని ఊరుకో. అంటూ కోలాని అతని మిత్రబృందం అప్పుడప్పుడు సమాధానపరుస్తుంటారు.

సత్యం లాబ్‌లో అసిస్టెంటుగా పనిచేసే లూసీ అతని ఏకాగ్రతకి అబ్బురపడేది. అమెరికాలో పుట్టి పెరిగి రాణించడానికి ఎన్నో అవకాశాలున్నా వినియోగించుకోని తనలాంటి వాళ్లని తలచుకొని కించపడేది. కోర్సులలో చేరవచ్చుకాని ఏకాగ్రత ఎక్కడ

నించి తేవాలి? అదెలా సాధించాలి? అను కొనేది.

ఓసారి ఓ మిషన్ ఆన్‌చేసి వెళ్లేటప్పుడు ఆఫ్ చేసిందో లేదో గుర్తులేక రాత్రి ఎందు కేనా మంచిది ఓసారి చెక్ చేద్దామని లాబ్‌కి వచ్చింది. సత్యం ఏవో పరికరాలతో అవస్థ పడుతున్నాడు. టేబుల్‌నిండా కాగి తాల మీద ఏదో రాస్తున్నాడు. చూసేవాళ్ల కళ్లకి రోజంతా అసలేమైనా తాగేడా? తిన్నాడా? అనే ప్రశ్నలు ఉదయించక మానవు. ఎ.సి.రూంలో ఉన్నా మెంటల్ ఎక్సర్‌సైజ్‌తో అలసిపోయిన అతని మొహం చూస్తే అది మాతృప్రేమో, భాతృ ప్రేమో, ప్రేయసి ప్రేమో, మానవతా సంబంధమైన ప్రేమో లేక వీటన్నిటినీ మించిన అతీతమైన ప్రేమో చెప్పడం కష్టం. ఆ సమయంలో అలాటి ప్రేమేదో లూసీలో కట్టలు తెగి ప్రవహించింది.

లూసీ తన పని చూసుకొని ఎలివేటర్‌లో కిందకి వెళ్లి ఇరవై నాలుగు గంటలు తెరి చివుండే చిన్న రెస్టారెంట్‌లో సాండ్‌విచెస్, మిల్క్ షేక్, ఫ్రూట్‌సలాడ్ తీసుకు వచ్చింది. పేపర్ ప్లేట్లో అన్నీ అమర్చి నేప్ కిన్ పెట్టి చల్లటి నీరు తెచ్చి సత్యం దగ్గరకి వెళ్లి "ప్రొఫెసర్ డిస్టర్బ్ చేసి పని పాడుచే స్తున్నందుకు క్షమించండి. తిండీ నిద్రాలే కుండా రిజల్ట్సు వచ్చేవరకూ ఇలా రోజులు గడిపేస్తుంటే మీ ఆరోగ్యం ఏం కావాలి? మీకు తినడం కోసం తెచ్చినవి టేబుల్ మీద అమర్చాను రండి" అంటూ సత్యాని తనతో తీసుకు వెళ్లింది.

లూసీ మాటలతో బయట ప్రపంచంలోకి వచ్చిన సత్యం లూసీ వెంట వెళ్లి మాట్లాడ కుండా అన్నీ తిని తాగి థాంక్స్ చెప్పాడు.

తన భోజనానికి ఎంతయిందో పే చేస్తా నన్నాడు. లూసీ అక్కర లేదంది. సత్యం జేబులోంచి పర్స్ తీశాడు. అందులో ఏమంత డబ్బు లేదు. చిల్లర తప్ప. తర్వాత ఇస్తాలే అన్నాడు.

లూసీకి, సత్యంకి మధ్య తెలీని అను బంధం రోజురోజుకి పెరుగుతోంది. దీనికి సత్యం ఎంతవరకు బాధ్యుడు? అంటే చెప్పడం కష్టం. చిన్నప్పటినుంచి డబ్బులో పుట్టి డబ్బులో పెరిగాడు. ఇంటి పనులు, వంటపనులు ఇతర బాధ్యతలు ఏనాడూ పట్టించుకోలేదు. డబ్బు సంపాదించాలి, నిలవ చెయ్యాలనే ధ్యాసలేదు. అవసరం లేదు. పెళ్లయ్యేక భార్యతో కలసి ఉన్నదీ తక్కువ. ఆ కొద్దిరోజులు కూడా ఎవరి బిజీలో వాళ్లు ఉంటే మిగతా పనులన్నీ పని వాళ్లతో జరిగిపోయేవి.

ఎక్స్పర్‌మెంట్స్ చేస్తున్నా, పుస్తకాలు చదు వుతున్నా సత్యం ప్రవర్తన సమాధిలోకి వెళ్లిన ఋషిపుంగవుడి ప్రవర్తనకేమాత్రం తీసిపోదు. భారతదేశంలోని తన యూనివ ర్సిటీ వాళ్లకి సమాధానం ఇవ్వవలసివచ్చినా వీలుంటేనే ఇ.మెయిల్ ఇస్తున్నాడు. లేకుంటే లేదు. అంతగా అయితే వాళ్లే మరో కళ్లని చూసుకొంటారు అన్నట్టు ఊరుకొం టున్నాడు.

లూసీకి ఇంతకుముందు మూడు పెళ్లిళ్లు అయ్యాయి. ఎప్పటికప్పుడే జీవితంలో స్థిర పడ్డాను అనుకొనేసరికల్లా విడిపోవలసిన పరిస్థితులు చుట్టుముట్టేవి. పెళ్లి చేసుకొన్న ప్పుడల్లా హమ్మయ్య జీవితంలో విసిగిపో యాను, అలసిపోయాను నాకో తోడు దొరి కింది. సంపాదించే మంచి భర్త, సంసారం, ఇల్లు, పిల్లలు, ఇంటిముందు పూలతోట గార్డెన్‌లో పిల్లలతో తను, తన భర్త, ఆటలు, తన మిత్రులతో పార్టీలు, తనకెంతో ఇష్టమైన పురాతన వస్తు సేకరణ, జీవితం ఆనందసాగరం. ఎంతహాయి ఇంక ఉద్యోగం చెయ్యక్కరలేదు. తెల్లారిలేచి ఐదు రోజులు నడుమువంచకుండా పనిచెయ్యక్క రలేదు. కృత్రిమమైన చిర్నవ్వులు చిందించ క్కరలేదు అనుకొనేది.

పెళ్లి కాగానే ఉద్యోగం వదిలేసేది. మూడు నెలలు ముచ్చటగా జరగడం గగన

మయ్యేది. తగాదాలు, సమస్యలు, మానసిక సంక్షోభం, ఈ పెళ్లి అనే బంధంలోంచి బయటపడి మామూలుగా బతికితేచాలు అని విడాకులిచ్చి ఉద్యోగంలో చేరేది. ఎప్పటికైనా తన జీవితం మారుతుందేమోననే ఆశ ఇంకా చావలేదు.

లూసీకి జ్ఞానం వచ్చినప్పటినుంచి జీవితం చిందరవందరగా నడిచింది. తల్లికి నాలుగు పెళ్లిళ్లు. మదర్స్‌డే నాడు తప్ప ఆవిడ దగ్గరకి వెళ్లడం కుదిరేది కాదు. కొన్నాళ్లకి తల్లి ఎక్కడుందో మదర్స్‌డే నాడు కార్డు పంపడానికి కూడా అడ్రసు దొరక లేదు.

అనాథ ఆశ్రమం లాంటి ఫామిలీ ఏజెన్సీ ల్ద్వారా చిన్నతనం గడిచింది. ఆరేళ్లు వచ్చినప్పటినించీ ఏదో ఓ పని చేస్తూనే ఉంది. ఒక్కొక్క కుటుంబంవాళ్లు రెండేసి సంవత్సరాలు దగ్గరపెట్టుకొని పెంచారు. ఏజెన్సీ వాళ్లిచ్చే డబ్బుతో లూసీని పోషించేవారు. తల్లితండ్రుల నీడ లూసీకేకాదు మిగిలిన అక్కచెల్లెళ్లకీ లేదు. ఎవరు ఎక్కడున్నారో కూడా తెలియదు.

మూడోసారి పెళ్లి విఫలమయ్యేక సత్యం లాబ్‌లో చిన్న ఉద్యోగం దొరికితే రోజులు వెళ్లమారుస్తోంది. సత్యంలోని అకుంఠితదీక్షకి, ఆకర్షింపబడి తనకి చేతనైన సాయం చేద్దామని అనుకొంటే అనుకొన్న దానికంటే నాలుగురెట్లు బాధ్యత పడిపోయింది లూసీ మీద.

ఓసారి సత్యంతోపాటు లూసీ అతని ఇంటికి వచ్చింది. ఓపికగా అపార్ట్‌మెంట్ అంతా శుభ్రం చేసింది. బట్టలన్నీ మార్చి లాండ్రీకి ఇచ్చి కొన్ని వాషింగ్ మెషీన్‌లో వేసి డ్రైయ్యర్‌లో ఆరబెట్టి మడత వేసి పెట్టింది. రిఫ్రిజరేటర్ శుభ్రపరచి అవసరమైనవి తెచ్చి అందులో అమర్చింది. సత్యం డబ్బు ఎంత కావాలని అడిగి అడిగినంత ఇచ్చేశాడు.

"ప్రొఫెసర్! మీరు డూప్లికేట్ కీ ఇస్తే నాకు వీలున్నప్పుడు వచ్చి మీకు సహాయపడతానంది. సత్యం ఇచ్చాడు. ఆ తర్వాత సత్యంకి రోజులు సులువుగా గడిచిపోసాగాయి. లాబ్‌లో పని తప్ప మిగిలినవన్నీ లూసీ చేసుకుపోతోంది. లావాదేవీలకు సులువుగా ఉంటుందని ఎకౌంట్ జాయింట్ చేశాడు. లూసీ కొద్ది రోజులకే ఉద్యోగం మానేసింది. ఓ రోజు సూట్‌కేసుతో సత్యం ఇంటికి వచ్చేసింది. ఎవరిని ఎవరూ పట్టించుకోని ఆ సంఘంలో లూసీ రాక ఎవరికీ పట్టలేదు.

ఓ రోజు సత్యం మంచి రిజల్ట్సు వచ్చాయి అని సంతోషంగా లూసీతో చెప్పినప్పుడు లూసీ ఆ సంతోషాన్ని సత్యంతో పంచుకొన్న విధానం అతన్ని ఆలోచనలో పడేసింది. లూసీ తనని ఊపిరాడ నివ్వకుండా చుట్టుముట్టిందని గ్రహించాడు తను లూసీని పార్టనర్‌గా అంగీకరించగలడా? నెవ్వర్!

ఒక కేర్ టేకర్‌గానా!

నోనో!

మరి లూసీ ఎవరు? సత్యం అంతరాత్మ ప్రశ్నిస్తోంది. ఇదే ప్రశ్న పరిశోధనతో సమాంతరంగా సత్యంని ఆలోచనలో పడేస్తోంది.

★ ★ ★

లూసీ కోలాని కలుసుకొనేందుకు ముందు బ్యూటీపార్లర్‌కి వెళ్లి చక్కగా మేకప్ చేయించుకొంది. తనకి నచ్చిన స్కర్ట్ బ్లౌజ్ ఎంపిక చేసుకొని వేసుకొంది. కోలా సత్యంకి తెలుసున్నవాడు. తనకి ఏం చెబుదాం అనుకొంటున్నాడో అని మనసు ఆరాటపడుతోంది.

సత్యంకోసం రాత్రి డిన్నర్‌కి అన్నీ సిద్ధం చేసి మైక్రోవేవ్ ఓవెన్ ముందు పెట్టింది. సత్యం ఓ నిమిషం వేడిచేసుకొని తినాలి. ఆ పని చేస్తాడా? అని లూసీ అనుమానం. 'పనిమీద వెళుతున్నాను కొంచెం ఆలస్యం కావచ్చని' కిచన్‌లో ఉన్న బ్లాక్‌బోర్డు మీద

రాసింది. అది కూడా చూస్తాడన్న నమ్మకం లేదనుకొంటూ బయలుదేరింది.

సాయంకాలం అయిదు గంటలకి వరల్డ్ ఆర్ట్స్ మ్యూజియం చేరుకొంది. నాలుగున్న రకే కోలా అక్కడికి చేరుకొని పచార్లు చేస్తు న్నాడు. లూసీ కారు దిగగానే అటు వైపు నడిచి వెళ్లి విష్ చేశాడు. ఇద్దరూ లాన్‌లో కూర్చున్నారు.

"కోలా! మీరు నాతో ఏదో ప్రత్యేకంగా మాట్లాడడానికి నన్ను రమ్మన్నారనుకొం టాను"

"అవును నా రిక్వెస్టుని మన్నించి వచ్చి నందుకు ముందుగా మీకు థాంక్స్. సత్యం, నేను ఒకే యూనివర్శిటీలో పని చేస్తున్నాం. అతను మేధావి. నలుగురూ మెచ్చుకొనే శాస్త్రజ్ఞుడు. నాకు మిత్రుడు. తను చేయగలిగిన సహాయం నాకు చేశా డని చెప్పగలను. సత్యంకి యూనివర్శిటీలో కోట్లు విలువైన లాబ్స్ కట్టించి ఇచ్చారు. ఓ ఏడాది అక్కడున్నాడేమో అంతే. మా దేశంలో వ్యక్తి ఆరాధన ఎక్కువ. ఓ మనిషి గొప్పవాడంటే ఇక అతడినే అన్నిటికీ పెద్దని చేస్తారు. సత్యం వస్తాడోరాడో ఏదో ఒక నిర్ణయం తీసుకొంటే బాగుంటుంది. లాబ్స్‌లో పరికరాలు వాడుకలో లేక పాడ వుతున్నాయి. నేను సత్యంని కలిసి వస్తాడో రాడో తెల్సుకొందామనే వచ్చాను. అతనికి పెళ్లయింది. భార్య అక్కడే ఉంది"

లూసీ ముఖ కవళికలు మారాయి. "ఇప్పుడే వస్తా!" అని లేచింది.

ఆలోచనల బరువును మోసుకుంటూ ముందుకు నడిచి మెషీన్‌లో డబ్బులు వేసి రెండు కోకోకోలాలని తీసుకొంది.

లూసీకి సత్యంతో జీవితం పంచుకోవా లనే ఉద్దేశ్యం ఉంది. సత్యం లూసీ గత జీవితం గురించి ఎప్పుడూ ప్రశ్నించలేదు.

లూసీ తన గత జీవితం గురించి చెప్పు కోవలసినదీ, తలచుకోవలసినదీ లేదను కొంది. అందుకే సత్యం గురించి తెలుసుకో వాలనుకోలేదు తను చెప్పదలచుకోలేదు కాబట్టి. అతను శాస్త్రవేత్త. బాగా సంపాది స్తున్నాడు. అతడికి ఇల్లు తీర్చిదిద్ది అన్నీ సమయానికి అమర్చుతోంది. తనని గౌర వంగా చూస్తున్నాడు. ఇలా జీవితం వెళ్లిపో యినా చాలనుకొంది అంతే!

కోలా దగ్గరకు చేరుకొని ఓ గ్లాసు అతనికి అందించింది.

"సత్యంకి ఉద్యోగం ఇచ్చినట్టున్న అపా యింట్‌మెంట్ లెటర్ దొరుకుతుందా?" అని కోలా అడిగాడు.

"సారీ కోలా! నేనిలాటి విషయాలు పట్టిం చుకోదలచుకోలేదు. సత్యంకి దగ్గరవడానికి ప్రయత్నించి దగ్గరయ్యేనని నిస్సందేహంగా చెప్పగలను. అతని స్వవిషయాలు ఏవీ నాకు తెలియవు. ఈ రోజు మీ ద్వారా అత నికి పెళ్లయిందని తెలిసింది. నేను తెలీన ట్టుగా ఉండిపోవచ్చు కాని నేనలా చేయద లచుకోలేదు. మరి నేను వెళతాను. మిమ్మల్ని ఎక్కడైనా దింపాలా?"

"థాంక్స్ నేను హోటల్ సీపెరల్ దగ్గర దిగిపోతా" నన్నాడు.

ఇద్దరూ కారులో కూర్చొన్నారు. లూసీ డ్రైవ్ చేస్తోంది. లూసీ లేత నీలిరంగు స్కర్ట్‌మీద నేవీ బ్లూ స్లీవ్‌లెస్ బ్లౌజ్ వేసు కొంది. నేవీ బ్లూకలర్ చేతులులేని బ్లౌజ్ ఆమె భుజాల పచ్చదనాన్ని మరింత చాటి చెబుతోంది.

కోలా కంట్రోల్ తప్పాడు. మనసు ఈల వేసింది. నెమ్మదిగా లూసీ భుజంమీద చేయివేశాడు కోలా. కారు సడన్ బ్రేక్‌తో ఆగడం, కోలా చెంప ఛెళ్లుమనడం ఈ రెండింటిలో ఏది ముందు జరిగిందో తెలు సుకోవడం కష్టం.

"మిష్టర్ కోలా! గెటవుట్ ఫస్ట్! యూ నేరోమైండెడ్ ఇండియన్స్! స్త్రీలకి అత్యంత విలువ ఇచ్చే దేశం అంటూ పొగుడుకొం టారే. ఇదా మీకు ఆడదంటే ఉన్న విలువ? తల్లిప్రేమ, సోదరి ప్రేమ, భార్యప్రేమ,

కూతురిప్రేమ, సహనశీలి, త్యాగమూర్తి అంటూ స్త్రీలని పొగుడుతూ మీ పబ్బం గడుపుకొంటున్నారు. మీ దేశంలో స్త్రీలు ఈ సంగతి ఎంత తొందరగా గ్రహిస్తే అంత మంచిది.

"స్త్రీలు బానిసల్లా బతికే మీ దేశంలో పురుషుణ్ణి పొగడడానికి కూడా స్త్రీలకి టైం లేదు. వాళ్లని బానిస చాకిరీనించి విముక్తి కలిగించి చూడండి, అప్పుడు మీరెంత గొప్ప తండ్రులో, కొడుకులో, భర్తలో, సోదరులో అర్థమవుతుంది. స్త్రీలు పవిత్రంగా ఉండాలని పాతివ్రత్యం బోధిస్తూ కావ్యాలు రాస్తారు. ఆడది ఒంటరిగా కనిపిస్తే ఒళ్లు మరచి ప్రవర్తించే మీకు గడ్డురోజులు ముందున్నాయి. జాగ్రత్త! ఏదో ఫారినర్‌వని క్షమిస్తున్నాను. తలచుకొంటే జైలులో పెట్టించగలను.

"కావ్ ఎక్కడ కనిపిస్తే అక్కడ నా కారు ఆగుతుంది దిగి 'థాంక్యూ వెరీమచ్' అని చెప్పి మరీ పో. లేదా కారు సరాసరి కావ్ దగ్గరకే పోతుంది" అంది లూసీ శివమెత్తిన దుర్గలా.

"కారు దిగుతా" కారులో చల్లగా ఉన్నా ఒళ్లంతా చెమటలు పట్టాయి కోలాకి. సారీ అనే మాట కూడా రావడంలేదు.

"ఎందుకు? "

"వెనక సీట్లో కూర్చొంటా సారీ" అంటూ వెనక సీట్లో ఎక్కబోయాడు.

"వాట్ నాన్‌సెన్స్! ముందే కూర్చో నేనేం నీ డ్రైవర్‌ని అనుకొన్నావా? " ఆజ్ఞాపించింది లూసీ.

కిక్కురుమనకుండా కూర్చొన్నాడు కోలా.

★ ★ ★

కోలాతో మాట్లాడి ఇంటికి వచ్చిన లూసీకి మనసంతా వెలితిగా అనిపించింది. తనకెవరూ లేరనిపించింది. ఓ డ్రింక్ తీసుకొంది. సత్యం ఏదో జర్నల్ చదువుకొంటున్నాడు. అతన్ని ఏవిధంగానూ డిస్టర్బ్ చెయ్యదలుచుకోలేదు.

మర్నాడు ఏం జరగనట్టుగా సత్యం వెళ్లిపోగానే తన సామాను సర్దుకొంది. బ్యాంక్‌కి వెళ్లి మినిమమ్ బ్యాలెన్స్ ఉంచి మిగిలిన డబ్బంతా డ్రా చేసుకుంది. సామాను కారులో పెట్టుకొంది.

"థాంక్స్ ఫర్ ఎవ్విరిథింగ్. నీలాంటి వ్యక్తితో కొంతకాలం కలసి ఉండడం, నా అదృష్టం. నిన్ను ఎప్పటికీ ఆరాధిస్తాను" అని రాసిన కాగితం మీద ఓ గులాబీ పూవు ఉంచి సత్యం రీడింగ్ టేబుల్ మీద పెట్టింది.

సత్యం రాత్రి ఇంటికి వచ్చాక లూసీ పెట్టిన కాగితం చదువుకొన్నాడు. "లూసీ వెళ్లిపోయిందన్న మాట" అనుకొన్నాడు. పక్కనే ఉన్న బ్యాంక్ పాస్‌బుక్ చూశాడు. బాలెన్స్ లేదు. అవును లూసీకి డబ్బు కావాలి కదా మళ్లీ జాబ్ దొరికేవరకు అనుకొన్నాడు. లూసీ అంత సడన్‌గా, చెప్పకుండా ఎందుకు వెళ్లిపోయిందో అతనికి అంతుపట్టలేదు.

సత్యం ఆలోచిస్తున్నాడు. అవును లూసీ మంచితనంతో, సేవా తత్పరతతో, తనకి ఏవిధంగానూ కష్టం కలిగించకుండా తను పూర్తిగా ఆమెమీద ఆధారపడేలా చేసుకొంది. లూసీ తనని ఎన్నడూ ఏదీ అడగలేదు. తనకి కావలసినట్టు అమర్చి పెట్టింది. తనే ఆమెని లాబ్‌లో పరికరంలా చూశాడా?

లూసీ... లూసీ తనకెప్పటికీ కావాలి. ఆమె లేకపోతే తను? ... లూసీ తనని గెలుచుకొంది.

తన భార్య... అవును ఇండియా వెళ్లి చట్టబద్ధంగా విడాకులివ్వాలి. లూసీ ఎక్కడున్నా వెతికి పట్టుకొని ఎప్పటికీ తన దగ్గరే ఉండేలా లూసీని తనదాన్ని చేసుకోవాలి. లూసీ తనని ఎప్పటిలాగే అపురూపంగా చూసుకొంటూంటే ఇంతో అంతో మానవాళికి ఉపయోగమయ్యే పరిశోధన చెయ్యాలనుకొన్నాడు సత్యం.

మన యూనివర్సిటీకి తను ఇహ రాదల చుకోలేదనీ, ఆ లాబ్స్‌కి రణధీర్ సోనావా లాని డైరెక్టర్‌గా నియమించమని మెసేజ్ పంపాడు.

సత్యంకి ఉన్న ఒకే ఒక హాబీ స్విమ్మింగ్. హాయిగా స్విమ్ చేసి ఎన్నాళ్లయిందో అను కొంటూ స్విమ్మింగ్ పూల్‌వైపు వెళ్లాడు తేలి కైన మనసుతో



కోలా అమెరికానుంచి యూనివర్సిటీకి తిరిగివచ్చిన రెండు రోజులకే అట్లాంటా కాన్ఫరెన్స్‌లో కలసి కోలా లాబ్స్‌లో ఎక్స్పర్ మెంట్స్ చేస్తానన్న ప్రొఫెసర్ బాక్‌పాక్‌లో కొంచెం సామాను సర్దుకొని వచ్చి లాబ్‌లో పని మొదలుపెట్టాడు.

ఆ దేశంలో ఓ పని చెయ్యాలనుకొంటే ఎంతటి శ్రమకైనా వెనకాడరు. వాళ్లకున్న కార్యదీక్ష అటువంటిది. సాధించి తీరు తారు. కోలా స్టూడెంట్స్ ఎంత ప్రయత్నిం చినా కాన్ఫరెన్స్‌లో పేపర్‌లో ప్రకటించి నట్టు లెన్స్ ఏంగిల్స్ ఎన్నివిధాలుగా మార్చినా రిజల్ట్సు రాలేదు. లోటెంపరేచర్‌కి హైటెంపరేచర్‌కి మెటీరియల్‌లో మార్పే లేదు.

అమెరికా ప్రొఫెసర్ "హౌశాడ్ కోలా! మాకు రిజల్ట్సు దగ్గరుండి చూపిస్తాన న్నారు. చూపించలేక పోయేర"ని వెళ్లిపో యేడు. ఉత్తర దక్షణాదిలలో దర్శనీయ స్థలాలన్నీ దర్శించి సౌత్ ఇండియా గొప్పది అని మెచ్చుకొని మరీ వెళ్లాడు.

★ ★ ★

మాథ్స్ ఎమ్.ఎ చేస్తున్న సుమిత్రకి పరీ క్షలు దగ్గరకు వస్తుంటే భయం పట్టు కొంది. దానికి తోడు చిన్ననాటి స్నేహితు రాలి పెళ్లి ఒకటి వచ్చిపడింది. చదువుకోవ లసిన టైంలో సినిమాలకి షికార్లకి తిరు గుతూ ఇంటి దగ్గరనించి డబ్బు తెచ్చుకొని మేకప్‌కి డిజైనర్ వేర్ బట్టలకి, షికార్లకి ఖర్చు చేస్తూ మోడ్రన్‌గా కనిపించే తాపత్ర యంతో సుమిత్ర కాలం గడుపుతుంటుంది.

రోబోట్ సెంటర్‌లో సుమిత్ర ఫ్రెండ్‌తో కలసి కూల్‌డ్రింక్ తాగుతూంటే మోటార్ బైక్‌మీద రంజిత్ వచ్చాడు. రంజిత్‌కి ఓ కూల్‌డ్రింక్ ఇచ్చింది.

"థాంక్స్ సుమిత్రా! ఏంటి విశేషాలు?"

"రంజిత్! చిన్ననాటి స్నేహితురాలి పెళ్లి. ఎలా వెళ్లాలా? అని ఆలోచనగా ఉంది. ఎగ్జామ్స్ దగ్గరకి వచ్చాయి" వగలు పోతూ చెప్పింది.

"సింపుల్! పెళ్లికి వెళ్లండి ఎగ్జామ్స్ రాసే యండి"

"పెళ్లికి వెళ్లాలంటే డబ్బు కావాలి"

సుమిత్ర దగ్గర డబ్బుంది. అయినా రంజిత్ తనకోసం ఏం చెయ్యగలడో! అతన్నో టెస్ట్ పెట్టి చూడాలి. అదో సరదా!

"డబ్బు తీసుకోండి. ఇంటి దగ్గర్నుంచి రాగానే ఇచ్చేద్దురుగాని"

"ఏంటో రంజిత్! అమ్మావాళ్లు ఎంత డబ్బు పంపినా సరిపోవడంలేదు" మరో సారి వగలుపోయింది.

"ఎంతకావాలి"

"ఎంత రెండొందలు"

"ఇదిగో రెండొందలు"

"థాంక్స్.. మరి పరీక్ష పేపర్ ముందే

కావాలి"

"అలాగే" అని మళ్లీ ఏమడిగిందో అర్థమై,

"పరీక్ష పేపరా? "

"అవును రంజిత్! నువ్వు తలచుకొంటే ఏదైనా చేయగలవు. అన్నీ అక్కరలేదు. ఒక్క పేపర్ ఆల్‌జీబ్రిక్ జామెటరీ పేపర్ నెం. నాలుగు. ఆ ఒక్కటే చాలు" వయ్యారాలు ఒలకబోస్తుంటే రంజిత్ ఏదో అనేలోగా,

"ప్లీజ్" రంజిత్ పల్స్ గ్రహించిన సుమిత్ర "నువ్వు చెయ్యగలవు. ఈ చిన్న పని చెయ్యలేవా? " అంది.

"చూద్దాం" అన్నాడు రంజిత్ మొయ్యలేని బరువేమోనని ఆలోచిస్తూ.

"లేదు లేదు... నీదే ఆ బాధ్యత" అంటూ ఖాళీ కూల్‌డ్రింక్ బాటిల్స్ షాపువాడికిచ్చేసి అక్కడనించి వెళ్లిపోయింది పెళ్లి ప్రయాణానికి తయారవ్వాలనుకొంటూ.

రంజిత్ ఆ మర్నాడు పరీక్షా విభాగానికి వెళ్లి బిల్డింగ్ నాలుగు పక్కలా పరీక్షించాడు. లోపలికి వెళ్లి క్లర్క్‌తో ఫలానా వ్యక్తి తెలుసా? అని అతని వివరాలు చెబుతూ లోపల పరికరాలన్నీ క్షుణ్ణంగా గమనించాడు. లోపలికి ఎలా వెళ్లాలో ఏం చేయాలో జాగ్రత్తగా ప్లాన్ చేసుకొన్నాడు.

రంజిత్ రాత్రి మోటార్ బైక్ మీద వస్తూంటే తోవలో సాగర్ లైబ్రరీ బిల్డింగ్ నించి వస్తూ కనిపించాడు.

"సాగర్! నేనూ హాస్టల్‌కే. మధ్యలో చిన్న పని..." అంటూ లిఫ్ట్ ఆఫర్ చేశాడు.

ఎగ్జామ్స్ విభాగం బిల్డింగ్ వెనక చెట్ల దగ్గర మోటార్‌బైక్ ఆపి సాగర్‌ని అక్కడే ఉండమన్నాడు. టార్చ్ తీసుకొని బిల్డింగ్ వైపు వెళ్లాడు.

మారు తాళాల గుత్తితో మెయిన్ డోర్ తెరిచాడు. క్లర్క్‌తో మాట్లాడినప్పుడు గుర్తు పెట్టుకొన్న పరీక్ష పేపర్లుండే రూం తాళం కూడా అదే గుత్తితో తెరిచాడు. టార్చ్‌వేసి మాథ్స్‌ఫైల్‌లోంచి సుమిత్ర అడిగిన నాలుగో నెంబర్ పేపర్ ఒకటి తీశాడు. నెమ్మదిగా తాళంవేసి వెనక్కి తిరిగేసరికి వాచ్‌మెన్ టార్చిలైట్ వెలుగు రంజిత్ మొహం మీద పడేలా వేస్తూ విజిల్ వేయడంతో రంజిత్ పేపర్ కిందే పడేసి స్పీడుగా చెట్లచాటుకి పరిగెట్టాడు.

సాగర్ మోటార్ బైక్ దగ్గర నిలబడి బిల్డింగ్‌లోంచి విజిల్ రావడం విని ఏమైందోనని బిల్డింగ్ వైపు నడుస్తూంటే రంజిత్ చెట్లవైపునించి పరిగెట్టుకొంటూ బైక్ దగ్గరకు రావాలని చూస్తున్నాడు.

వాచ్‌మెన్ సాగర్ చెయ్యిపట్టుకొని బైక్ వైపు నడిపించుకొస్తూ అరుస్తుంటే సాగర్ నాకేం తెలియదు అంటూంటే వాచ్‌మెన్ బైక్ నెంబర్ నోట్ చేసుకొని ఓ చేత్తో పేపర్ పట్టుకొని సాగర్‌ని తనతోపాటు అధికారుల దగ్గరకు తీసికెళ్లాడు.

సాగర్ తనకేం తెలీదని లైబ్రరీనించి వస్తుంటే రంజిత్ రైడ్ ఆఫర్ చేసి హాస్టల్‌కి తీసుకు వెళుతుంటే మధ్యలో ఆగి రంజిత్ ఎటో వెళ్లాడని ఎన్ని విధాలుగా అడిగినా అంతకంటే తనకేం తెలీదంటూంటే అధికారులు వినిపించుకోవడం లేదు.

వాచ్‌మెన్ చేతిలో పేపర్ చూస్తే మేథ్స్ పేపర్. సాగర్ చదువుతున్నది చైనీస్ డిప్లమా. సాగర్ తన కోసంకాక మరెవరికోసమో తీసి ఉండాలి. సాగర్‌ని ప్రశ్నలతో వేధిస్తున్నారు. రంజిత్ అధికారులున్న చోటకి బైక్‌మీద వచ్చాడు.

లోపలికి వెళ్లి సాగర్‌ని లైబ్రరీనించి వస్తుంటే తనే రైడ్ ఆఫర్ చేశానని బిల్డింగ్ దగ్గర చప్పుడు వినిపిస్తే బైక్ ఆపి సాగర్‌ని అక్కడ ఉండమని ఏమైందో చూసేలోగా వాచ్‌మెన్ సాగర్‌ని పట్టుకొని బైక్ నెంబర్ నోట్ చేసుకొన్నాడని తమకేమీ తెలీదని చెప్పాడు.

స్టూడెంట్స్ అందరికీ అంచెలంచెలుగా విషయం తెలిసిపోయింది. ఆ పేపర్ ఎలా

బయటకి వచ్చిందో ఎవరు తీశారో? ఎంక్వయిరీచేసి తెలుసుకొని దోషిని పట్టుకొని శిక్షించాలని పట్టుపట్టారు. స్టూడెంట్ లీడర్ రంజిత్ కూడా వాళ్లలో కలసిపోయి దోషిని శిక్షించాలని అరుస్తోంటే సాగర్ మతిపోయిన వాడిలా నిర్లిప్తంగా చూస్తూ నిలబడ్డాడు.

★ ★ ★

రోబోట్ సెంటర్ చాలా హడావిడిగా ఉంది. "సాగర్, రంజిత్ కలసి క్వశ్చన్ పేపర్స్ అన్నీ తీసేస్తూండగా ఎవరో చూశారుట"

"వీళ్లే తీశారుట"

"లేదు, ఎవరో తీస్తుండగా చూశారట"

"సాగర్ చైనీస్ పేపర్‌తో పట్టుబడ్డాడట"

"రంజిత్ సాగర్‌ని ఎలాగైనా ఈ ఆపత్తు నించి రక్షించాలని చూస్తున్నాడుట"

"ఎవరో బయటవాళ్లు చేసేరుట. మన వాళ్లుకాదు"

"కాదు రంజిత్ ఎవరికోసమో సాగర్‌చేత తీయించాడుట"

"ఎవరో లెక్చరర్ తనవాళ్లెవరికోసమో తీశాడుట"

"సాగర్‌కి రంజిత్‌కి ఏమీ సంబంధంలేదుట" ఇలా ఎవరికి తెలుసున్నది వాళ్లు గోలగోలగా చెబుతున్నారు. వినేవాళ్లు వింటున్నారు. దేనికీ చలించకుండా అదే నిశ్చలతతో తమాషా చూస్తోంది రోబోట్ బొమ్మ.

రంజిత్ మోటార్‌బైక్ చప్పుడు చేసుకొంటూ ఆగింది.

"ఫ్రెండ్స్ మీరంతా ఈ రోజు క్లాసులకి వెళ్లడానికి వీలులేదు. ఏదో చప్పుడైంది కదా అని చూడ్డానికి ఆగితే మమ్మల్నే అనుమానిస్తున్నారు. ఎంక్వయిరీ పెడతారుట. మా తప్పేం లేదన్నా వినిపించుకోవడంలేదు" అన్నాడు రంజిత్.

"క్లాసులు మానెయ్యాలా? కొందరికి ఈ రోజే ఆఖరి క్లాసు, కొందరికి ఒకటో రెండో క్లాసులున్నాయేమో తర్వాత పరీక్షలే కద. మమ్మల్ని క్లాసులకి పోనీ, కోర్సు పూర్తి కానీ" అని కొందరన్నారు.

"వీలులేదు. ఎవ్వరూ క్లాసులకి వెళ్లడానికి వీలులేద"న్నాడు రంజిత్.

"తప్పులేనప్పుడు ఎన్ని ఎంక్వయిరీలు పెట్టుకొంటే మాత్రం నీదేం పోయింది రంజిత్. నిజం బయటపడుతుంది. తప్పు చేయని మనకి భయం దేనికి? అయినా మనమేం అడిగాం? ఎంక్వయిరీ పెట్టమని నువ్వుకూడా అన్నావుకదా" అన్నారింకొకరు.

"అవును మనమే అడిగాం. కాని జాగ్రత్తగా ఆలోచిస్తే వాళ్లు ఎలాగైనా ఇరికించవచ్చేమోననిపిస్తోంది"

"ఎలా"

"న్యాయానికి కళ్ళులేవు కనుక" అన్నాడు రంజిత్.

సాయంకాలానికల్లా ఎంక్వయిరీ పెట్టారని అందరికీ తెలిసిపోయింది.

రంజిత్‌కి కారం పూసుకున్నట్లుంది. పైకి ఏమీ అనడంలేదు. చాలా గుంభనంగా ఉన్నాడు.

సాగర్ మాత్రం 'తన ఖర్మ కాకపోతే లైబ్రరీదగ్గర ఈ రంజిత్ ఎందుకు కనిపించాలి? తనకెందుకు రైడ్ ఆఫర్ చెయ్యాలి? యూనివర్సిటీలో తననుకొన్న సీటురాలేదు. ఊరికే కూర్చోకుండా డిప్లమాలో చేరి యూనివర్సిటీలో ఉండి కష్టపడి చదివి, వచ్చే సంవత్సరమైనా తనకి నచ్చిన కోర్సులో సీటు సంపాదించుకుందామనుకుంటే, ఇప్పుడిలా తనమీద అభాండం పడింది. ఈ వడగాలికి తట్టుకోడమెలా? ' అని వేగిపోతున్నాడు సాగర్.

"నేను కలలో కూడా ఊహించలేను ఇందులో సాగర్ చెయ్యి ఉందంటే. సాగర్‌తో మాట్లాడాలి" అన్నాడు శేఖర్.

"ఏమో నేను వెళ్ళిపోతున్నాను. ఏది ఎప్పుడు ఎలా మారుతుందో తెలీదు. నేనిక్కడ ఉండను రూంకి వెళ్ళిపోతా" అంటూ

వెళ్ళిపోయాడు పిరికివాడైన ప్రదీప్.

"నిత్యా! సాగర్ ఇలా చేశాడంటే నేను నమ్మలేను" అంది ముక్త.

"కానీ ఏం చెయ్యగలం. నీ నోటిమాటలు, నువ్విచ్చే సర్టిఫికెట్స్ ఎవరికి కావాలి? "

"ఆవేళ సాగర్ రంజిత్ వెంట ఉన్నాడు. మరెవరో ఉంటే వాళ్ళపనీ అంతే"

"ఇంతకీ సాగర్ ఎక్కడ? "

"ఎవరికీ మొహం చూపించడంలేదు. హాస్టల్ రూం విడిచి రావడంలేదు"

★ ★ ★

రోబోట్ సెంటర్ దేదీప్యమానంగా వెలిగిపోతోంది. రంజిత్‌ది, సాగర్‌ది ఇద్దరిదీ తప్పుందని ఎంక్వయిరీలో తేలింది. వాళ్ళాపరిసరాల్లో ఉండడమే ఓ తప్పన్నారు.

ఇద్దరూ ప్రస్తుతం జరుగుతున్న కోర్సు పూర్తిచేసి వెళ్ళిపోవాలనీ, భవిష్యత్‌లో ఆ ఇద్దరికీ ఈ యూనివర్శిటీలో ఏ కోర్సుకి ప్రవేశార్హత లేదని అధికారులు ఉత్తర్వులు జారీచేశారు.

"రంజిత్‌కి కొంత కీర్తి దాహం ఉంది. ముందువెనుకలు ఆలోచించకుండా దూకుడుగా ఏదో చేసేయాలని ఆరాటపడతాడు. పాపం సాగర్ అనవసరంగా ఇరుక్కున్నాడ"న్నాడు నిత్యా.

"ఏం చెయ్యలేమా? "

"ఏం చేస్తాం. స్టూడెంట్ కమ్యూనిటీకే సిగ్గుచేటు. పేపర్ ఆ ఇద్దరికీ ఏమాత్రం సంబంధంలేనిదికాబట్టి ఆ సబ్జక్టు వాళ్ళది కాదు కాబట్టి శిక్ష ఈ మాత్రంతో తప్పింది. కావాలంటే తర్వాత వేరే యూనివర్శిటీలో చదువుకోవడానికి అవకాశం ఉంది" అన్నాడు నిత్యా.

★ ★ ★

పవన్ ఇంటికి వచ్చేసరికి పవన్ తల్లి సుందరమ్మ శుభలేఖల కవర్లమీద ఎడ్రస్‌లు రాస్తోంది.

"పెళ్ళెవరికి? "

"నువ్విలా ఇల్లూవాకిలీ పట్టకుండా తిరిగితే నేనింక ఊరుకోదలుచుకోలేదు. తులసికి నా అక్కకొడుకు రంగనాథంతో పెళ్ళి జరిపిస్తాను. తులసిని, రంగనాథాన్ని ఒప్పించాలనుకుంటున్నాను. వాడి భార్య ఏక్సిడెంట్‌లో పోయి మూడేళ్ళయింది. వాడి కొడుకుకి తులసి, నేహ ఆసరాగా ఉంటారు.

పవన్‌కి చిరాకుగా ఉంది. ఇంటికి రాగానే ఈవిడతో ఘర్షణ మొదలు. "నాకు ఇంటికే రాకూడదనిపించేలా చేస్తున్నావు. నువ్వు నన్నిలా సాధిస్తే ఇక నేను రాను"

"ఎందుకు రావడం? అనవసరం. తులసికి విడాకులిచ్చేయి. నా ఆస్తి సర్వం తులసికి, నా మనమరాలికి ఇచ్చేస్తాను. నువ్వు నీకు నచ్చిన వాళ్ళతో హాయిగా ఉండు. తులసికి కాపురం ఉన్నట్టా లేనట్టా అనే సందిగ్ధం నాకు అక్కరలేదు"

తల్లి తనను చాలా హింసిస్తోంది. స్వేచ్ఛగా బతకనివ్వదలచుకోలేదు.

లోపలికి వచ్చి ఎప్పుడూలా మాసిన బట్టలు తియ్యకుండానే అదే బ్యాగ్‌తో వరద ఇంటికి వెళ్ళిపోయాడు. వెళితే రెండురోజుల వరకూ రానివాడు అప్పుడే వచ్చాడెందుకో? అని వరద ఆశ్చర్యంగా చూసింది.

"వరదా! పని అమ్మాయి వస్తే బట్టలు ఉతికించాలి. కాసేపు పడుకుంటాను" అంటూ రూంలోకి వెళ్ళాడు.

వరద జర్నలుకో వ్యాసం తయారుచేడానికి పుస్తకాలన్నీ ముందేసుకు కూర్చుని ఉంది.

పవన్ మాటలకి "పని అమ్మాయి ఊరికి పోయింది, రాదు. నేను హాస్టల్‌లో భోజనం చేద్దామని ఇంట్లో ఇంకే పనీ పెట్టుకోలేదు. మాసిన బట్టలు అక్కడే వదిలి రాలేకపోయావా? రెండురోజులయ్యాక తెచ్చుకుందువుగాని" అంది. మళ్ళీ "మంచం మీద పడుకోడంకాదు. నాకు కొబ్బరినీళ్ళు కావాలి. పోయి తీసుకురా" అంది.

పవన్‌కి కదలాలనిపించలేదు. ఇంటి నుంచి ఇక్కడికి వచ్చేస్తే, బుర్ర బరువు

తేలిక అవుతుందనుకుంటే మరింత బరువుగా అన్పిస్తోందనుకున్నాడు. "వరదా, నువ్వు కాస్త టీ చేసి తీసుకురా. నాకు వంట్లో బాగోలేదు" అన్నాడు.

"నేనేదో రాసుకుంటున్నాను. డిస్టర్బ్ చెయ్యకు, పోనీ నువ్వే లేచి టీ చేసుకుని నాకు కూడా టీ చేసి ఇయ్యి" అంది.

పవన్ లేచి టీ చేశాడు. వరదకో కప్పు టీ అందించాడు. టీ తాగుతుంటే టీ కప్పులో తన మొహం అడిగింది, "ఒక్కనాడైనా తులసికి టీ చేసిచ్చావా? " అని.

"టీ తాగి పడుకునేవు. క్యారియర్ తీసుకెళ్ళి మీల్స్ తీసుకురా"

పవన్ మనసు, శరీరం రెండూ అలసిపోయినట్టు అడుగు వేసే శక్తి లేనట్టుగా ఫీలవుతున్నాడు. ఈ రోజు వరద ఆర్డర్స్ పవన్‌కి విసుగనిపిస్తున్నాయి.

"నన్ను కొంచెంసేపు రెస్ట్ తీసుకోనిస్తావా? "

"నువ్వు లంచ్ తెచ్చి పడుకో. అందరూ తినేసిన తర్వాత తెస్తే చల్లారిపోతుంది"

"నేను రాకపోతే ఏం చేసేదానివి? "

"నాకు వీలున్నప్పుడు వెళ్ళి తినేదాన్ని"

"అప్పుడు భోజనం చల్లారిపోదా? "

"చల్లారిపోతుంది. నువ్వు వచ్చావు కాబట్టి వేడిగా తినే అవకాశం ఉంది కాబట్టి తెమ్మంటున్నాను"

"నాకెక్కడికీ వెళ్ళాలని లేదు. కాసేపు పడుకోవాలనుంది. వంట్లో బాగోలేదు"

"అయితే ఎందుకొచ్చావు. బాగున్నాకే రాలేకపోయేవా? "

కూర్చున్నచోటునుంచి సెంటీమీటరు కూడా కదలలేదు వరద.

'వరదకి తనంటే విలువలేదు. తనని చూడగానే పని గుర్తుకి వస్తుంది' అనుకున్నాడు పవన్.

అతనిలో అంతరంగ మథనం ప్రారంభమైందనడానికి సూచనగా క్యారియర్ బదులు దుప్పటి ఒకటి తీసుకుని మంచం మీద పడుకొని ఫాన్ ఫుల్‌గా పెట్టుకుని దుప్పటి పూర్తిగా కప్పేసుకున్నాడు. తనని తను ప్రేమించుకోవాలనుకున్నాడు పవన్.

తన ఆర్టికల్ ధోరణిలో వరద మునిగిపోయి కాస్సేపయ్యాక లేచి క్యారియర్ ఎత్తి చూసి పవన్ క్యారియర్ తేలేదని గ్రహించుకొంది. తనే హాస్టల్‌కి వెళ్ళి భోజనం చేసి, పవన్‌కి క్యారియర్ తెచ్చి పవన్‌ని భోజనం చెయ్యమని ఓ కేకవేసి మళ్ళీ పుస్తకాల ముందు కూర్చుంది.

"నా వంట్లో బాగోలేదన్నానుకదా. నే తినను"

"సరే నీ ఇష్టం"

ఇదే మాట తనింట్లో అంటే అమ్మ, తులసి, నేహా ఎంత తాపత్రయపడతారు. తనేదో తినాలని, తాగాలని చూస్తారు. అనారోగ్య కారణాలు అడిగి డాక్టర్ దగ్గరకి వెళ్ళాలని ఎంత హడావిడి చేస్తారు. వరదని మరిచిపోగలిగితే ఆ ముగ్గురూ సంతోషిస్తారు.

పవన్ నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాడు.

నిద్రలో కల! వరదనీరు తన మంచం చుట్టూ క్షణక్షణానికి నిండిపోతోంది. అమ్మ, తులసి, నేహా రక్షించాలని తలుపులు బద్దలుకొడుతున్నారు.

నెమ్మదిగా మెళుకువ వచ్చింది.

రాస్తున్నది అక్కడే అర్థాంతరంగా ఉంది. బ్రేక్‌కోసం టి.వి. చూస్తోంది వరద.

"వరదా మనం పెళ్ళి చేసుకుందామా? "

ఈ గాలేమిటి, పెళ్ళివైపు మళ్ళిందనుకొని, వరద "పవన్ నీకేమైనా మతిపోయిందా. నీ భార్యనేం చేస్తావు? "

"విడాకులిస్తాను"

"గొప్ప పనిచేస్తావు. కొన్నాళ్ళకి నేను విసుగనిపిస్తే, నన్ను విడిచిపెడతావు. సారీ, పవన్. నాకూ వివాహ వ్యవస్థకీ నప్పదు. ఆ బంధంలో చిక్కుకొని బానిసలా బతకడం నా జీవిత ధ్యేయంకాదు. నువ్వో

ఫ్రెండ్‌లా ఉంటానంటే నాకేం అభ్యంతరం లేదు. నేను మెడ వంచితే ఓ తాడు కట్టి, దానికి జీవితాంతం తల ఒగ్గాలంటే నా వల్ల కాదు"

"ఎంతకాలం ఇలా ఉంటాం? "

"ఎంతకాలమైనా"

"నీకు నీ పిల్లలు కావాలనుండదా? "

"కమాన్ పవన్, పెళ్ళి, పిల్లలు, సంసారం ఇది అందరూ చేసేపని. నన్ను జీవితంలో కొన్ని మంచిపనులు చెయ్యనీ. అనాథాశ్రమంలో పిల్లలని ఎంతగా ప్రేమిస్తానో నీకు తెలియదా. నన్ను చూసినప్పుడు, వాళ్ళకళ్ళల్లో వెలిగే వెలుగు ప్రస్తుతానికి నాకు చాలు. ఇంకా ప్రొఫెషనల్‌గా బాగా సెటిల్ అయ్యాక అక్కడినుంచే ఒకరిద్దరు పిల్లలని తెచ్చి పెంచుకుంటాను.

"నీకు ఆరోగ్యం బాగోపోతే? "

"నువ్వెక్కడున్నా నీకు ఫోన్ చేయిస్తా"

"నేనెందుకు? "

"స్నేహితుడివి కనుక"

"అదే పెళ్ళి చేసుకుంటే ఆ బంధం మరింత పటిష్టమవుతుంది కదా"

"అబ్బ... పెళ్ళి... పెళ్ళి, సారీ... పవన్ నిన్ను స్నేహితుడిగా ప్రేమిస్తా, గౌరవిస్తా. నాకు భర్త అనేవాడు అక్కరలేదు. నా స్వేచ్ఛ నేను పోగొట్టుకోను"

వరద అభిప్రాయాలు పవన్‌కి కొత్తకాదు.

వరదనీరు... హెలికాప్టర్ మీంచి చూస్తే థ్రిల్లింగ్. అదే ఇంట్లో ప్రవేశిస్తే...? పవన్, శాశ్వతంగా ఇంటికి వెళ్ళాలనే ఆలోచనలో పడ్డాడు.

★ ★ ★

ఎవరో అమ్మాయి పేరు రుక్మిణి గ్యాస్ మీద వండుతూ, చీర అంటుకుని కాలిపోతుంటే ఇంట్లోవాళ్ళు చూసి హాస్పిటల్‌కి తీసుకువెళుతుంటే తోవలోనే పోయిందనీ, దహనక్రియలు జరగకుండానే అక్కడి పరిస్థితులన్నీ గమనించాలనీ వరద దగ్గరికి స్త్రీ విమోచన మెంబర్లు వచ్చారు.

ఎక్కడి పుస్తకాలు అక్కడ విడిచి పెట్టి, వరద హుటాహుటిన వెళ్ళిపోతూ "పవన్ తలుపు వేసుకో" అంటూ ఓ కేక పెట్టింది.

పవన్ లేచి తలుపువేసి తలనొప్పిగా ఉంటే అమృతాంజనం రుద్దుకొని మళ్ళీ పడుకున్నాడు. ఫోన్ మోగుతోంది. లేచి "హలో" అన్నాడు.

అవతలి గొంతు "వార్డెన్ వరద రాజేశ్వరి ఇల్లా"

"అవును"

"వార్డెన్ ఉన్నారా? "

"లేరు"

"మీరెవరు, మాట్లాడుతున్నది? "

ఎవరినని చెప్పగలడు పవన్. "నేను ఎవరైతేనేం. ఏదైనా మెసేజ్ ఉంటే చెప్పండి. వార్డెన్‌కి చెబుతాను"

"వార్డెన్‌గారికి తెలుసున్న ఫ్రెంచి ప్రొఫెసర్ పవన్ అంటారు. ఆయన తల్లిగారు హార్ట్‌ఎటాక్ వచ్చి పోయారు. సాయంకాలం నాలుగు గంటలకి అంతిమయాత్ర. అంత్యక్రియలు. ఈ వార్త పవన్‌గారికి అందజేయమని వార్డెన్‌గారికి మెసేజ్" మాటలు పూర్తికాకుండానే 'అలాగా', 'అలాగే' అంటూ పవన్ ఫోన్ పెట్టేశాడు.

పవన్‌కి చెప్పలేని దుఃఖం గుండెల్లోంచి ఎగతన్నుకువచ్చింది. తెచ్చిన మాసిన బట్టల బ్యాగ్ తీసుకుని తలుపు తాళం వేశాడు. వరద దగ్గర డూప్లికేట్ కీ ఉంటుంది. ఎప్పుడూ ఇవ్వనివాడు వరద వస్తే ఇవ్వమని తన దగ్గరున్న తాళంచెవి పక్క ఇంట్లో ఇచ్చేశాడు.

పవన్ ఇంటికి చేరేసరికి బంధువులతో, మిత్రులతో ఇల్లంతా నిండిపోయి ఉంది. తులసి అత్తకి అతిదగ్గరగా కూర్చొని ఉండి ఉండి ఏడుస్తోంది. నేహా బిక్కుబిక్కుమంటూ తల్లి ఒడిలో మొహం దాచుకుని ఏం జరిగిందో పూర్తిగా అర్థంకాని అయోమయస్థితిలో ఉంది.

జరగవలసిన ఏర్పాట్లు తులసి తండ్రి,

అంటే పవన్ మేనమామ కమ్ మామ జగన్నాథం, ఇంకా కొందరు దగ్గర బంధువులు చూసుకుంటున్నారు. పవన్ రాకపోయినా అక్కడేదీ ఆగేట్టులేదు. పవన్ లోపలికి రాగానే ఒక్కసారి నిశ్శబ్దం ఆవరించింది. తల్లిదగ్గరకు వచ్చి కూలబడ్డాడు. మొహం రెండుచేతుల్లో దాచుకొని భోరుమన్నాడు.

తులసి తండ్రి వచ్చి "పవన్ ఊరుకో, ఇంత మంచిమనిషి మనందరికీ ఇంత తొందరగా దూరమవడం మన దురదృష్టం. ఏం చేస్తాం. చావుపుట్టుకలు మనచేతిలో లేవు. వీలయినంత వరకూ ఆవిడ ఆత్మశాంతికి ప్రయత్నిద్దాం" అంటూ పవన్ వీపు మీద చెయ్యిపెట్టి కాసేపు ఓదార్చి మళ్ళీ పని మీద లోపలికి వెళ్ళాడు.

పవన్ తులసిని పలకరింపుగా కూడా ఎలా జరిగింది ఇంత అకస్మాత్తుగా అని అడగలేదు. బహుశా అతనికి దుఃఖంతో నోరు పెగలలేదేమో. రంగనాథం పవన్ పక్కకి చేరి "గార్డెన్‌లో పిన్ని నడుస్తూ నడుస్తూ ఒరిగిపోయింది, డాక్టర్ వచ్చి గుండె ఆగిపోయిందని చెప్పాడు. పాపం తులసి అందరికీ ఫోన్ చేసింది అంత బాధ లోనూ" అన్నాడు.

పవన్‌కి ఈ పని ఇలా చెయ్యి, అదలా చెయ్యి, అంటూంటే వాళ్ళు చెప్పినట్టు కార్యక్రమాలన్నీ చేసుకుపోతున్నాడు. కావలసిన డబ్బు తులసి బ్యాంక్ చెక్ ఇస్తే రంగనాథం తెచ్చి ఇస్తున్నాడు.

తనింట్లో ఓ గెస్ట్‌గా మిగిలిపోయాడు పవన్. ఉండుండి తల్లి గుర్తుకి వస్తోంది. ఇప్పుడు తనని ఎవరూ సాధించడంలేదు. విసిగించడంలేదు. వస్తే వచ్చాడు. పోతేపోయాడు అన్నట్టుగా ఉన్నారు. తనని ఎవరైనా ఛడామడా 'నువ్వు నీ తల్లిని ఇన్ని బాధలుపెట్టావు. శాంతి అయిందా' అంటే బాగుండును అనుకుంటున్నాడు పవన్. తులసి తండ్రికి అల్లుడికీ, కూతురికీ నప్పడంలేదని తెలుసు. తులసి ఈ విషయాలు ముఖాముఖీ ఎప్పుడూ పవన్‌తో మాట్లాడనివ్వలేదు.

పన్నెండురోజులు, 'దినాలు' పూర్తయ్యేక ఎక్కడి బంధువులు అక్కడికి వెళ్ళిపోయారు.

పవన్ గదిలో మంచంమీద కూర్చుని పేపర్ చదువుకుంటున్నాడు.

తులసి తండ్రి రంగనాథంతో "ఇంటి పరిస్థితులు తెలుసున్నవాడివి. పవన్‌తో కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి. మామధ్య జరిగే సంభాషణలకి నువ్వు శ్రోతవి కావాలి. మేనమామగా నిన్ను అడుగుతున్నా"నన్నాడు.

రంగనాథం పిన్ని ప్రేమని, తులసి మంచితనాన్ని తలుచుకుని "సరే" అన్నాడు.

ఇద్దరూ పవన్ ఉన్న గదిలోకి వెళ్ళారు. పవన్ ఇద్దరికీ కుర్చీలు చూపించాడు కూర్చుందుకు.

"బాబూ పవన్! ఎంతో ప్రేమాభిమానాలని పంచి ఇచ్చిన అక్కని పోగొట్టుకొన్నాను. మన ఆచారాల ప్రకారం తల్లికి జరపవలసిన కర్మకాండ సవ్యంగా జరిపావు. ఆవిడకీ, మనకీ రుణం తీరింది. మనని విడిచి వెళ్ళిపోయింది.

"నీకు, తులసికి స్పర్ధలు వచ్చినప్పటినించీ నేను తులసిని, పాపని తీసుకువెళదామనుకొంటే తులసి అత్తని విడిచిపెట్టి రావడానికి ఇష్టపడేది కాదు. మా అక్క తులసి ఎలా చెయ్యమంటే అలా చెయ్యి అనేది. అత్త ఒడిలో నాకు కష్టం కలిగించేది ఏదీ లేదనేది తులసి.

"ఈనాడు తులసి నిజంగా తల్లిని పోగొట్టుకొంది. నిన్న రాత్రి అడిగాను. నాకు మాత్రం ఎవరున్నారు? నాతో రామ్మా నేహాని, నిన్ను కంట్లో పెట్టుకొని కాపాడుకొంటాను. పవన్ వారానికి రెండురోజులు తప్ప రాడుకదా, అంటే సరేనంది. అక్క స్థిరచరాస్తులన్నీ తులసికి, నేహాకి రాసింది.

స్థిరాస్తి ఉంచుకొంటావా? అమ్మేయమంటావా? అంటే అమ్మేయమంది. ఇల్లు అమ్మకానికి పెట్టాలి. కొంత సామాను అమ్మేసి అవసరమనుకొన్నవి తీసుకువెళతానంటోంది. ఈ పనులన్నీ చూసుకొని నెలాఖరుకి ఇల్లు ఖాళీ చేస్తాం. మళ్ళీ నువ్వు ఎప్పుడు ఎక్కడికి వెళతావో ఈ విషయాలు నీకు చెబుదామని వచ్చేం.

"మేనమామగా చెబుతున్నాను. నా ఇంటి తలుపులు నీకు ఎప్పుడూ తెరిచే ఉంటాయి. నీకు ఎప్పుడైనా చూడాలనిపిస్తే తప్పకుండా రా" అంటూ భుజంమీద కండువాతో కన్నీళ్లు ఒత్తుకొన్నాడు. కన్నకూతురికి పవన్ ప్రవర్తన వల్ల కలిగిన అసంతృప్తి ఆ తండ్రి గుండెలో గూడు కట్టుకుని ఉంది. దాన్ని తవ్వుకొని లాభంలేదని అతనికి తెలుసు.

తననందరూ దూరంగా ఉంచుతున్నారు. తనకందరూ దూరమైపోతారనే భావం పవన్‌లో మొలకెత్తుతోంది. వరదకి పెళ్లి గురించి, సంసారం గురించి ఉన్న అభిప్రాయాలు ఈరోజే మరోసారి స్పష్టంగా తెలుసుకొన్నాడు.

"మామయ్యా! అమ్మ వెళ్ళిపోయిందని తులసి, నేహా నీ దగ్గరకు వెళ్ళిపోనక్కరలేదు. నేను వాళ్ళని జాగ్రత్తగా చూసుకొంటాను" అనడానికి పవన్‌కి పురుషాహంకారం అడ్డం వస్తోంది. రంగనాథం, తులసి తండ్రి లేచి నించున్నారు.

"ఓ.కే. మామయ్యా. మీరు చెప్పాల్సింది చెప్పారు. నన్ను కొంచెం రెస్టు తీసుకోనివ్వండి" అన్నాడు.

రంగనాథం బయటకి వచ్చాక "పవన్‌లో మార్పు కనిపిస్తోంది. మీరు మాత్రం తులసిని, నేహాని తీసుకువెళ్ళే ప్రయత్నంలో ఉండండి. నెలాఖరువరకు టైం ఉంది. చూద్దాం ఏమైనా మార్పు వస్తుందేమో" అన్నాడు.

"మంచిదే. వీళ్ళిద్దరూ ఒకటవ్వాలనే నా అక్క ఎప్పుడూ కోరుకొంది. బతికుండగా చూసుకోకపోయినా ఆవిడ కోరిక నెరవేరితే, నాకంతకన్న కావలసిందేముంది. అయితే ఆ మార్పు అతనిలో రావాలి. మనపక్క నించి బలవంతంగా ఆ మనిషిని మార్చాలనుకోవడం, ప్రయత్నించడం నా కిష్టంలేదు. కాలం ఎటువంటి మార్పుని తెస్తుందో చూద్దాం. నేను తులసిని, నేహాని తీసుకెళ్ళే ప్రయత్నంలోనే ఉంటాను" అన్నాడు తులసి తండ్రి.



వరద, స్త్రీ విమోచన మెంబర్లు రుక్మిణి ఇంటికి చేరుకొనేసరికి బంధువులు, మిత్రులు, చుట్టుపక్కలవాళ్ళు, పోలీసులు, ప్రెస్‌తో కిటకిటలాడుతోంది. ఘోరమైన స్థితిలో ఉన్న రుక్మిణి భౌతికకాయాన్ని దుప్పటితో పూర్తిగా కప్పేశారు. అత్తవారివైపువాళ్ళు "రుక్మిణి డబ్బు మనిషనీ, పెళ్లయిన మూడేళ్లలో ఎప్పుడూ ఏదో ఒకటి కావాలని భర్తతో తగాదా పెట్టుకొనేదని, భర్త సంపాదన సరిపోదని, తన సరదా కోసం పుట్టింటినించి ఇదీ అదీ అడిగి తెచ్చుకొనేదని, ఈమధ్య పాత మారుతీకారు అమ్మి, ఇండికా కారు కొనమని రోజూ భర్తని వేధిస్తోందని, చివరికి అతడు విసిగి 'నీ పుట్టింటి వాళ్ళనడిగి డబ్బు తెచ్చుకొని

కొనుక్కో నా దగ్గర డబ్బు లేద'న్నాడని మాటామాటా పెరిగి రుక్మిణే అంటించుకొం ద"ని చెబుతున్నారు.

పుట్టింటివేపు వాళ్ళు, "పెళ్ళయిన నాటి నుంచి అది కావాలి, ఇది కావాలని పుట్టింటికి వచ్చి అడిగింది ఇచ్చేవరకూ తమ కూతురు అత్తింట అడుగుపెట్టడానికే భయపడేదని, నాలుగు రోజులనాడు వచ్చి కొత్త కారు కొనమందనీ, అంత డబ్బు ఇవ్వడం సాధ్యం కాదని చెప్పామనీ అత్తింటికి తిరిగి వచ్చిన మర్నాడే ఈ ఘోరం జరిగిందనీ, అడిగింది ఇవ్వలేదని, అత్తవారు, భర్త కలిసి తమ కూతురి ప్రాణాలు బలితీసుకొన్నార"ని చెబుతున్నారు. మొత్తంమీద పాయింట్ "డబ్బు ఉంటే కారు కొనుక్కోవాలి. లేకుంటే లేదు. పుట్టింటినించి తీసుకురా అనో, వాళ్ళిస్తే కొంటాననో అనడం సంస్కారం కాద"ని మెంబర్లందరూ రుక్మిణి భర్తని దుమ్మెత్తిపోశారు.

పోలీసులు, కోర్టు పరిధిలోకి కేసు వెళ్ళిందికదా అని మెంబర్లు కొంత చల్లారారు. ఎప్పటికప్పుడు విషయం ఏమైందీ తమకి తెలియజెయ్యాలని, రుక్మిణి శవం దహనం కాగానే భర్త, అత్తమామలు, మిగతా బంధువర్గం ఇంకా ఇన్వాల్వయ్యారంటే తగిన శిక్ష అనుభవించాలని, ఏమాత్రం కేసు తప్పుతోవ పట్టినా ఊరుకోమని చెప్పి ఎవరిళ్ళకు వాళ్ళు చేరుకున్నారు.

వరద ఇంటికి వచ్చేసరికి రాత్రి పన్నెండు దాటింది. డూప్లికేట్ తాళంతో తలుపు తెరిచింది. పవన్ లేకపోవడం గమనించి అలిగి వెళ్లాడో, లేక వంట్లో బాగోక తగ్గేక వద్దామని వెళ్ళాడో తనే వస్తాడు రావాలనుకొన్నప్పుడని చేతిలో బ్యాగ్ విసిరి, ఆకలయి క్యారియర్ తీసిచూసింది. పొద్దున్న పవన్‌కి తెచ్చిన భోజనం అలాగే ఉంది. ఎప్పటి భోజనమో, ఏంతింటాం అనుకొని ఫ్రిజ్ మీద అరటిపళ్ళుంటే తీసుకొని తిని స్నానం చేసి పడుకొంది. పవన్ ఇంటికి ఫోన్‌చేసే అలవాటు లేదు వరదకి.

శని, ఆదివారాలయ్యాక సోమవారం పొద్దున్న సాధారణంగా పవన్ వరద ఇంటికి వస్తాడు. ఆరోజు రాలేదు. వరద తన డిపార్టుమెంట్‌కి వెళ్ళి పవన్ ఆఫీస్ నెంబర్‌కి ఫోన్ చేసింది. క్లర్క్ తీసుకొని "ఇప్పుడే పవన్ ఫోన్ చేశారు. పదిహేనురోజులు లీవ్ పెట్టారు. తల్లి పోయేరుట" అని చెప్పాడు.

అదా సంగతి అనుకొని, డిపార్టుమెంట్‌కే 'ఓ ఓదార్పు ఉత్తరం' ఇ.మెయిల్ ద్వారా పంపింది.

★ ★ ★

సత్యం స్విమ్మింగ్‌పూల్ నించి తిరిగివచ్చి తన ఆనందాన్ని గవర్నెస్ విమలతో పంచుకోవాలనుకొని ఫోన్ చేశాడు.

"ఆంటీ నేను సత్యంని మాట్లాడుతున్నాను. నా మనసుకి నచ్చిన అమ్మాయి కనిపించింది. ఆ అమ్మాయిని పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకొన్నాను. మీరు నవ్యని కలుసుకొని ఈ సంగతి చెప్పి మేం చట్టబద్ధంగా విడిపోవాలి కాబట్టి నవ్య తల్లిదండ్రులకి, ఈమాటే నా తండ్రికి తెలియజేయండి"

"సత్యం నువ్వు పెళ్లిచేసుకొని సంతోషంగా ఉండాలనే నా కోరిక. రాంగ్‌స్టెప్ వెయ్యవనే అనుకొంటున్నాను"

"నేను తీసుకున్న నిర్ణయం సరైనదే అనుకొంటున్నాను"

"సరే అలాగే తెలియజేస్తాను" అంది.

సత్యంకి, నవ్యకి అంతగా అతకలేదని విమలకి తెలుసు. నవ్య మెడికో ఫ్రెండ్ గౌతమ్ గురించీ తెలుసు. పని ధోరణిలో పడి నవ్యని నిర్లక్ష్యం చేసేవేమోనని కూడా అనుమానం వెలిబుచ్చింది. సత్యం ఆ మాటకి ఒప్పుకోలేదు. తను ఇండియా వచ్చినప్పుడు తనంటే ఏమాత్రం ఇంట్రస్ట్ చూపించలేదన్నాడు. ఎమ్.డి. చేస్తున్నప్పుడు ఇండియాలోనే తనున్నప్పుడూ, ఇద్దరికీ టైమూ, మనసూ కలవలేదన్నాడు.

ఇండియాలో ఉండిపోదామని వస్తే ఏడాది టైం దండగయింది. నా వర్క్ చూసి, నా ప్రజ్ఞ చూసి ఉన్నతమైన పదవి, బాధ్యతలు అప్పగించారు. అడిగిందల్లా సమకూర్చారు. నేనేదో పరిశోధనలు చెయ్యాలనుకొని వస్తే ఆ పనికే నీకు ఉద్యోగం ఇచ్చేమంటూ ఏ వారం రోజులూ వరసగా లాబ్స్‌లో పనిచేసుకోడానికి అవకాశం లేకుండా నన్ను బంతి ఆట ఆడినట్టు ఆడారు. ఎవరు చూసినా నీ అంత గొప్పవాడివి మా దగ్గరకొచ్చి లెక్చరివ్వాలి. కమిటీలో ఉండి సలహాలివ్వాలి అంటూ నా కిష్టంలేని పని బలవంతంగా చేయించారు. మనదేశంలో ఎవరిని ఎందుకు వాడుకోవాలో తెలుసుకోరు. అందుకే నన్ను ఎంత గొప్పగా చూసినా, ఎన్ని అవకాశాలు కల్పించినా నేకోరుకొన్న 'ప్రొఫెషనల్ హాపీనెస్' దొరకక తిరిగివచ్చాను. ఇప్పుడు నేకోరుకొన్న అమ్మాయితో పెళ్ళి జరిగితే నాకింక కావలసిందేమీ లేదంటూ తేల్చాడు సత్యం తన సంభాషణలో. మర్నాడు విమల నవ్యని కలుసుకొందుకు వెళ్ళింది. సాయం



కాలం లాన్స్‌లో కూర్చొని నవ్య, గౌతమ్ ఫ్రూట్ జ్యూస్ తాగుతున్నారు. ఇంకొంచెం సేపటిలో ఇద్దరూ ఔట్ పేషెంట్ విభాగానికి వెళ్ళాలి.

విమలని చూడగానే నవ్య కళ్లు ఉత్సాహంతో మెరిశాయి. "గౌతమ్ నువ్వు వెళ్లు. వేరే డాక్టర్‌ని ఎవరినైనా కొంచెంసేపు పేషెంట్లని చూసుకోమను. నేను ఆంటీతో కాసేపు మాట్లాడివస్తాను" అంది.

గౌతమ్ విమల దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. పని అమ్మాయి విమలకి లోపలనించి జ్యూస్ తీసుకువచ్చి ఇచ్చింది.

"చెప్పండి ఆంటీ, చాలారోజులైంది మిమ్మల్ని కలుసుకొని, ఏంటో బిజీలైఫ్. అఫ్‌కోర్స్, నేనీలైఫ్ ఎంజాయ్ చేస్తున్నాను. ఓ ముఖ్యమైన విషయం మీకు చెప్పి నా జీవితం నేననుకొన్న విధంగా దిద్దుకోవాలనుకొంటున్నాను. దానికి మీ సహాయం కావాలి. నేనే వద్దామనుకొంటూంటే నా దగ్గరికి మీరే వచ్చారు. థాంక్స్"

"ఏంటి చెప్పమ్మా! నేచెయ్యగలిగేది ఏముంది? "

"నా భర్త ఇలా ఉండాలి అని నేననుకోక ముందే నా పెళ్లయిపోయింది. సత్యం అందగాడు. ఐశ్వర్యవంతుడు. తెలివైనవాడు. గొప్ప శాస్త్రవేత్తగా చిన్నతనంలోనే పేరు తెచ్చుకొన్నాడు. నేను కావాలనుకొనే కొన్ని లక్షణాలు సత్యంలో లేవు. మా మనస్తత్వాలకి నప్పలేదు. నేను సత్యంకి ఓ మంచి స్నేహితుడిగా, ఓ గొప్పవ్యక్తిగా విలువ ఇవ్వగలనేమోకాని భర్తగా భరించలేనవే అభిప్రాయానికి వచ్చాను. ఇలాంటి పరిస్థితి ఏ ఆడపిల్లకీ రాకూడదు. నా నిర్ణయం బాధాకరమే అయినా, మీ అందరికీ చెప్పక తప్పదు. నేను, సత్యం ఇద్దరం చట్టబద్ధంగా విడిపోవడమే ఇద్దరికీ శ్రేయస్కరం. ఈ విషయం మీరే మా పెద్దలకి, సత్యంకి తెలియజేయండి"

విమల ఆశ్చర్యపోలేదు. తను మాట్లాడవలసిన మాటలు, నవ్య తనకే అప్పగించిందనుకొంది. సత్యం అభిప్రాయం కూడా అదే అని ముందే తెలిసినా ఆ సంగతి బయట పెట్టకుండా "ఇష్టంలేని పెళ్లి రద్దుచేసుకోవడమే ఇద్దరికీ మంచిది" అంది.

"నన్ను అర్థం చేసుకొన్నారు ఆంటీ"

"సత్యంకి ముందీ సంగతులు తెలియచేసి తర్వాత మిగిలిన వాళ్ళకి తెలియచేద్దాం. వస్తాను నవ్యా. నీకూ హాస్పిటల్‌లో పేషెంట్స్ వెయిట్ చేస్తూంటారు" అంటూ బయటికి నడిచింది.

నోరు విప్పకుండానే సమస్య పరిష్కారమైపోయిందనుకొంది విమల.

విమల సత్యంకి ఫోన్‌చేసి "నవ్య కూడా నీలాగే ఆలోచిస్తోంది. మీ ఇద్దరికీ పెళ్లి నప్పలేదంది. మనసులు కలవలేదంది. నేను పవిత్రన్‌కి సత్యం, నవ్య ఇద్దరూ వివాహం రద్దు చేసుకొనే ఉద్దేశంలో ఉన్నారని చెప్పాను. ముందు బాధపడ్డాడు. తర్వాత ఏకాభిప్రాయంలో ఇద్దరూ ఉన్నారంటే మనం చేయగలిగిందేమీ లేదన్నాడు. నవ్య తల్లిదండ్రులకి తెలియజేసింది. వాళ్ళు లాయర్‌తో మాట్లాడి ఆ ఏర్పాట్లు చూస్తున్నా"రంది.

సత్యంకి ఓ పెద్ద బండరాయి మోయలేనిది నెత్తిమీంచి దింపినట్టయింది. డిటెక్టివ్ ఏజన్సీకి ఫోన్‌చేసి లూసీ అనే యువతి తన దగ్గర ఉండేదని, ఎక్కడికి వెళ్లిందో తెలియదని, ఆచూకీ తెలుసుకొంటే తను రహస్యంగా కలుసుకొంటానని, పబ్లిసిటీ వద్దని చెప్పాడు.

డబ్బుతో ఆ దేశంలో చాలా పనులు సులువుగా చక్కబెట్టుకోవచ్చు నాలుగు రోజులలో లూసీ మియామీలో ఉందని, ఓ చైనీస్ రెస్టరెంట్‌లో పనిచేస్తోందని సమాచారం అందించారు.

సత్యం మొదటిసారిగా లాబ్ పనంతా మేనేజర్‌కి, స్టూడెంట్స్‌కి అప్పజెప్పి మియామి చేరుకొన్నాడు. హోటల్ రూంలో

బ్యాగ్ పెట్టుకొని జ్యూయలెరీ షాపుకి వెళ్ళి ఓ ఎల్ షేప్‌లో ఉన్న వజ్రాలు పొదిగిన ఉంగరాన్ని కొన్నాడు. ఆ ఎల్‌కి అర్థం లూసీ కావచ్చు లవ్ కావచ్చు ఓ పెద్ద పూలగుత్తి తీసుకొని లూసీ పనిచేసే చైనీస్ రెస్టారెంట్‌కి చేరుకొన్నాడు. కిటికీ పక్కనున్న టేబుల్ ఎన్నుకొని అక్కడ కూర్చొన్నాడు. వెయిట్రెస్ ఆర్డర్ తీసుకొందుకి వచ్చింది. "లూసీ" అనే వెయిట్రెస్‌ని కలవాలని చెప్పాడు.

లూసీ సత్యం ఉన్న టేబుల్‌వైపు నడిచి వస్తూ సత్యాన్ని దూరంనించే గుర్తించి షాక్ అయ్యింది. డబ్బు తీసుకొన్నందుకు తనని పట్టించాలని ఇంత దూరం వెతుక్కుంటూ వచ్చాడేమోననే అనుమానం రేఖామాత్రంగా వచ్చింది. జరిగేదేదో జరుగుతుందని సత్యం దగ్గరకు వచ్చింది. సత్యం లూసీ చేతిలో ఆ పెద్దపూల గుత్తిపెట్టాడు. తెలుపు, ఎరుపు, పసుపురంగు గులాబీలు.

"ఓ సత్యం! ఈ కొంచెం రోజులకే నిన్నెంతగానో మిస్ అవుతున్నాను"

"లూసీ నేను కూడా! నీకన్న నేనే ఎక్కువ మిస్ అవుతున్నాను. నువ్వు ఒక్కరోజ్ పెట్టి వెళ్ళిపోయావు. నేను ఎన్ని రోజెస్ తెచ్చేనో, అన్ని రెట్లు ఎక్కువ నువ్వులేని వెలితి అనుభవించాను"

"సారీ... నీ ఫ్రెండ్ కోలాని కలుసుకొన్న సంగతి కూడా నీకు చెప్పలేదు. నీ ఫ్రెండ్ ద్వారా నీకు పెళ్ళయిందని, భార్య ఉందని తెలిసింది. నాకు నీ దగ్గర స్థానం లేదనిపించి నీతో చెప్పకుండానే నీ డబ్బు తీసుకొని ఇల్లు వదిలిపెట్టాను. సారీ! నాకు ఉద్యోగం దొరికేవరకు డబ్బు అవసరంకదా"

"లూసీ! నాకూ, నా భార్యకి నామమాత్రం పెళ్లి జరిగింది. మా ఇద్దరికీ నచ్చలేదు. విడిపోదామనే నిర్ణయానికి వచ్చాం. ఆ ఫార్మాలిటీస్ పూర్తి కాగానే నేను నిన్ను శాశ్వతంగా నాదాన్ని చేసుకొంటాను. ఇప్పుడే మన ఎంగేజ్‌మెంట్ అనుకో" అంటూ లూసీ వేలికి ఉంగరం తొడిగేడు.

లూసీ చేతికున్న ఉంగరంలో వజ్రాల మెరుపు, ఆమె కన్నుల్లో మెరుపుముందు వెలవెలబోయింది. లూసీ ఆనందంతో ఒలికే కన్నీరు, అదుపులోకి తెచ్చుకొంటోంది.

ఇది కలా, నిజమా! తను ఎంతగానో ఆరాధించే సత్యం తన కళ్లెదుట పైగా తనని పెళ్లి చేసుకొంటాననడం.

లూసీ, సత్యం తేలికగా భోజనం చేశారు. రెస్టారెంట్‌లో తోటివాళ్ళకి తనని వెతుక్కుంటూ వచ్చిన సత్యం తన ఫియాన్సీగా పరిచయం చేసింది. అనుమతి తీసుకొని సత్యంతోపాటు అతని హోటల్‌కి వచ్చింది.

స్విమ్మింగ్‌కి వెళదామన్నాడు సత్యం. ఇద్దరూ సంతోషంగా స్విమ్మింగ్ పూల్‌లో ఈత కొడుతున్నారు.

చెవిలో నీరుచేరి చికాకనిపించి చెవి శుభ్రం చేసుకుందుకు స్విమ్మింగ్‌పూల్ లేజర్ ఎక్కబోయిన సత్యం కాలుజారి, స్విమ్మింగ్‌పూల్‌లో వెల్లకిలా పడ్డాడు.

హెల్పర్స్ సహాయంతో పూల్‌లోంచి బయటికి తీయించి లూసీ సత్యాన్ని పలకరించబోతే అప్పటికే సత్యం కోమాలోకి వెళ్ళిపోయాడు. వెంటనే పెద్ద హాస్పిటల్‌లో చేర్పించింది.

స్కానింగ్ చేస్తే బ్రైన్‌లో ఇంటర్నల్ డామేజ్ అని తెలిసింది. ఎంతకాలానికి స్పృహవస్తుందో చెప్పలేమన్నారు. లూసీ వరల్డ్ సైన్స్ యూనివర్శిటీకి ఫోన్‌చేసి సత్యం పరిస్థితి తెలియచేసింది. సత్యం తండ్రి నెంబరు తెలుసుకొని ఫోన్ చేసి వెంటనే బయలుదేరి రమ్మని చెప్పింది. పవిత్రన్‌కి విమలద్వారా లూసీగురించి అంతకు ముందే తెలుసు. జరిగినదానికి బాధపడి, లూసీని ధైర్యంగా ఉండమని చెప్పి వెంటనే మియామికి బయలుదేరివచ్చాడు.

నెలరోజులకి సత్యం కోమాలోనుంచి బయటపడి కళ్ళు తెరిచిచూశాడు. డాక్టర్లు

పెద్దగా చెయ్యగలిగేదేమీలేదని చెప్పడంతో పవిత్రన్ సత్యాంని ఇండియాకి తీసుకువెళ తానన్నాడు.

పవిత్రన్ లూసీని ప్రత్యేకించి ఇండియా వస్తావా? అని అడగలేదు.

లూసీయే అదొక బాధ్యతగా భావించి తను దగ్గరుండి సత్యాంని చూసుకోవాలని సత్యం వెంట బయల్దేరింది.

పవిత్రన్ తన తృప్తికోసం ఎందరో డాక్ట ర్లకి చూపించాడు. కానీ ఎవరూ ఏమీ చెప్ప లేకపోయారు. ఒక తమిళ డాక్టరు మాత్రం ఒక్కోసారి ఇంగ్లీషు మందులుకన్నా కొన్ని కేసుల్లో కొందరికి ఆయుర్వేదం బాగా పని చేస్తుందనీ, కేరళలో కోవలం దగ్గర ఒక ఆయుర్వేదవైద్యం జరిపే ఆశ్రమం ఉందనీ అందులో ఉంచి వైద్యం చేయించమని సలహా ఇచ్చారు.

పవిత్రన్, లూసీ ఆ ఆశ్రమానికి సత్యాంని తీసుకువెళ్ళారు. మూడునెలల్లో ఆయుర్వేద వైద్యంతో సత్యంలో కొంతమార్పు కని పించింది. అన్నిపనులు స్వయంగా చేసుకో సాగాడు. అన్నీ గుర్తున్నట్టుగా మామూ లుగా ఉంటాడు. కానీ అంతలోనే అన్నీ మరిచిపోయి పసిపిల్లవాడిలా ప్రవర్తిస్తాడు. ఇంకా కొంతకాలానికి నరాలలో పటుత్వం వచ్చి మందుల మూలంగా పాడయిన జీవ కణాలు బాగుపడే అవకాశం ఉందని వైద్యులు అంటున్నారు. దెబ్బతిన్న మెదడు బాగుపడితే స్థిరత్వం దానంతట అదే వస్తుందని, సత్యం పూర్తిగా కోలుకునే అవ కాశం ఉందంటూ ఆశ కల్పిస్తున్నారు.

★ ★ ★

వరద స్నేహితురాలు మీనా ఓ సినిమా దర్శకురాలు. వరదంటే ప్రత్యేకమైన గౌరవం. వరదను కలుసుకుని సినిమా రిలీజు చేసేలోగా ఓసారి చూసి వరద దృష్టిలో స్త్రీలని చిన్నచూపు చూసేవిధంగా ఏవైనా చిత్రీకరించి ఉంటే మారుస్తానని చెప్పింది.

వరద సినిమా చూడ్డానికి మీనా స్టూడి యోకి వెళ్ళింది. సినిమా మొదలయ్యాక శ్రద్ధగా చూడసాగింది. హీరో ఆఫీస్‌నుంచి వస్తూనే డ్రాయింగ్‌రూంలో సోఫాలో కూర్చున్నాడు. హీరోయిన్ కాఫీ ట్రేతో వచ్చింది.

“ఈ సీన్ మార్చాలి! ఇలాగాక హీరో తలుపు తీసుకుని వచ్చి షూస్ తీసి వంటిం ట్లోకి వెళ్ళాలి. తనే కాఫీ కలుపుకుని హీరో యిన్ బట్టలు ఇస్త్రీ చేసుకొంటూనో, పుస్తకం చదువుకుంటూనో ఉంటే వెళ్ళి ఓ కప్పుకాఫీ అందించినట్టు చిత్రీకరించు. హీరో తల్లి అనారోగ్యంతో మంచమెక్కితే హీరోయిన్ మాత్ర ఇస్తున్నట్టు, హీరో నిలబడి చూస్తు న్నట్టు బాగోలేదు.

“నో... హీరో మాత్ర ఇస్తున్నట్టు, హీరో యిన్ హీరో మాతృప్రేమకి, సంతోషంతో తల మునకలవుతున్నట్టు భావం వచ్చేలా చూడు.

“అలాగే హీరోయిన్‌కి డెలివరీ అయి కొడుకు పుట్టినప్పుడు నర్స్ గెంతులేసు కుంటూ కొడుకు పుట్టాడని చెప్పడం ఓవర్ యాక్షన్‌గా ఉంది. కూతురు పుట్టినప్పుడు నర్స్ ఎలా చెబుతుందో కొడుకు పుట్టిన ప్పుడూ అలాగే చెప్పాలి. పాత సినిమాలలో కూతురు పుట్టినప్పుడుండే సీన్ చూసి మార్పుచెయ్యి”

“హీరో హీరోయిన్ కొడుకుతో కలిసి సిమ్లా వెళ్ళారు. అక్కడ హీరోకి తన చిన్న తనం గుర్తుకువచ్చింది. అక్కడో పూలమ్ము కునే స్త్రీ కూతురితో హీరో చిన్నతనంలో ఆటలు ఆడాడు. వెళ్ళిపోతూ బహుమతిగా ఆ చిన్నపాపకి సంసారం బుట్ట లక్కపి డతలతో ఉన్నది ఇద్దామని తల్లిచేత కొని పించి ఆ పిల్లని వెతికి ఇచ్చాడు.

“ఏం తీసేవు మీనా! లక్కపిడతలు, వంట సామానులు. ట్రాష్... ఏ బొమ్మల పుస్త కమో కలర్ పెయింటింగ్ బ్రష్షో, మెడలోకి ఓ పూసలదండో ఇచ్చినట్టు చూపించు తల్లీ.

నువ్వా నీ పాత చింతకాయపచ్చడి భావా లూను" అంది వరద.

"వరదా! ప్రతి చిన్న విషయం ఎంత చక్కగా పరిశీలించావు. థాంక్స్ వరదా"

"మరేంటనుకున్నావు. ఇలా చిన్నచిన్న విషయాల దగ్గర్నుంచి మార్పు అవసరం. మీడియా ప్రజలమీద గాఢమైన ముద్ర వేస్తుంది"

"చెప్పు వరదా! నీ విజయాలు, నీ ప్రతిభ"

"ఈ ఏడాది సుమారు ఓ డజను కట్నం తీసుకునే పెళ్ళిళ్లని ఆపగలిగాం. ఓ ఆరుగురు యువతులని కట్నం తేలేదని సాధించి చంపబోతుంటే వాళ్లని కాపాడి వాళ్ళ జీవితాలకి ఆధారం చూపించాం"

"చాలాబాగుంది వరదా"

"చెప్పుకుంటూపోతుంటే చాలా ఉంటాయి. నేటి స్త్రీ తనకేదో అన్యాయం జరుగుతోందని గ్రహించగలిగే దశకి చేరుకొందని అనుకుంటున్నాం.

"చిన్నపిల్లలని విధిగా స్కూల్లో చేర్చాలనే ఉద్యమానికి ప్రస్తుతం బాగా కృషి చేస్తున్నాం. ఆడపిల్లా, మొగపిల్లాడా? అని స్కానింగ్ చేసి ముందుగా తెలియచెప్పే డాక్టర్స్‌ని బహిష్కరిద్దామనుకుంటున్నాం. వైద్యానికి ఉపయోగపడేలా బిడ్డ ఆరోగ్యంగా ఉందా, లేదా అనేవరకే స్కానింగ్ ఉపయోగించుకోవాలి. నేను వెళ్తాను మీనా. ఈరోజు సాయంకాలం తీరిక సమయంలో స్త్రీలు ఇంట్లో తయారుచేసిన వస్తువుల్ని ఎగ్జిబిషన్‌లా పెడుతున్నారు. నన్ను ప్రారంభించమని అడిగారు"

"వంటలా? "

"కాదు. పెయింటింగ్‌లు, బొమ్మలు, అద్దకపు బట్టలు, తివాసీలు, రెడీమేడ్ బట్టలు, గృహోపకరణ సామగ్రి అంతా"

"బాగుంది వరదా, ఐ యామ్ రియల్లీ ప్రౌడ్ ఆఫ్ యు" అంది మీనా.

"నేను వస్తాను" అంటూ వరద అక్కడ నుంచి ఎగ్జిబిషన్ జరిగేచోటుకి వెళ్ళింది.

★ ★ ★

సత్యంకి జరిగిన యాక్సిడెంట్ గురించి కోలాకి తెలిసింది. మిత్రులు, సహోద్యోగులు గర్వపడేలా శాస్త్ర పరిశోధనల్లో చిన్న వయసులోనే పేరుప్రఖ్యాతులు తెచ్చుకొన్నవాడు ఇలా అర్థాంతరంగా బ్రైన్ డేమేజ్ అయి అవస్థపడడం దురదృష్టం అంటూ ఆవేదన చెందాడు.

సత్యం ఆ యూనివర్సిటీకి ఇహ రానని చెప్పడం అతని స్వవిషయం. తను రానప్పుడు, ఆ లాబ్స్ ఏమైతే అతనికెందుకు? అయినా సత్యం సోనావాలాని లాబ్‌కి డైరెక్టర్‌ని చెయ్యమని యూనివర్సిటీకి రికమెండ్ చేశాడు. తలచుకుంటేనే కోలా మూడ్ పాడయిపోతోంది.

"సోనావాలా పి. హెచ్. డి. కూడా కంప్లీట్ చెయ్యలేదు. మధ్యలో వదిలేసి బహుశా పరిశోధన కొరుకుడు పడకనేమో ఉద్యోగంలో చేరిపోయాడు. సోనావాలా తనకంటే ఏ విధంగానూ ఎక్కువకాదు. ప్రాజెక్టులు తీసుకుని కాలపరిమితిలో ఫలితాలంటూ పనిచూపిస్తున్నాడే తప్ప నిర్మాణాత్మకంగా కొన్ని సంవత్సరాలపాటు ఒకే అంశం మీద పనిచేసి తనదైన ముద్ర వేయలేకపోయాడు" అంటాడు కోలా.

"సోనావాలాని అంతరిక్ష పరిశోధన లాబ్స్‌కి డైరెక్టర్‌గా తెస్తే ఎలాగుంటుంద"ని తమ యూనివర్సిటీకి సలహాదారుగా ఉన్న ప్రొఫెసర్ సింహాచలాన్ని సలహా అడిగితే,

"అతడు చాలా గొప్పవాడు. అందులోనూ సత్యం రికమెండేషన్ చేస్తే కొట్టిపారేయకూడదు. సత్యం తర్వాత సోనావాలాకే లాబ్స్ అప్పగించాలి" అన్నాడని కోలాకి తెలిసింది.

తెలుగువాడికి ఇంకో తెలుగువాడంటే విలువలేదు. అందుకే మాటమాత్రంగా "కోలా కూడా మంచిపని చేస్తున్నాడు. అతనిని ఎంకరేజ్ చేస్తే ఎలా ఉంటుందని అనలేకపోయాడు" అనుకున్నాడు కోలా

సోనావాలాకి లాబ్స్ డైరక్టర్ పోస్టు ఇచ్చి వీలయినంత త్వరలో పని మొదలుపెట్ట మని చెప్పారు.

సోనావాలాకి ప్రపంచంలో ఎనిమిది దేశాలలో ఎనిమిది ప్రోజెక్టులున్నాయి. ఒక్కోదేశంలో ఒక్కోనెల ఉంటున్నాడు. ఇంక మిగిలిన నాలుగు నెలలు ఈ యూనివర్సిటీలో గడుపుతానన్నాడు. అదే పరిశోధన చేస్తానన్నాడు. ఈమధ్య సోనావాలాకి ఆస్తమా ఎక్కువై చలిపడడంలేదు. ఇది కొండ ప్రాంతం కావడంతో కొంత బాగుండవచ్చుననే అభిప్రాయంలో ఉన్నాడని సన్నిహిత వర్గాలు అనుకుంటున్నారు.

ఈ యూనివర్సిటీలో తనకివ్వబోయే పరికరాలు, సదుపాయాలు చూసుకునేందుకు సోనావాలా వచ్చినప్పుడు కోలా "మరి మిగిలిన ఎనిమిది నెలలమాట ఏమిటి. ఇక్కడ పని ఎలా జరుగుతుంద"ని అడిగాడు.

"నా గ్రూప్ చూసుకుంటుంది. మధ్యమధ్యలో దేశాలమధ్య తిరుగుతూ, ఇక్కడికి వస్తూ పోతుండవచ్చు. అదేం పెద్ద సమస్య కాదు భాయిసాబ్. ఇ-మెయిల్, ఇంటర్‌నెట్ ఫాక్స్, ఫోన్, కమ్యూనికేషన్ వ్యవస్థ బాగా పెరిగిపోయింది. నాదంతా టైంబాండ్ ప్రోంగ్రాం" అన్నాడు సోనావాలా

కోలాకి ఒళ్ళు మండిపోయింది. సోనావాలాకి అష్టమహిషల్లా ఎనిమిది ప్రాజెక్టులు. మరైతే ఇది "రాధ" అన్నమాట, అనుకున్నాడు కోలా. ప్రొఫెసర్ సింహాచలాన్ని అడిగాడు, "పి. హెచ్. డి. లేకుండా సోనావాలాని ఎలా ఎంపిక చేశారు? " అని.

"మీరంతా పి. హెచ్. డి.లు ఉండి ఏం సాధిస్తున్నారు? ఈ మాటు పి. హెచ్. డి. లేకుండా ప్రొఫెసర్‌ని చేస్తే వర్క్ ఎలా జరుగుతుందో చూడాలనిపించింది. అసలు తెలివి ఉండాలి కానీ 'న్యూటన్'కి పి. హెచ్. డి. ఉందా? అన్నాడు సింహాచలం.

"రెండునెలల క్రితం తన డిపార్టుమెంటులో లెక్చరర్ సెలక్షన్స్ జరిగినపుడు ఓ అమాయకపు తెలుగువాడు తెలుగునేలలో బతుకుదామని ఇంటర్వ్యూకి వచ్చాడు. అన్ని అర్హతలూ ఉన్నా, పి. హెచ్. డి. థీసిస్ సబ్‌మిట్ చేశాడేకానీ, పి. హెచ్. డి. వైవా అవలేదు కదా అని ఈ పోస్టుకి అతగాడికి అర్హత లేదంటూ ఈ సింహాచలమే శుక్రాచార్యుడిలా అడ్డంపడ్డాడు.

"సింహాచలంలాంటి ప్రొఫెసర్ ఏ తెలుగువాడికీ సహాయపడకపోగా తనకలాంటి ఫీలింగ్స్ లేవని గర్వంగా చెప్పుకుంటాడు. తెలుగువాడికి అహంకారమే అన్నం. తోటి తెలుగువాడిని కించపరచడమే పరమాన్నం. అందుకనే తెలుగువాడు పైపదవికి చేరుకోవడం స్వర్గాన్ని చూసినట్టే అవుతుంది" అనుకున్నాడు కోలా

★ ★ ★

కోలా అమెరికానుంచి తిరిగి వచ్చాక పరిశోధన మొదలుపెట్టడం గురించి అడగాలని వెళ్ళింది ముక్త.

కోలా అప్పటికే ఎవరో విజిటర్స్‌తో మాట్లాడుతున్నాడు. ముక్తని చూసి పలకరింపుగా "ముక్తా! మనం వచ్చేవారం కలకత్తా సింపోజియంకి వెళదాం. శుక్లా, భల్లా కూడా వస్తున్నారు. ఆ ప్రయాణంలో నీ పరిశోధన గురించి క్షుణ్ణంగా పరిశీలిద్దాం" అన్నాడు.

విజిటర్స్ ఉండగా ముక్త ఏం మాట్లాడుతుంది? బయటకు వచ్చి లాబ్‌లో ఉన్న శుక్లా, భల్లాలని కలుసుకుంది. "సింపోజియమ్‌కి మీరు కూడా వస్తున్నారటకదా" అంది.

"అవును. ఈరోజే టికెట్స్ రిజర్వ్ చెయ్యడానికి పంపించాం"

"సీనియర్స్ మీరు వెళితే చాలుకదా" అంది ముక్త.

"ఈ సింపోజియంలు, కాన్ఫరెన్స్‌లు, వర్క్‌షాప్‌లలో చాలామంది అదే ఫీల్డుల్లో పనిచేసేవాళ్ళని కలుసుకుందుకు వీలవు

తుంది. ఆ ఫీల్డులో వర్క్ ఎలా ప్రోగ్రెస్ అవుతుందో తెలుసుకోడానికి ఓ చక్కటి అవకాశం. దానికి తోడు కొత్త ఊరు చూడ వచ్చు మేం కూడా వస్తున్నాంకదా. ఇది వర్లో మీకోసారి ఔరంగాబాద్ రావడానికి కుదరలేదు కూడా" అన్నారువాళ్ళు.

సరోజ, చందనలతో కాన్ఫరెన్స్‌కి వెళ్ళడం మాట చెబితే "ఇదివరలో ఒక్కదానివీ కోలాతో వెళ్ళడం నీకు ఇష్టం లేదన్నావు. ఇప్పుడు మరో ఇద్దరు స్టూడెంట్స్ కూడా ఉన్నారు. ఇక సమస్యేలేదుగదా" అన్నారు.

రైలు ఎక్కాక ముక్త కోలాకి, తనకి ఒక కూపే, భల్లా శుక్లాలకి ఒక కూపే రిజర్వు అయినట్టు గ్రహించింది. ఎవరిసీట్లకింద వాళ్ళు సూట్‌కేసులు సర్దారు.

ముక్త భల్లా, శుక్లాల దగ్గరకి వెళ్ళి "టికెట్ కలెక్టర్‌తో చెప్పి నాలుగుసీట్లున్న కంపార్ట్‌మెంట్ ఎలాట్ చేయించుకుందాం" అంది.

టి.సి. వచ్చినప్పుడు అడిగితే, "ఎవరూ ఒప్పుకోవడంలేదు. నలుగురూ ఒకే కుటుంబానికి చెందినవాళ్ళు. సారీ!" అన్నాడు.

"మీలో ఒకరు కోలా దగ్గర కూర్చోండి. నేనిక్కడ కూర్చుంటాను" అంది ముక్త.

"మాకు అభ్యంతరం లేదు. కోలా ఏమంటాడో. మీరు వెళ్ళి మీ సూట్‌కేస్ తెచ్చుకొని రండి. తర్వాత మాలోఒకరు వెళతాం" అన్నారు.

ముక్త కోలా ఉన్న కూపేలోకి వెళ్ళి తన సూట్‌కేస్ తీసుకుంటుంటే "ఏం ఎందుకు వెళ్ళిపోతున్నావ"ని కోలా అడిగాడు.

"నేను పక్క కూపేలో కూర్చుంటా. వాళ్ళిద్దరిలో ఎవరో ఒకరు వస్తా"రంది.

"సెభాష్ ముక్తా! నామీదకన్నా, వాళ్ళ మీద నీకున్న గొప్ప నమ్మకానికి థాంక్స్! కానీ నువ్వక్కడికి వెళ్ళి కూర్చుంటే నన్నవమానించినట్లే గదా" అంటూ ఫైరయిపోయి ముక్తని నానా మాటలూ అన్నాడు.

ముక్త పెదవి విప్పి "సారీ సర్" అంటూ సూట్‌కేస్ తీసుకొని, భల్లా, శుక్లాలున్న చోటుకి వచ్చింది.

"ఫ్రెండ్స్! ఎట్టి పరిస్థితులలోనూ ఈ ప్రయాణం ఇంక కొనసాగించలేను" అంది.

శుక్లా, భల్లాలు ముక్తని సమాధానపరచబోయారు. ముక్త వినలేదు.

"రైలు ఏదో స్టేషన్‌లో ఆగితే, ఆ స్టేషన్‌లో దిగిపోతాను. ట్రైన్ కదిలాక కోలా అడిగితే చెప్పండి. ముక్త ముందు స్టేషన్‌లో దిగిపోయింది, తనకీ ప్రయాణం ఇష్టంలేదని" అంది.

రైలుస్టేషన్‌లో ఆగగానే ముక్త దిగిపోయింది.

కోలా కాసేపటికి శుక్లా, భల్లాలున్న కూపేకి వచ్చాడు. కూర్చుని "ముక్త ఏది? " అనడిగాడు.

"ముందు స్టేషన్‌లో దిగిపోయింది. తనకీ ప్రయాణం ఇష్టంలేదని చెప్పింది" అన్నారు.

కోలా అగ్గిపోయాడు. రైల్వే పోలీస్‌కి కంప్లయింట్ ఇస్తానని చెప్పి, 'ముక్త అనే ప్రయాణీకురాలు కనిపించడం లేద'ని కంప్లయింట్ ఇచ్చాడు.

మర్నాడు పత్రికలలో ఈ వార్త చోటు చేసుకొంది. వెనక్కు వెళ్ళి యూనివర్శిటీ చేరుకొంది ముక్త. వేదవతిని, వరదని కలుసుకొని ఇద్దరికీ తను యూనివర్శిటీ వదిలి వెళ్ళిపోతున్నానని లిఖిత పూర్వకంగా రాసిచ్చింది.

వేదవతి ముక్తకేసి ఓ పిచ్చిదాన్ని చూసినట్టు చూసింది. ఆ చూపులో 'ఇంకా నయం, ఈ పిచ్చిది నా స్టూడెంటయితే నానా అవస్థలు పడవలసి వచ్చేది' అనే భావం కనిపించింది.

పత్రికల్లో వార్త చదివిన ముక్త తల్లితండ్రులు యూనివర్శిటీకి చేరుకొన్నారు. అప్పటికే ముక్త ఇంటికి వెళ్ళే ప్రయత్నంలో ఉంది.

చాలామంది ముక్తని అడిగారు. "నువ్వ

రైలులో మాయమైనట్టు పేపరులో వేసేరే మని? ”

“ఆరోగ్యం బాగోక ప్రయాణం మధ్యలో వచ్చేశాను. వాళ్లు పొరపాటుగా అర్థం చేసుకొని ఫిర్యాదు చేసి ఉంటార”ంది.

రంజిత్‌కి ఈ విషయం తెలిసి వచ్చేడు. “ముక్తా! తప్పు నీదికానప్పుడు ఊరుకోకూడదు. న్యాయం కోసం పోరాడాలి” అన్నాడు.

“నేనిహ ఇక్కడ ఉండడం జరగదు” అంది ముక్త క్లుప్తంగా.

ప్రయాణం మధ్యలో రావడానికి కారణాలు అనేకమంది అనేక రకాలుగా ఊహించుకొన్నారు. గుర్నాథం మిగిలిన ప్రొఫెసర్లతో మాట్లాడుతానంటే ముక్త ఒప్పుకోలేదు.

తల్లితండ్రులతోపాటు ఇంటికి చేరుకొంది ముక్త.

తీరికగా తల స్నానం చేసి జుట్టు ఆరబెట్టుకొంటూ ఆకాశంలో చుక్కల్ని చూస్తూ తనకున్న పరిశోధన చెయ్యాలనే కోరిక, సరదా అసలది మొదలు పెట్టకుండానే ఎలా ముగిసిపోయిందో తలచుకొంది. జీవితంలో అందరికీ అనుకొన్నవన్నీ జరగవులెమ్మని సమాధానపడింది.

★ ★ ★

కోలా ముందుగా ప్లాన్ చేసుకొన్నట్టు కలకత్తానించి జపాన్‌లో జరిగే ఇంటర్నేషనల్ వర్క్‌షాప్‌కి వెళ్లాడుగానీ కొంత అశాంతిగా ఉన్నాడు. సత్యం లాబ్స్ తనకి రానివ్వకుండా సోనావాలాకి ఇచ్చారనీ, ముక్త తనని కించపరిచిందనీ ప్రపంచమంతా తనపై కక్షకట్టి బాధిస్తున్నట్టుగా ఫ్రస్ట్రేషన్‌తో ఉన్నాడు.

కోలాకి మనసు బాగోనప్పుడు మరిన్ని అవకతవక పనులు చేస్తుంటాడు. సాయంకాలం టోక్యో నగరంలో చూడవలసిన ప్రదేశాలు చూస్తూ డిన్నర్‌కి ఓ రెస్టారెంట్‌కి వెళ్లాడు. అక్కడ గెయిషా అమ్మాయిలమీద చెయ్యివేసి చొరవ చూపించబోతే వాళ్లు తప్పు అని వార్నింగ్ ఇచ్చారు. అయినా వినిపించుకోకపోతే వాళ్లు ఫిర్యాదు చేశారు.

వద్దన్న పని ఎందుకు చేస్తున్నావని కోలాని సైకాలజిస్టు దగ్గరకు తీసుకు వెళ్లారు వాళ్లు. సైకాలజిస్టు కోలాని ప్రశ్నమీద ప్రశ్న వేసి కోలా ఫ్రస్ట్రేషన్ కారణంగా అతనికి అందుబాటులో ఉన్న స్త్రీలపై తన ఆధిక్యం చూపాలని ఇలాంటి పనులు చేస్తున్నాడని రిపోర్టు ఇచ్చారు. హార్మోనల్ ఇన్‌బాలెన్స్ ఉంది కాబట్టి హార్మోన్ ట్రీట్‌మెంట్ తీసుకోవాలని తేల్చేరు.

కోలా తిరిగి వచ్చి ట్రీట్‌మెంట్ తీసుకోసాగాడు.



పవన్ పాఠం చెప్పడానికి డిపార్టుమెంటుకి వెళ్లి వస్తున్నాడుగానీ వరదను కలుసుకొనే ప్రయత్నం మాత్రం చేయలేదు. వరద ఇంటికీ వెళ్లలేదు.

తులసి ఇంట్లో సామానులు అక్కరలేనివి అమ్మేస్తూ ఎటూ కానివి ఎవరికైనా ఇచ్చేస్తూ కావలసినవి పాక్ చేయిస్తోంది. పుస్తకాలు సర్దబోతూ సోఫాలో కూర్చొని టివి చూస్తున్న పవన్‌తో ‘అక్కర్లేని పుస్తకాలు, కాగితాలు వేరు చేస్తే అవసరమైనవి

పెట్టెలో సర్దుతా'నంది.

పవన్ లేచి రీడింగ్ రూంలోకి వెళ్లాడు. తులసి అలా కామ్‌గా ఉండకపోతే 'పవన్ నిన్ను విడిచి పెట్టి మేం ఉండలేము. అందరం కలిసే ఉందాం' అనవచ్చుకదా అనుకొన్నాడు.

రూంలో ఈ పుస్తకం ఆ పుస్తకం తిరగ వేసి తులసితో "ఏం వేరు చెయ్యక్కరలేదు. అన్నీ కావలసినవే! మామయ్య, నేహా ఎక్క డికి వెళ్లారు? " అన్నాడు.

"ప్లాస్టిక్ తాళ్లు తేవడానికి వెళ్లారు"

"ఈయనొకడు అన్నీ అందిస్తూ ఈవిడ ప్రయాణానికి సహాయపడుతున్నాడు" అను కొన్నాడు.

మనసుకు నిస్పృహ ఆవరించినట్టయి వెళ్లి పోస్ట్ చూసుకొన్నాడు. తర్వాత డిపార్టు మెంటులో చిన్నచిన్న పనులు చూసుకొని రోబోట్ సెంటర్‌లో కాగితాలు కొనుక్కునే నెపంతో అటు పక్కకి వెళ్లాడు.

అక్కడ వరద, జేజే కూల్ డ్రింక్ తాగుతూ కబుర్లు చెప్పుకొంటున్నారు. పవన్ రావడం చూసి వరద "ఓ పవన్ సారీ యార్! మదర్ పోయిందటకద సడ న్‌గానా? " అంది.

జేజే పవన్‌ని చూస్తూనే వీడొకడు మధ్యలో పానకంలో పుడకలాగ అనుకొ న్నాడు.

"వరదా! సాయంకాలం నాలుగు గంటలకి రెడీగా ఉండు. నాకు పని ఉం ది"అని వెళ్లిపోయాడు.

వరద "పేరెంట్స్ ఉన్నంత కాలం మనం చిన్న వాళ్లమికద! నీకో న్యూస్ పవన్! 'స్త్రీ సమానహక్కులు' గురించి మాట్లాడడానికి యు.ఎస్‌నించి ఆహ్వానం వచ్చింది" అంది.

పవన్‌కి వరద చెప్పేవి ఏవీ కూడా ఆసక్తి కలిగించలేదు. "కంగ్రాట్స్ వరదా" అనిచెప్పి మళ్లీ కలుసుకొందాం, పని ఉందని తిన్నగా ఇంటికి వచ్చేశాడు.

మర్నాడు పవన్ లేచి యూనివర్శిటీకి రావడానికి తయారవుతున్నాడు. టిఫిన్ తినడానికి టేబుల్ దగ్గరకి వచ్చాడు. "మామయ్య, నేహా ఏరీ? " అనడిగేడు తుల సిని.

"స్కూలుకి వెళ్లేరు టీసీ తెచ్చుకొందుకు"

"అలాగా" అన్నాడు. ఇప్పుడు టిఫిన్ తింటూ కూర్చొని ఏమాత్రం కాలయాపన చేసినా జీవితంలో తనకి తులసి, నేహా దక్కకపోవచ్చని వెంటనే నేహా చదువు తున్న స్కూలుకి బయలుదేరి వెళ్లాడు. పవన్ టిఫిన్ తినకుండా ఎందుకు వెళ్లిపో యాడో తులసికి అర్థంకాలేదు.

పవన్ స్కూల్‌కి చేరుకొనేసరికి అక్కడ నేహా, మామయ్య బయట వెయిట్ చేస్తు న్నారు ప్రిన్స్‌పాల్‌ని కలవడానికి.

పవన్ నోట్లోంచి మాట రాకుండానే వరద, మూడేళ్ల ముద్దులొలికే ఓ పాప, సల్వార్ కమీజు వేసుకొన్న ఓ టీనేజి అమ్మాయి బయటకి వచ్చారు.

వరద పవన్‌ని చూస్తూనే "హాయ్ పవన్! ఏంటిలా వచ్చావు. మీట్ మై క్యూట్ లిటిల్ ఏంజిల్ మై డాటర్ మాయ" అని మాయని ఎత్తుకొని చిన్నారి చేతిని పవన్ షేక్‌హాండ్ కని అందించింది. పవన్ చేతులు కలిపాడు.

"పవన్! నీకో సంగతి చెప్పాలి, అంటూంటే పనుందని వెళ్లిపోయావు. గుర్తుకి వచ్చిందా! అదే మాయ సంగతి. మాయని నేను లీగల్‌గా పెంచుకొన్నాను. స్కూల్లో పేరు రిజిష్టర్ చేయిద్దామని తీసు కువచ్చాను. ఈ అమ్మాయి రాణి అని అనా థాశ్రమం నించి మాయని చూసుకొందుకు తీసుకువచ్చాను. ఏడు పాసైంది. స్కూల్లో చేర్పిస్తాను. పోషణ, చదువు నేనే చూసు కొంటాను. మాయకి తోడుగా ఉంటుంది" అంది.

"చాలా బాగుంది వరదా! పాప ముద్దుగా ఉంది" అని వెంటనే

"మంచి పని చేశావు. ఒక జీవితాన్ని నిల

బెట్టేవు. ఇదిగో నా పాప నేహా" అంటూ నేహాని, మామయ్యని వరదకి పరిచయం చేశాడు.

"ఎడ్మిషన్‌కా? "

"కాదు పాప ఎలా చదువుతోందో ప్రిన్సిపాల్‌ని, టీచర్స్‌ని అడిగి తెలుసుకొందామని వచ్చాం"

మామయ్య మనసు సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతోంది. అయినా పైకి గంభీరంగానే ఉన్నాడు.

"వస్తాం వరదా! ఆల్ ది బెస్ట్! పద మామయ్యా. ప్రిన్స్‌పాల్‌ని కలుద్దాం" అంటూ మామయ్యని, నేహాని తీసుకొని లోపలికి వెళ్లి ప్రిన్స్‌పాల్‌తో పాప చదువు గురించి మాట్లాడాడు.

మామయ్య 'చచ్చిన పాముని ఇంకా చంపడం దండగ' అనుకొన్నాడు. ముగ్గురూ ఇంటికి తిరిగి వచ్చారు. ఎవరితోనూ ఎవరూ మాట్లాడుకోకుండానే టిఫిన్ తినడం పూర్తిచేశారు.

పవన్, తులసి సర్దడానికి పెట్టిన అట్టపెట్టెలు అక్కడనించి తీసేశాడు. తులసి అల్మారాలో దుమ్ము, ధూళి దులుపుతూంటే మామయ్య, నేహా పవన్‌కి పుస్తకాలు అందిస్తూ రూం సర్దుకోడానికి సహాయపడుతున్నారు. కొన్ని సమయాలలో మాటకి విలువలేదు అనిపిస్తుంది. ఫోన్ రింగవుతోంది. తులసి ఫోన్ రిసీవ్ చేసుకొంది. "నాన్నా ఫోన్"

"నేను రంగనాధాన్ని ఇల్లు అమ్ముదామన్నారుగా. వివరాలు అడుగుతున్నారు. చూడటానికి ఇంటికి తీసుకురానా"

"వద్దు రంగా. ఇల్లు అమ్మదలుచుకోలేదు" అన్నాడు తులసి తండ్రి.

★ ★ ★

ప్రొఫెసర్ అరుంధతి మరో ప్రొఫెసర్ రేవతితో చెప్పుకుంది.

"అసలేమైందో తెలుసా? మన హెడ్ ప్రొఫెసర్ పరాంకుశం, నేనూ ఒకే క్లాసులో చదువుకొన్నాం. ఇంగ్లీషు సరిగ్గా రాక నా దగ్గరకి వచ్చి నేర్చుకొనేవాడు. చదువులు పూర్తి చేసుకొని ఇక్కడికి ఇంటర్వ్యూకి వచ్చాం. ఇద్దరినీ ఎంపిక చేశారు. చేరడానికి నేనో మంచి రోజు చూసుకొని మా ఊరు నించి టికెట్ కొనుక్కొన్నాను. ప్రొఫెసర్ పరాంకుశానిది కూడా మా ఊరేకద! రెండు రోజుల తర్వాత బయలుదేరుతానన్నవాడు ఎవరికి ఎవరు, ఎలా ఏం చెప్పారో తెలీదు. నేను బయలుదేరే రోజుకే టికెట్ మార్పించుకొన్నాడు. ఇద్దరం స్టేషన్‌లో దిగాం.

"పరాంకుశం మగమహారాజుకద! బాత్ రూంలో క్రాఫ్ సరిచేసుకొన్నాడు. జీన్స్ పాంట్, టీషర్టు నలిగే ప్రసక్తే లేదు. బావమరిది కారుతో స్టేషన్‌కి వచ్చి రిసీవ్ చేసుకొన్నాడు. సరాసరి డిపార్టుమెంటుకి వెళ్లి జాయిన్ అయినట్టు సంతకం పెట్టాడు.

నేనా ఆడదాన్ని. నలిగిపోయిన చీర, చెదిరిపోయిన జుత్తుతో సరాసరి డిపార్టుమెంటుకి ఎలా వెళతాను? ఊరవతల చుట్టాలింటికి వెళ్లి తయారై డిపార్టుమెంటుకి చేరేసరికి మధ్యాహ్నమైంది.

అంతే. నాకన్న నెల తక్కువ వయసున్న పరాంకుశం సీనియర్ అయ్యాడు. ఈ రూల్సు నాకు తెలియవు. ఎవరూ చెప్పలేదు. ఆ పరాంకుశానికి ఈ విషయాలన్నీ ఎలా తెలుస్తాయో అయినా మగవాళ్లంతా ఒకటై నన్ను అన్యాయం చేశారు. ఆ తర్వాత డిపార్టుమెంట్‌ని తన ఇష్టం వచ్చినట్టు నడుపుతూ తనకి కావలసిన వాళ్లని ఎక్కడ పడితే అక్కడ పెడుతూ పాపులర్ అయిపోయాడు" అని బాధపడి క్లాసులోకి వెళ్లింది అరుంధతి.

సిలబస్ పూర్తి చెయ్యాల్సిన టైం అది. క్లాసులో పాఠం చెప్పవలసిన గంటా అయిపోతే ఆ తర్వాత క్లాసు పరాంకుశానిది.

పరాంకుశం క్లాస్‌కి రాగానే అరుంధతి నవ్వు పులుముకొన్న మొహంతో బయటకి నడిచింది.

పరాంకుశం అరుంధతి చేతిలో ఏమీ లేక పోవడం, టేబుల్ మీదైనా అటెండెన్స్ రిజిష్టర్ లేకపోవడం గమనించాడు.

క్లాస్ అయిన తర్వాత పరాంకుశం అరుంధతికి కామన్ రూంకి రమ్మని ఫోన్ చేశాడు.

అరుంధతి 'తనని రమ్మని పరాంకుశం ఫోన్ చేస్తాడా? తనే రావచ్చుకదా! హెడ్ ననే అహంకారం కాబోలు' అని కాసేపు బాధపడి 'ఆ అధికారం అతనికి ఉందికదా మళ్లీ ఫోన్ చేయవచ్చు అనుకొంటూ కామన్ రూంకి చేరుకొంది.

పరాంకుశం అరుంధతిని కూర్చోమని "మీరు రెగ్యులర్‌గా ఎటెండెన్స్ తీసుకొంటున్నారా? ఓసారి ఎటెండెన్స్ రిజిష్టర్ తీసుకువస్తే చూద్దాం" అన్నాడు.

"వాట్ పరాంకుశం నన్ను ఇలాటి ప్రశ్న మీరు అడగడమా? తీసుకొంటున్నాను"

"నాకిలాంటి స్వల్పవిషయాలు పట్టించుకొనే ఉద్దేశ్యం ఎంతమాత్రం లేదు. మన డిపార్టుమెంటులో అన్ని పనులు సక్రమంగా జరిగేలా చూడాలికద. ఎలిమెంటరీ స్కూల్లో కొత్త టీచర్‌ని అడిగినట్టు మిమ్మల్ని అడగడం నాకూ బాగోలేదు. సెమిస్టర్ చివరకి వస్తున్నాం. పరీక్షల ముందు ఎటెండెన్స్ డెబ్భై అయిదు పెర్సెంట్ ఉంటేనే పరీక్ష రాయనిస్తారు. లేకపోతే మెడికల్ సర్టిఫికేట్ జత చేస్తే కాని పరీక్షకి కూర్చోనివ్వరు. ఈ ఫార్మాలటీస్ అన్నీ చూడాలికదా" అన్నాడతను.

"పరాంకుశం! ఈ ఎటెండెన్స్ ఏమిటి? చిన్న తరగతులలో పిల్లలకి చదువు విలువ తెలియక తప్పుదారి పట్టి క్లాసులు ఎగేస్తున్నారేమోనని తల్లితండ్రులకి చెప్పడానికి ఈ తతంగమని నా ఉద్దేశ్యం. వయసొచ్చి పెద్ద చదువులు చదువుతున్న వాళ్లకి ఎటెండెన్స్ ఏమిటి నాన్‌సెన్స్"

"మన అభిప్రాయాలు ఇక్కడ పనిచెయ్యవు. మనం పని చేసే సంస్థ కొన్ని నిబంధనలు పెట్టింది. వాటి పరిధిలోనే మనం పనిచెయ్యాలి" అన్నాడు పరాంకుశం. ఈవిడ ఇంత వాగ్వివాదం చేసే కన్నా ఎటెండెన్స్ తీసుకొంటే సరిపోయేది కదా! అనుకొన్నాడు.

"నాకు పది నిమిషాలకన్నా టైం లేదు. ఓ మీటింగ్‌కి వెళ్లాలి. మీరు తొందరగా ఆ రిజిష్టర్ తీసుకువస్తే"

"సారీ ఇవాళ నా బీరువా తాళాలు మరిచిపోయాను. రేపు తెచ్చిస్తాను" అంది అరుంధతి.

"రిజిష్టర్ మీ బీరువాలో ఎందుకు పెడుతున్నారు? కామన్ రూంలో క్లర్క్ దగ్గర బీరువాలో పెట్టాలి. మీరు క్లాస్‌కి వెళుతున్నప్పుడు తీసుకెళ్లి తిరిగి వచ్చాక క్లర్క్‌కి ఇస్తే బీరువాలో భద్రం చేస్తాడు. మేమంతా అలా చేస్తాం"

"ఏం బ్యూరోక్రసీ పెట్టారు. విద్యా సంస్థలు ఇలా మీలాంటి వాళ్ల చేతుల్లో పడి విద్యార్థులు, ఉపాధ్యాయులు రూల్సు పాటిస్తూ కాలం గడుపుతూ అసలు పని మరిచిపోతున్నారు" అందామె.

పరాంకుశం బ్లడ్‌ప్రెషర్ పెరిగిపోతోంది. ఏం చెయ్యలేని అశక్తత. ఆడవాళ్లు, మగవాళ్లు సమానం అంటూ అన్ని రంగాలలోకి వస్తున్నారు. 'ఆడవాళ్లు' అని సర్దుకుపోవడం అనే లక్షణం ఎప్పటికి తుడిచిపెట్టుకుపోతుందో అనుకొంటూ నుదురు తుడుచుకొన్నాడు.

"అసలు మెడికల్ సర్టిఫికేట్ డబ్బు పడేస్తే వస్తుందని మనకి తెలుసు. ఆ సర్టిఫికేట్ చూపించి అటెండెన్స్ లేకపోయినా పరీక్షకి కూర్చుంటాడు. డాక్టర్‌లు బాగుపడడానికి వచ్చిందీ రూలు"

పరాంకుశం లేచాడు. అరుంధతితో నిత్యం జరుగుతున్న సంభాషణలు అతనిలో సహనాన్ని చంపేస్తున్నాయి. ఏ పనీ పద్ధతిగా చెయ్యదు. ఏమన్నా తనకో గంట క్లాస్. ఎవరితో చెప్పినా డిపార్టుమెంటన్నా,

హెడ్ అన్నా లోకువ అవడమే కాని పరిష్కారం కనిపించదు. ఓ డిపార్టుమెంట్ లో గొడవలు జరిగితే మిగితా డిపార్టుమెంటు వాళ్ల దగ్గర చులకనై పోతామనే బాధ పరాంకుశంలో రగులుతుంటుంది.

"మేడమ్ మీతో ఆర్యూ చెయ్యలేను. రేపు పొద్దున్న మీరు పది నిమిషాలు డిపార్టుమెంటుకి ముందుగా వచ్చి అటెండెన్స్ రిజిష్టర్ తీసుకురండి" పరాంకుశం బయటికి నడిచాడు.

అరుంధతి లేచింది. ఎవడిచ్చాడీ బోడి అధికారం. నేను నాలుగు గంటలు ఆలస్యంగా రాబట్టి ఇవాళ తనని నిలదీసి ప్రశ్నలు వేసి సాధిస్తున్నాడనుకుంది.

బీరువాలో చూస్తే ఎటెండెన్స్ రిజిష్టర్ లేదు. ఏం చెయ్యాలో పాలుపోలేదు. క్లర్క్ జోగారావుని డిపార్టుమెంటు బీరువాలో ఉందేమో చూడమంది.

క్లర్క్ జోగారావుకి అరుంధతి స్వభావం క్షుణ్ణంగా తెలుసు కాబట్టి "నాకు మీరు ఇచ్చారో లేదో గుర్తులేదు. బీరువాలో బోలెడన్ని ఫైల్స్, మీరు ఓసారి ఇస్తారు. ఓసారి ఇవ్వరు" అంటున్న అతని మాటలలో విసుగు ధ్వనిస్తోంది.

"పొద్దున్న నే వచ్చేసరికే పదీ పదిన్నరవుతుంది. బస్సులు దొరకవు. పరాంకుశం గారు రోజూ నన్ను టైంకి రావడంలేదని సాధిస్తున్నారు. నాకేం కారా, స్కూటరా? స్కూటర్ లోన్ పెడితే ఇవ్వలేదు. నాకన్నా సీనియర్స్ చాలామంది ఉన్నారుట. మీలాంటి వాళ్ళు రికమెండ్ చేస్తే ఏమైనా లైన్ తగ్గుతుందేమో" అన్నాడు క్లర్కు.

"నేనేం చెయ్యగలనయ్యా. హెడ్‌ని కాదు కదా

"నేను బస్ దొరకక ఆలస్యంగా వచ్చి ఆ టెన్షన్‌లో ఉంటే, రాగానే పిడుగులు పడేట్టు చూస్తారు. నా సంతకాలు చూడండి. ఎంత టెన్షన్ లేకపోతే అంత వంకర టింకరవుతాయి. ఆ టెన్షన్‌లో టీ చుక్కలు తాగాలని క్యాంటీన్‌కి వెళితే, తిరిగి రాగానే నానామాటలన్నారు. రోజుకి ఒకే ఒక లెటర్ చూస్తానట. కంప్యూటర్ నాకు కొత్త. నాలుగురోజులు అలవాటు పడాలి అంటే వినిపించుకోరే. నేను విసిగిపోయి పన్నెండున్నరకి లంచ్‌కి వెళ్ళాను. మాకూ బ్యాంక్ పనులుంటాయి. రోగాలు వస్తాయి. పండుగకి లోన్ ఇస్తారని తెలిసి వివరాలు కనుక్కొందుకు వెళ్ళాను. అంతే! నువ్వేం పని చెయ్యడం లేదు. మూడయిపోయిందంటూ గొడవ. నా మూడ్ పాడయిపోయి ఏ పనీ చెయ్యలేకపోయాను. దానికి తోడు మా నాయనమ్మకి ఒంట్లో బాగోలేదని ఫోన్"

అరుంధతికి ఈ మాటలు పరమబోర్‌గా ఉన్నాయి. అయినా అవసరం తనది కనక "ఓ రెండు వందలు కావలిస్తే తీసుకుని మీ నాయనమ్మ పెద్దావిడ చూసిరండి. వెళ్ళే ముందు నాకారిజిష్టర్ వెతికి ఇవ్వండి" అంది.

జోగారావు థాంక్స్ చెప్పి జేబులో రెండొందలు సర్దుకున్నాడు. రిజిష్టర్‌కోసం వెతుకుతున్నాడు.

"సరే మీరోపని చెయ్యండి. నేను ఇంటికి వెళ్ళాలి. అటో ఇటో ఆ ఎటెండెన్స్ రిజిష్టర్ తీసుకుని టిక్కుపెట్టండి. పిల్లలందరూ వస్తూనే ఉన్నారు"

జోగారావు ఈ తలనొప్పి వ్యవహారం చేయదలుచుకోలేదు. "సారీ! నేను ఎటెండెన్స్ రిజిష్టర్ బీరువాలోను, ఫైల్స్ క్యాబినెట్స్‌లోనూ ఎక్కడైనా ఉందేమో వెతికివ్వడం వరకే. ఎటెండెన్స్ వెయ్యడంలాంటి పనులు నాకు రావు"అన్నాడు నిర్మొహమాటంగా.

అరుంధతి "సరే. అదైనా వెతికివ్వండి" అంటూ ఇంటికి బయలుదేరింది.

మర్నాడు అరుంధతి రోజూకన్నా అర గంట ఆలస్యంగా వచ్చింది. అప్పటికి పరాంకుశం క్లాసుకి వెళ్ళిపోయాడు. అరుంధతి తర్వాత కూడా ఎటెండెన్స్ రిజిష్టర్‌తో పరాంకుశం రూంకి వెళ్ళలేదు. అవసరమైతే

మళ్ళీ అతనే ఫోన్ చేస్తాడని ఊరుకుంది.

మధ్యాహ్నం లంచ్ సమయంలో అరుంధతిని చూసి పరాంకుశం, "మీరు పొద్దున్న వస్తారని చూశాను రాలేదు" అన్నాడు.

"లేటయింది. కారు టైర్ పంక్చర్" అరుంధతి ఆ రిజిష్టర్ మాట ఎత్తలేదు.

పరాంకుశానికి ఒళ్ళు మండింది. "రిజిష్టర్ తీసుకుని రండి. చూద్దాం"

"వస్తా. క్లాసుంది" అంటూ వెళ్ళిపోయింది. ఆ రోజు కూడా పరాంకుశాన్ని కలుసుకోలేదు. క్లాసు తర్వాత ఇంటికి వెళ్ళి ఎటెండెన్స్ రిజిష్టర్‌లో తన ఇష్టం వచ్చినట్టు మార్క్ చేసి మర్నాడు తీసుకువచ్చింది.

పరాంకుశం రిజిష్టర్ చూసి, "మీరు శని, ఆదివారాలు, పండగరోజులు అన్నిటికి ఒకే రకంగా హాజర్ వేశారు" అన్నాడు.

"మీరేదో విధంగా నన్ను పట్టి సాధించాలని చూస్తున్నారు"

పరాంకుశానికి ఏం చెయ్యాలో పాలుపోవడంలేదు.

"ఆ తేదీలు జాగ్రత్తగా చూసి కరెక్ట్ చేసి ఇవ్వండి. ఈ రోజునుంచి ఏ రోజుకారోజు హాజరు తీసుకోండి"

అరుంధతి రూంకి వచ్చింది. స్టూడెంట్ గోపాల్ పుస్తకం అడగడానికి వచ్చి నిలబడి ఉన్నాడు.

"గోపాల్ నువ్వీ రిజిష్టర్ జాగ్రత్తగా చూసి శని, ఆదివారాలు, పండగరోజులు, క్లాసు తీసుకున్నట్టు మార్క్ చేశాను. అలాటి పొరపాటు లేకుండా సరిదిద్దు" అని రిజిష్టర్ ఇచ్చింది.

ఈ సీను పక్కనుంచి చూసి జోగారావు పరాంకుశానికి తెలియచేశాడు.

పరాంకుశం మురికివాడలలో నివసించే బాలబాలికలకు చదువును గురించిన అవగాహన ఎంతవరకూ ఉందనే అంశంమీద వ్యాసం తయారుచేస్తూ అతని ప్రపంచంలో అతనున్నాడు.

ప్రశాంతమైన కొలనులో రాయి విసిరితే వచ్చిన వలయాలలా అతని ఆలోచనలు చెదిరిపోయి జోగారావుని నానా మాటలన్నాడు. జోగారావు పరిస్థితి "రాజుగారూ ఫలానావాడు మిమ్మల్ని వెధవ అన్నాడు" అని కబురు మోసుకొచ్చినవాడి తంతైంది.

"నీ పని నువ్వు చూసుకో" అని జోగారావుకి గట్టిగా వార్నింగ్ ఇచ్చాడు.

బాధ్యతగా ప్రవర్తించని వ్యక్తులమధ్య ఉన్నప్పుడు బాధ్యతగల వ్యక్తి అనుభవించే ఆవేదన ఆ వ్యక్తికే పరిమితమవుతుంటుంది. రిజిష్టర్ దిద్ది బయటికి వస్తున్న గోపాల్‌తో పరాంకుశం "స్టూడెంట్ చెయ్యాల్సిన పనులు స్టూడెంట్స్ చెయ్యాలి. అనవసర విషయాలలో తల దూర్చకూడదు" అన్నాడు. గోపాల్ పిల్లిలా బయటికి జారుకున్నాడు.

న్యాయానికి గోపాల్‌ని కాదు కంట్రోల్ చెయ్యాల్సింది. ఆ సంగతి పరాంకుశానికి తెలుసు.

★ ★ ★

సాగర్ చైనీస్ డిప్లమా పూర్తి చేశాక తనకి ఈ యూనివర్సిటీలో స్థానం లేదని తెలుసుకుని మానసికవ్యధ అనుభవిస్తున్నాడు. తన తప్పులేకుండా తనకి జరిగిన దాంతో ఏ సంబంధంలేకపోయినా శిక్ష అనుభవించవలసి వచ్చినందుకు తనమీద తనే జాలిపడుతున్నాడు.

హాస్టల్‌కి నడిచిపోతుంటే తోవలో రంజిత్ ఎందుకు కలవాలి? లిఫ్ట్ ఎందుకు ఆఫర్ చెయ్యాలి? నేనైనా నడిచి వెళతాననో, రోబోట్ సెంటర్‌లో పని చూసుకుని వస్తాననో ఎందుకు అనలేకపోయానో? అని పరిపరివిధాలా ఆలోచిస్తున్నాడు. ఇంటిదగ్గర ఈ సంగతులు ఎవరికీ చెప్పలేదు. ఎవరున్నారు గనుక!... అమ్మ... అమ్మ ఉంది, అంతే!

సాగర్ తండ్రి నారాయణది తరతరాలుగా వస్తున్న వ్యాపారస్థుల కుటుంబం. సాగర్ తండ్రికి ఆరుగురు పిల్లలు పుట్టాక

భార్యపోయింది. పిల్లలని చూసుకొంటుందంటూ కొంచెం సంపద తక్కువగా ఉన్న కుటుంబంలోంచి వచ్చిన సాగర్ తల్లిని పెళ్ళి చేసుకున్నాడు.

నారాయణ పెద్దభార్య పిల్లలకి, నారాయణ పెళ్ళిచేసుకోవడం ఇష్టంలేదు. నారాయణ రెండోభార్య వసుమతి ఎంతో నేర్పుగా ఇల్లు దిద్దుకుంటున్నా ఎంతో ఓర్పుగా పిల్లలని చూసుకుంటున్నా తప్పులెంచడానికే చూసేవారు.

ఈ పరిస్థితులలో పెళ్ళయిన ఏడాదికే వసుమతి నెలతప్పడం ఆవిడ చేసిన ఓ పెద్ద ఘోరంగా జరగరానిపని జరిగినట్టుగా సవితి పిల్లలు తీర్మానించారు.

చివరికి నారాయణ కూడా తానేదో చెయ్యకూడనిపని చేసినట్టు ఫీలవసాగాడు. ఆత్మన్యూనతా భావంతో వసుమతిని సరిగా పలకరించడం కూడా అపురూపమైపోయింది.

సాగర్ పుట్టాక వసుమతి సాగరే తన ప్రపంచం అన్నట్టు గడిపింది. సవితి పిల్లలెవ్వరికీ చదువు అబ్బలేదు. ఆడపిల్లలిద్దరూ ఇంటర్ అతికష్టంమీద పూర్తిచేశారు. పెళ్ళిళ్ళు చెయ్యడం కష్టమైంది. చదువుల్లేఫని డబ్బులెక్కువ తీసుకున్నారు. కొడుకులు నలుగురూ ఏళ్లకి ఏళ్ళు చదివి డిగ్రీ పూర్తయిందనిపించి ఫ్యామిలీ బిజినెస్‌లో చేరిపోయారు. ఉమ్మడి కుటుంబం, పెద్ద ఇల్లు, వంటవాళ్ళు, పనివాళ్ళు, చుట్టాల రాకపోకలతో ఎప్పుడూ సందడిగా ఉండేది.

సాగర్ బాగా చదువుకుంటున్నాడంటే కారణం వసుమతే. ఏరోజు పాఠం ఆరోజు ఇంటిదగ్గర చదివించి, హోంవర్క్ చేయించి మంచిమార్కులు వచ్చేలా చూసేది. సవితి పిల్లలు వసుమతి వచ్చేసరికే చదువుల్లో ఉన్నారు. చిన్నవాళ్ళకి పాఠం చెబుతానన్నా మాకు ట్యూషన్‌లు ఉన్నాయి. నువ్వు చెప్పడం ఎందుకు? అనేవాళ్ళు

సాగర్ పదోక్లాసులో స్టేట్‌లో ఐదోర్యాంక్ తెచ్చుకున్నాడు. అది వసుమతి సవితి పిల్లలకి చాలా బాధ అనిపించింది. సాగర్ చదువు ఆపాలని, కంప్యూటర్ బిజినెస్ చూడమని సలహా ఇచ్చారు. వసుమతి భర్తకి మొదటిసారి తన కోరికేమిటో చెప్పింది. సాగర్ ఎంతకాలం ఎన్ని డిగ్రీలు చదువుతానంటే అంతకాలం చదువు చెప్పించాలంది.

ప్రస్తుతం సాగర్ లేకపోయినా బిజినెస్ నడుస్తోంది.

వసుమతి సాగర్ ఇంట్లోనే ఉండి చదివితే ఆటంకాలు తప్పవని ఊహించి, రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీలో చేర్పించింది. సాగర్ ఇంటర్‌లో మంచి ర్యాంక్ తెచ్చుకున్నాడు. సాగర్‌కి ఫిజిక్స్ చదివి రేడియాలజీలో రిసెర్చి చెయ్యాలనే ఆలోచన ఉండి ఇంజనీరింగ్ ఎంట్రెన్స్ పరీక్షలకి కూర్చోలేదు.

ఈ యూనివర్శిటీలో పోస్టు గ్రాడ్యుయేషన్ చేసి పి. హెచ్. డి. చేద్దామనుకుంటే ఏ కారణాలు వల్లనైతేనేమి సాధ్యంకాలేదు.

పై ఊరు వెళ్ళి రిసెర్చి చెయ్యడానికి సాగర్ తల్లి ఆరోగ్యం బాగోలేదు. కేన్సర్ వ్యాధితో ట్రీట్‌మెంట్ తీసుకుంటోంది. భర్తగా నారాయణ వసుమతికి డబ్బు ఖర్చు పెట్టి మంచి వైద్యం చేయిస్తున్నాడు. ఆప్యాయంగా పలుకరించేవాళ్ళు వసుమతికి ఆ ఇంట్లో ఎవరూలేరు.

వారానికోరోజు సాగర్ హాస్టల్‌నుంచి వచ్చి, ఒక్కరోజు అమ్మదగ్గర ఉండి ఆవిడకి సపర్యలు చేసి కావలసినవి తెలుసుకొని తండ్రితో మాట్లాడి వస్తూంటాడు. రోజూ ఫోన్ చేసి వసుమతితో మాట్లాడి ఆరోగ్యం సంగతి తెలుసుకుంటూ ఉంటాడు. ఇటువంటి పరిస్థితులలో సాగర్‌కి పి. హెచ్. డి.కి ఈ యూనివర్సిటీలో సీటు రాకపోతే భైరవ యూనివర్సిటీలో అదే సబ్జక్ట్ ఉందంటే కొంచెం దూరమైనా అక్కడా ప్రయత్నించాడు. అక్కడా దొరకలేదు. తల్లి అనా

రోగ్యం కారణంగా చాలా దూరం వెళ్ళి చదువుకునేకంటే ఇక్కడే ఈ ఏడాది చైనీస్ డిప్లమా పూర్తిచేసి వచ్చే ఏడాది ప్రయత్నించాలి అనుకున్నాడు.

సాగర్ తన స్వవిషయాలు ఎవరికీ చెప్పే రకం కాదు. ఇప్పుడు చైనీస్ డిప్లమా తీసుకుని ఈ యూనివర్సిటీ వదిలి వెళ్ళిపోవాలి. తనకి జరిగిన అన్యాయాన్ని అర్థం చేసుకుని ఓదార్చి ధైర్యం చెప్పేవాళ్ళు ఎవరూ లేరనుకున్నాడు. అమ్మ అర్థం చేసుకునేదే కానీ ఆవిడ అనారోగ్య దృష్ట్యా ఆవిడకి చెప్పబుద్ధి కాలేదు. తనలో తనే వేగిపోతున్నాడు.

తలుపు చప్పుడైతే లేచి తీశాడు. ఎదురుగా రంజిత్.

"సాగర్! సారీ బ్రదర్, నీకు అన్యాయం చేశాను. నేననుకున్నదొకటి. అనుకోకుండా అలా జరిగిపోయింది. నాకు శిక్ష పడి నిన్ను వదిలిపెట్టినా న్యాయం జరిగింది అనుకునేవాణ్ణి. అనవసరంగా నువ్వు చిక్కుకున్నావని చాలా బాధపడుతున్నాను"

"ఎవరి గీత ఎలా రాసుందో ఏం చెప్పగలం రంజిత్. నన్ను చూసి నేనే జాలిపడే స్థితిలో ఉన్నాను."

కామన్ రూంనుంచి ఫోన్ వచ్చిందని, సాగర్ తండ్రి లైన్‌లో ఉన్నారని సాగర్‌కి మెసెంజర్ వచ్చి చెప్పాడు.

రంజిత్, సాగర్ ఇద్దరూ నడుచుకుంటూ వెళ్ళారు. సాగర్ ఫోన్ తీసుకున్నాడు "హలో"

"సాగర్ నాన్నని మాట్లాడుతున్నా. మీ అమ్మ ఇకలేదు. వెంటనే బయలుదేరి రా" అన్నాడు.

"రంజిత్... అమ్మ నాకు దూరమై నా సమస్య సాల్వ్ చేసింది. నేను పై చదువులకి ఈ విశాల ప్రపంచంలో ఎక్కడికైనా వెళ్ళవచ్చని, పరోక్షంగా చెప్పి వెళ్ళిపోయింది" అని సాగర్ భోరున ఏడ్చాడు.

రంజిత్ సాగర్‌ని ఓదార్చి ఇంటిదగ్గర దింపి అంత్యక్రియల కార్యక్రమాలలో తనకు వీలైన సహాయం చేసి మరీ తిరిగివచ్చాడు.

సాగర్ యూనివర్సిటీలో జరిగిన విషయాలు ఎవరికీ చెప్పలేదు. చెప్పినా మహా బాగా అయిందని సంతోషించే వాళ్ళే తప్ప తనకోసం బాధపడేవాళ్ళు లేరు.

కర్మకాండ జరిగాక సాగర్ ఇంక చదవడానికి వీలులేదని, బిజినెస్‌లో చేరాలని అన్నదమ్ములు పట్టుపట్టారు.

చదువు విలువ తెలియని ఈ మూర్ఖుల బుద్ధి వేరే విధంగా చెబుదామనుకున్నాడు. అది విలువ తెలియకకాదు అసూయ అని కూడా సాగర్‌కి తెలుసు. కంప్యూటర్ బిజినెస్‌లో చేరిపోయి జి.ఆర్.ఇ.కి ప్రిపేరవుతున్నాడు సాగర్. తనకి తప్పక రేడియాలజీలో పరిశోధనకి అవకాశం దొరుకుతుందని, దృఢవిశ్వాసంతో ఉన్నాడు సాగర్.

★ ★ ★

సుమిత్ర పెళ్లినించి తిరిగి వచ్చింది. పెళ్లిలో సరదాగా కాలక్షేపం చేద్దామంటే అంతా పల్లెటూరు మేళం. ఉత్త పంచెగాళ్లు. చదువూ దండగ్గైంది. ఎంజాయ్ చెయ్యలేక పోయానని రూంమేట్ శాంతితో చెప్పుకొని వాపోయింది.

"అయ్యో అలాగా నీకెన్ని కష్టాలొచ్చాయి?"

"మరీ అంత తీసిపారెయ్యకు. ఓ లా స్టూడెంట్‌ని పట్టి, పరిచయం పెంచుకొని పల్లెటూళ్లో పొలాలగట్లు, చెరువుగట్లు, పళ్ల తోటలు తిరిగివచ్చాను. కాని ఉట్టి పల్లెటూరు సరుకు. సరసం తెలీదు"

"ఊ ఇంకా చెప్పు"

"పల్లెటూళ్లో వయసులో ఉన్న ఆడ, మగ నడిస్తే చాలు పెళ్లి వరకూ వెళ్లిపోతారు. కొంతమంది 'ఆ అబ్బాయిని పెళ్లి చేసుకొంటావా?' అని నన్ను అడిగారు.

"నాకు పల్లెటూళ్లు అసలు పడవు. నాకా ప్రదేశాలన్నీ బాగా తెలుసు తీసుకు వెళతానంటే వెళ్లాను. నాకు పెళ్లికి తొందరేం లేదు. మా అమ్మానాన్నా కుదురుస్తారని

చెప్పాను. అబ్బ వాళ్లంతా నన్ను ఎంత మెచ్చుకొన్నారో? ఏంటే శాంతీ విశేషాలు మన యూనివర్సిటీలో"

"ఆ రంజిత్, ఇంకో స్టూడెంట్ సాగర్ ఏదో క్వశ్చన్ పేపర్ తీశారని కేసుపెట్టి ఇద్దరికీ ఈ సంవత్సరం చదువు అయిపో యాక ఇంక ఏ కోర్సులోను ఇక్కడ చదివే అర్హత లేదని తీర్పు ఇచ్చారు"

"అయ్యో అలాగ!" సుమిత్ర గుండెల్లో రైళ్లు పరిగెట్టాయి. శాంతి అందించిన సమా చారాన్ని బట్టి బహుశా తనడిగిన పేపర్ తియ్యబోయి రంజిత్, సాగర్ పట్టుబడి ఉంటారని గ్రహించుకొని ఈ మాట ఇంక ఎక్కడా వినకూడదు, అనకూడదు, అడగకూ డదు అనుకుంటూ తేలుకుట్టిన దొంగలా అక్కడినించి జారుకొంది. శాంతి తన అల్మారా సర్దుకొంటోంది.

సుమిత్ర మెస్ వేపు పని ఉన్నట్టుగా వెళ్లి రూంకి తిరిగొచ్చింది. కాసేపటికి పక్కరూం ఉష సుమిత్రని చూసి "ఊరి నించి వచ్చి అన్ని విశేషాలూ అందరికీ చెప్పకుండా సుమిత్ర రూంలో అరెస్ట్ అయి పోవడమా? " అంది.

"కాలు బెణికింది. దిగాలంటే కష్టం. ఎక్కాలంటే కష్టం" అంటూ తప్పించుకొంది.

"నీకిష్టమైతే ఎన్నిసార్లయినా ఎక్కి దిగు తావు. లెక్కపెట్టడం మాకు సాధ్యమయ్యే పనా! అవును పెళ్లి విశేషాలు చెప్పు"

"ప్లీజ్ ఉషా! పెళ్లి బాగానే అయింది. నేను చదువుకోవలసింది చాలా ఉంది. పద ముందు భోజనానికి పోదాం. భోజనం చేస్తూ చెబుతాను"

"శాంతీ వస్తావా"

"రాను. భోజనం చేస్తే నాకు నిద్రవ స్తుంది"

"ఇదొకత్తి పుస్తకం పురుగు" అనుకుంటూ డైనింగ్ హాల్‌వైపు నడిచారు.

భోజనాలయ్యాక రూంకొచ్చి సుమిత్ర పుస్తకాలు ముందేసుకొని లెక్కలు చెయ్య బోతే అంతా అయోమయంగా ఉంది. ఒక్క స్టెప్పూ గుర్తుకు రావడంలేదు. 'అసలు పరీ క్షలు రాయకుండా ఇంటికెళ్లిపోతే' అను కొంది సుమిత్ర. మళ్లీ తల్లీతండ్రీ తిడతారని పరీక్షలు రాసే వెళ్లాలనుకొంది. ఇలా ఊగి సలాటగా ఉంది వ్యవహారం.

"శాంతీ బుర్ర పని చేయడం లేదే! రోబోట్ సెంటర్‌కి వెళ్లి కాఫీ తాగుదాం రా"

శాంతి రానంది. పైగా"నువ్వా వెళ్లకు కాలునొప్పి అన్నావు కదా" అంది.

"శాంతీ పద నా కాలు ఎలా పోతే నీకెం దుకు? " అంటూ శాంతిని బలవంతంగా రోబోట్ సెంటర్‌కి తీసుకువెళ్లింది.

ఇద్దరూ కాఫీ తాగుతున్నారు. రంజిత్ వచ్చాడు. రంజిత్ దగ్గరకి హడావిడిగా వెళ్లి సుమిత్ర రంజిత్‌చేతిలో రెండొందలు పెట్టి "థాంక్స్ రంజిత్" అని చేతిలోని సగం తాగిన కాఫీ కప్పు అక్కడే వదిలిపెట్టి ఎవరో తరుముకు వస్తున్నట్టు శాంతిని కూడా తొందరపెట్టి హాస్టల్ రూంకి వచ్చిప డింది.

రూంకి చేరారు. సుమిత్ర మంచంమీద పడుకుని "అమ్మయ్య! రంజిత్‌కి రెండొం దలు ఇచ్చేశాను. ఇంక నా కోసం అతను వెతుక్కుంటూ రాడు. ఇక ఈ జన్మలో అత నితో మాట్లాడక్కరలేదు"అనుకొంది.

ఇక చదువు సంగతికొస్తే మొత్తం నాలుగు క్వశ్చన్ పేపర్లు ఆన్సర్ చెయ్యాలి. ఆల్‌జీబ్రక్ జామెట్రీ ఎలాగా గందరగోళమై పోయింది. ప్లాన్ ఫలించలేదు కాబట్టి ఆ పేపర్‌కి ఏదో అనారోగ్యమని మెడికల్ సర్టి ఫికేట్ తీసుకొని రిపీట్ ఎగ్జామ్ రాయాలి. ఇంక మిగిలిన మూడూ మానేజ్ చేసుకో వాలి.

పుస్తకాలు ముందేసుకొంది. ఏం చదువు దామన్నా,ఏ లెక్కలు చేద్దామన్నా మైండ్ బ్లాంక్ అయిపోతోంది. ఎందుకిలా అవు తోందని ఆలోచిస్తే తనలో గిల్టీ ఫీలింగ్

మెదడంతా ఆక్రమించి ఇంకే విషయాన్ని లోపలికి చేరనివ్వడంలేదని సుమిత్ర గ్రహించుకొంది.

టైం చూసింది. రాత్రి పదకొండవుతోంది. ఇక లాభంలేదు. ఇందులోంచి వెంటనే బయటపడాలి. ఒకటేమార్గం. ఎవరి సలహాలు తీసుకున్నా పదిమంది నోళ్లల్లో పడిపోతుంది. తనే డైరెక్టుగా ఎవరూ లేకుండా రంజిత్‌ని కలుసుకోవాలి. గబగబా చెప్పులేసుకొంది. బయలుదేరబోతుంటే శాంతి"మళ్లీ ఎక్కడికే? పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. కాలు నొప్పి అంటూనే రోబోట్ సెంటర్ దాకా నన్ను తీసుకుపోయావు. సగం కాఫీ తాగి అక్కడే పెట్టేశావు? ఏమిటే! ఇదంతా నిన్ను చూస్తే నాకు భయంగా ఉంది" అంది.

"అబ్బ ఊరుకో శాంతీ! నాకేం కాలేదు. నేనేం చేస్తున్నానో నాకు బాగా తెలుసు" అంటూ బయలుదేరింది. తనను రమ్మనలేదంటే అదేదో బోయ్‌ఫ్రెండ్ కేసయ్యుంటుందని సమాధానపడింది శాంతి.

హాస్టల్ బిల్డింగ్ మెట్లు దిగి, కిందకి వచ్చింది సుమిత్ర. హాస్టల్ నించే ఫోన్ చేస్తే ఎవరైనా వినవచ్చు అందుకని రోబోట్ సెంటర్‌నించి చేద్దామని అక్కడికి వెళ్లింది. పరీక్షలు దగ్గరవడంతో పిల్లలు కాఫీలకి,టీలకి, కబుర్లకి, తిరుగుతూ కనిపిస్తున్నారు. టెలిఫోన్ బూత్‌వైపు వెళ్లింది. అక్కడెవ్వరూ లేరు. ఫోన్ తీసుకొని రంజిత్‌కి ఫోన్ చేసింది. మెసెంజర్ ఎవరు మాట్లాడుతున్నారని చెప్పమన్నారన్నాడు. వాళ్ల కజిన్ అని చెప్పు అంది.

మెసెంజర్‌కి ఇలాంటి అనుభవాలు రోజూ కోకొల్లలు. మళ్లీ ఈ రహస్యం ఒకటి అనుకుంటూ రంజిత్‌ని పిలుచుకొచ్చాడు. రంజిత్ ఫోన్ తీసుకొని "ఎవరు" అన్నాడు.

"రంజిత్! నేను సుమిత్రని. నువ్వు ఒక్కసారి రోబోట్ సెంటర్‌కి రావాలి"

"ఎందుకు ఇందాకా కలుసుకొన్నాం కదా! డబ్బు కూడా ఇచ్చేశావు"

"నీతో చాలా అర్జంటుగా మాట్లాడాలి"

"సారీ పరీక్షలు దగ్గరకొస్తున్నాయి. పదకొండున్నరయింది. చదువుకోవాలి"

"రంజిత్ ప్లీజ్"

ఈ అమ్మాయి మూలంగా కదూ అన్యాయంగా సాగర్, అర్థంలేని పిచ్చిపని చేసి నేను, నలుగురులో చులకనయి శిక్షపడేలా పరిస్థితి కల్పించుకొన్నాం అనుకుని" సారీ రాలేను" అన్నాడు రంజిత్.

సుమిత్ర రూంకి వచ్చి పుస్తకాలకేసి చూసి చదువు బుర్రకెక్కాలంటే రంజిత్‌ని కలుసుకొని "రంజిత్ నీకు, ఇంకో స్టూడెంట్‌కి నా మూలంగా శిక్షపడింది. దానికి కారణం నేనేనని నీకూ నాకూ తప్ప ఎవరికీ తెలియదు. రంజిత్ నన్ను క్షమించు" అంటే తప్ప తను మామూలు మనిషిని కాలేననుకుంది. రాత్రంతా నిద్రలేకుండా సూర్యోదయం కోసం ఎదురు చూస్తోంది సుమిత్ర.

★ ★ ★

ఎకడమిక్ ఎడ్వైజర్ ప్రొఫెసర్ సింహాచలం ప్రొఫెసర్ వేదవతికి ఓసారి వచ్చి కలుసుకోమని ఫోన్ చేశారు.

వేదవతికి తనని ప్రొఫెసర్ ఎందుకు కలుసుకోమన్నారో సుమారుగా తెలుసు.

నాలుగు రోజులక్రితం వేదవతి స్టూడెంట్ నీరజ వేదవతి రూంకి వచ్చి నానా గొడవ చేసి వెళ్లింది.

నీరజ ఐదు సంవత్సరాలుగా పరిశోధన చేస్తోంది. ఏ పనీ అనుకొన్నట్టు జరగడం లేదు. వేదవతి నీరజకి సందర్భం వచ్చినప్పుడల్లా చెబుతూనే ఉంది.

నీరజ ఇల్లు ఊళ్లోనే ఉంది.

వేదవతి "పరిశోధన ఉద్యోగంలాంటిది కాదు. హాస్టల్‌లో చేరు"అంటుంది. నీరజ అలాగే అంటుంది కాని చేరదు.

ఓసారి నీరజతో "అమ్మాయి నీరజా. పరిశోధన అనేది ఐదు వేల రూపాయలు నెల తిరిగే సరికి స్కాలర్‌షిప్ రూపంలో వస్తుం

దనో, తల్లితండ్రులు పెళ్లిసంబంధాలు వెతుకుతుంటే అమ్మాయి పిహెచ్‌డి చేస్తోంది అని చెప్పుకోడానికనో, ఫారిన్ కంట్రీస్‌కి అప్లికేషన్లు పెడుతూ నాలాబ్ ఎడ్రస్‌గా పనికి వస్తుందనో మీరు నా దగ్గర చేరక్కరలేదు. నాకోసం మీరు పరిశోధన చెయ్యక్కరలేదు. మీకున్న ఆసక్తితో మీకోసం పని చెయ్యాలనుకొంటేనే పరిశోధన ముందుకు నడుస్తుంది. పరిశోధన చేసేవాళ్లకి విద్యాలయాలు, పరిశోధనా సంస్థలు చాలా స్వేచ్ఛనిస్తాయి. పరిశోధన చేసేవాళ్లు ఇష్టం వచ్చినప్పుడు వచ్చి ఇష్టం వచ్చినప్పుడు వెళ్లవచ్చుననేదానికి అర్థాలు మారిస్తేఎలా? రాత్రి,పగలు తేడా లేకుండా మధ్యలో పని ఆగిపోకుండా ఎప్పుడు పని చేసుకొంటున్నా అభ్యంతరం పెట్టవద్దనే స్వేచ్ఛాయుత వాతావరణం మనకి కల్పించారు. అంతేకాని వారానికో పదిరోజులకో వీలున్నప్పుడు వచ్చి పోస్టు చూసుకొనో, కంప్యూటర్ మీద వేరే పనులూ ఇ-మెయిల్ చూసుకొంటూనో కాలం గడిపేస్తూ ఉంటే ఎప్పటికి తేలుతుంది పరిశోధన"నిష్కర్షగా చెప్పింది వేదవతి.

నీరజ ఆమధ్య వేదవతిని రెండుసార్లు అడిగింది"థీసిస్ ఎప్పుడు రాయమంటా"రని.

వేదవతి "నువ్వు చేసిన వర్క్ చూసి ఇది ఒక థీసిస్ రాయగల్గినంత విలువైన మెటీరియల్ అని నేననుకోవాలి. నేను నిర్ణయించాలి. ఇప్పటికైనా ఓ ఆరు నెలలు హాస్టల్‌లో చేరు. రాత్రి పగలు అనే తేడా లేకుండా కంటిన్యువస్‌గా పని చేస్తే ఆరు నెలల్లో పూర్తి కావచ్చు" అంది.

పట్టుదలతో పని పూర్తయ్యేదాకా ఒకే తీరుగా ఉంటే ఇంకా ముందే కావచ్చునని అనుకొంది వేదవతి.

మర్నాడు నీరజ లాబ్‌కే రాలేదు. ఎందుకు రాలేదో ఎవరికీ తెలీదు. రిసెర్చి స్కాలర్స్‌ని ప్రొఫెసర్లు న్యాయానికి అడగక్కరలేదు. వాళ్లే బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి.

నీరజ ఇంట్లోనే ఉండిపోయింది. తల్లితండ్రులతో"మా ప్రొఫెసర్ పిహెచ్‌డి థీసిస్ రాయడానికి ఆరు నెలలు కష్టపడి రాత్రి, పగలు పని చెయ్యాలంటున్నారు. హాస్టల్‌లోనే ఉంటే పని బాగా జరుగుతుందంటున్నారు. మీరేమో రెండుమూడు రోజులలో పెళ్లి శుభలేఖలు అచ్చువేయించడానికి ఇస్తామంటున్నారు. మీరెళ్లి పెళ్లివాళ్లకి మా అమ్మాయి పెళ్లయిన ఏడాదికికాని సంసారం పెట్టుకోడానికి కుదరదని చెప్పండి" అంది.

నీరజకి పెళ్లి,పరిశోధన టగ్ ఆఫ్‌వార్‌గా ఉండి ఉక్రోషంగా ఉంది.

"అదెలా కుదురుతుంది. ఐదేళ్లనించి రిసెర్చి చేస్తున్నావు. ఆమె ఈమాత్రం సహాయం చెయ్యలేరా? నువ్వు ఈ అయిదేళ్లబట్టీ ఆమాత్రం పని చెయ్యలేదా? సాటి ఆడది పెళ్లి చేసుకుని భర్తతో పైదేశాలు వెళ్లిపోతుంటే అడ్డకోదులే. మేం కూడా వచ్చి సర్ది చెపుతాం. నువ్వూరికే మనసు పాడుచేసుకోకు. మేం చెపితే తప్పకుండా ఒప్పుకుంటుంది. పెద్దపెద్ద ప్రొఫెసర్లు తలుచుకుంటే ఏదోవిధంగా సహాయపడతారు." అన్నాడు నాన్న.

"మొదట ఆవిడ ఆరునెలలే పడుతుందందని అన్నావు. నువ్వే మళ్లీ ఏడాది పడుతుందంటావేమిటి? " అంది అమ్మ.

"ఆవిడ ఉద్దేశం అదే ధ్యాసతో రాత్రింబవళ్లు పనిచేస్తే ఆరునెలల్లో అవచ్చని. కానీ మీరు ఊరుకుంటారా? హాస్టల్లో చేరతానంటే చేరనిచ్చారా? ఐదువేల స్కాలర్‌షిప్ డబ్బు ఖర్చుపెట్టేస్తావు. ఇంట్లోఉండి చదువుకుంటే డబ్బు ఆదా, అన్నీ మేమే చూసుకుంటాం, కళ్లముందుంటావంటూ హాస్టల్లో చేరనివ్వలేదు.

"పొద్దున్న పదింటికి వెళ్లి ఐదింటికి ఇంటికి రాకపోతే నానా గోల. నేనేమైపో

యానో, ఎవరితో తిరిగేస్తున్నానోనని... వర్షం వస్తే వెళ్లద్దని, బస్ స్ట్రైక్ వెళ్లకు, ఆదివారాలు, శనివారాలు కూడా పనేనా? అంటారు. ఇంట్లో ఏ చిన్న సమస్య వచ్చినా అందులో పాలుపంచుకోవాలి. ఎవరికి అనారోగ్యం వచ్చినా ఇంటిపనిలో చొరబడాలి. నిజమే! మా ప్రొఫెసర్ కరెక్ట్. నాలాంటి వాళ్లకి రీసెర్చి చేస్తే ఐదేళ్లు కాదు పదేళ్లు పట్టచ్చు. వేదవతిని కలుసుకుని మీ ఇష్టం వచ్చినట్టు చెప్పుకోండి" అంది నీరజ ఆవేశంగా

"అదేంటి అలా మాట్లాడతావు. చాలావరకూ పని అయిపోయింది. త్వరగా థీసిస్ వ్రాస్తానంటేనే కదా పెళ్లినాటికి అమ్మాయి ఫ్రీగానే ఉంటుందన్నాం."

"అవును అన్నాను. ఇప్పుడు కుదరదని చెపుతున్నాను కదా! అంతా నా ఖర్మ. నేను ఆమాట అన్నాక ఒక్కరోజూ సరిగ్గా పని చెయ్యలేదు. పెళ్లి ముందు బజారు పనులు, పెళ్లిపనులంటూ రెండు నెలలు ఏపనీ ఎలాగూ చెయ్యనివ్వరు. నాకీ డిగ్రీ రాదు. అసలా డిగ్రీ కోసం ఆలోచించ బట్టే నారాత ఇలా ఏడ్చింది" అంటూ నీరజ విసురుగా గదిలోకి వెళ్లిపోయింది.

మర్నాడు నీరజ తల్లిదండ్రులతోపాటు వేదవతి రూమ్‌కి వచ్చింది.

వేదవతి మొహంలో కొంత ఆశ్చర్యం, కొంత అనాసక్తత చోటు చేసుకున్నాయి. నీరజ తల్లిదండ్రులని పరిచయం చేసింది. తల్లిదండ్రులను ఎందుకు తీసుకువచ్చింది అనిపిస్తున్నా సభ్యత మరచిపోకుండా కూర్చోమంది.

నీరజ తండ్రి మొదలెట్టాడు. "అమ్మాయి పెళ్లి పెట్టుకున్నాం. ఐదేళ్లు అయిపోయింది మీ దగ్గర పరిశోధనలో చేరి. మేం పెళ్లవగానే అబ్బాయితో అమ్మాయిని సింగపూర్ పంపెయ్యాలనుకుంటున్నాం."

"మంచిది తప్పకుండా పంపండి."

"మరి థీసిస్ వ్రాస్తే వైవాకి మళ్లీ వచ్చి వెడుతుంది.

"థీసిస్ వ్రాయడానికి తగినంత పని పూర్తి చెయ్యాలి కదా! ఎంత చెప్పినా మీ అమ్మాయి ఈ మధ్య పని విషయంలో శ్రద్ధ చూపించడంలేదు. వరసగా ఏ రెండు రోజులూ ల్యాబ్‌లో కనిపించదు. ఎందుకు రావడంలేదంటే చెప్పే కారణాలు వింటూ నేనీ అమ్మాయిని ఇంకా రీసెర్చి క్యాండిడేట్‌గా కొనసాగించనిస్తున్నానంటే నా సహనానికి నాకే ఆశ్చర్యంగా వుంది. మీరు అనవసరంగా శ్రమ తీసుకుని వచ్చారు.

"తల్లిదండ్రులకు ఈ విషయాలు ఏం అర్థమవుతాయి నీరజా! నీకు నా కంగ్రాట్స్. నీ వివాహ జీవితం సుఖంగా గడపాలని నా ఆశీస్సులు. థీసిస్ విషయం నేను ముందే చెప్పాను"

నీరజ మాట్లాడలేదు.

కొంచెం సేపయ్యాక ధైర్యం తెచ్చుకుని మేడమ్! సందీప్ వర్క్ కూడా నేను చేస్తున్న పనికి దగ్గరే కదా! నేను కొంచెం నా ఎక్స్పరిమెంట్స్‌లో వెనకపడ్డాను. అతను నా కన్నా ప్రోగ్రెస్‌లో ఉన్నాడు. మీరు... అతన్ని... కన్విన్స్ చేసి అతని వర్క్ నా వర్క్‌తో జత చేస్తే థీసిస్ రాయవచ్చు మేడమ్!"

"శెభాష్ నీరజా! ఎంత ధైర్యం. తల్లి, తండ్రి, గురువు ఈ ముగ్గురూ నీ ముందుండగా ఎంతమాటన్నావు. ప్లీజ్ లీవ్ మై రూం. నేను ఎకడమిక్ బ్లండర్స్ చెయ్యలేను. నీ అంతట నువ్వు పని చేసి నా గైడెన్స్‌లో పి. హెచ్. డి తెచ్చుకోవాలనుకుంటే వెల్‌కమ్. లేకపోతే పి. హెచ్. డి చెయ్యడం అనే మాట వదిలివేయవచ్చు. అఫ్‌కోర్స్, గవర్నమెంటుకి అంటే పరోక్షంగా టాక్స్ పేయర్‌కి ఓ పది లక్షలు నష్టం. ఇంకో ఆసక్తి ఉన్న వ్యక్తికి అవకాశం లేక వ్యక్తిగత నష్టం"

"పది లక్షలా"

"అవును. నేను లెక్కలు పెట్టి చెప్పలేదు.

బహుశా అంతకన్నా ఎక్కువేమో! స్కాలర్ షిప్స్, లైబ్రరీ సదుపాయాలు, లాబ్స్, లాబ్ ఇన్స్ట్రుమెంట్స్, గైడ్ చెయ్యమని నాలాంటి వాళ్లకి జీతాలు వీటన్నిటి ఖరీదు ఎంతో కట్టి చూసుకోండి. వివరించి చెప్పవలసిన అవసరం నాకు లేదు. ఇదంతా నీరజ మంచికోసం చెబుతున్నాను. తల్లితండ్రులు కాబట్టి మీ అమ్మాయి భవిష్యత్తు కోసం మీకు చెబుతున్నాను.

"హాస్టల్‌లో చేర్పించండి. ఇంటి విషయాలతో మనసు దారితప్పి పక్కతోవ పట్టకుండా దీక్షగా పనిచేస్తే ఆరు నెలల్లో పని పూర్తవుతుంది. మీ ఇష్టం" కుర్చీలోంచి లేచింది వేదవతి. అది ఓవిధంగా వాళ్లని ఇహ వెళ్లమని చెప్పడమే.

నీరజ తల్లితండ్రీ లేవక తప్పలేదు.

ఇంటికి వెళ్లాక సుదీర్ఘమైన చర్చలు జరిగాయి.

నీరజ తండ్రి నీరజచేత ఎకడమిక్ ఎడ్వైజర్ సింహాచలానికి ఉత్తరం రాయించాడు. వేదవతి దగ్గర ఐదు సంవత్సరాలుగా పని చేస్తున్నా థీసిస్ రాయనివ్వడంలేదని చేసిన పని చాలదని వేధిస్తోందని ఆవిడ థీసిస్ రాయడానికి ఒప్పుకోకపోతే భవిష్యత్తు లేదని పెళ్లి చేసుకొని దేశం వదిలి వెళ్లిపోవాలి కాబట్టి సింహాచలం వేదవతికి నచ్చజెప్పి పని పూర్తయ్యేలా చూడాలని ఆ ఉత్తరం సారాంశం.

వేదవతి కూడా ఆ ఉత్తరం చదివింది. ఓ కాపీ ఆవిడ టేబుల్‌మీద పెట్టి ఉంది. ప్రొఫెసర్ వేదవతి తాటాకు చప్పుళ్లకి లొంగిపోయే రకంకాదు. ఉత్తరం చదివాక కూడా నిమ్మకి నీరెట్టినట్టుంది.

ప్రొఫెసర్ సింహాచలం ఫోన్ చేసి కలవమన్నప్పుడు మర్యాదగా వేదవతి వెంటనే ప్రొఫెసర్ రూంకి వెళ్లింది.

సింహాచలానికి వేదవతి అంటే చాలా గౌరవం. తన మనసులో ఎకడమీషియన్ అంటే వేదవతిలా ఉండాలనుకొంటాడు. ఆవిడ ఫీల్డులో ఆవిడకున్న కీర్తి ప్రతిష్టలు, ఆవిడ దినచర్య పద్ధతి, ప్రవర్తన, మాటలో మర్యాద అన్నీ కలగలసి ఎవరైనా ఆవిడని గౌరవించేలా చేస్తాయి.

ప్రొఫెసర్ సింహాచలం లాంటి వాళ్లకి ప్రొఫెసర్ వేదవతి లాంటి వాళ్లని ప్రశ్నించే అవకాశం చాలా అరుదుగా వస్తూంటుంది. అలాంటి అవకాశాన్ని సింహాచలం ఒదులుకోలేదు. కొంత సంతోషంగా కూడా ఉంది.

వేదవతిని చూస్తూనే ప్రొఫెసర్ సింహాచలం "రండి మేడమ్! మీకు ఫోన్ చేసి నేనే వద్దామనుకొన్నాను. మీరే వచ్చారు. కూర్చోండి. మీ స్టూడెంట్ నీరజ లెటర్ తీసుకువచ్చి ఇచ్చింది. మీకో కాపీ టేబుల్ మీద పెట్టేనంది"

"నీరజ తీసుకువచ్చి ఇచ్చిందా? "

"అవును మీరు లేరట. మీకో కాపీ టేబుల్ మీద పెట్టేనని నా దగ్గరకు వచ్చి చెప్పి వెళ్లింది"

"ఉత్తరంలో విషయాలనిబట్టి మీకు పరిస్థితులు అర్థమయ్యేయనుకొంటాను. ఇంకేముంది? "

"మీరు చాలా స్ట్రిక్ట్ అట. మీరు అంత గట్టిగా ఉండబట్టే గత మూడు మాసాలలో ముగ్గురు స్టూడెంట్స్ మీ దగ్గరనుండి వెళ్లిపోయారుట"

"ముగ్గురు కాదు. చెప్పినట్టు సక్రమంగా పనిచెయ్యకపోతే నలుగురవుతారు ఈ అమ్మాయితో కలిపి"

"అలాగయితే మీకు మీ గురించి చాలా స్ట్రిక్ట్ అని ప్రచారం చేస్తే మీ ఇమేజ్...

"ప్రొఫెసర్! నీరజ కంప్లయింట్‌కి కేసు లేదు. ఎందుచేతనంటే ఎవరైనా ఎన్ని సంవత్సరాలు పని చేసేరన్నదికాదు. ఆ పనిలో విలువెంత అనేది ముఖ్యం. మీకు నేను చెప్పాలా? విద్యా వ్యవస్థలో సంవత్సరాలుగా ఉంటూ తల పండించుకొన్నారు"

సింహాచలం అసంకల్పితంగా బట్టతల చుట్టూ ఉన్న తెల్లజుత్తును ఓసారి తడుము

కొన్నాడు.

"నాకెంతమంది పి. హెచ్. డి చేసిన స్టూడెంట్స్ ఉన్నారనేది ముఖ్యంకాదు. నా విద్యార్థి అని గర్వంగా చెప్పుకొనేలా ఎంత మందిని తయారు చేసేనన్నది. వాళ్లాఫీ ల్డులో నిలదొక్కుకొని పేరు తెచ్చుకొంటే నా శ్రమకి ఫలితం దక్కినట్టేనని భావిస్తాను. నా దగ్గర ఎవరికి పరిశోధన చెయ్యా లనుంటే వాళ్లు చేరుతారు. కృత్రిమమైన గొప్పతనాల కోసం విద్యార్థులని తప్పుత్రోవ పట్టించను. వాళ్లకి నా పద్ధతి చాలా కఠి నంగా అనిపించవచ్చు అది వాళ్ల మంచి కోసమేనని నేను నమ్ముతాను. అయ్యో పాపం పెళ్లి చేసుకొని భర్తతో సంసారం చెయ్యడానికి వెళ్లిపోవాలట. ఎలాగైనా సహాయం చేసి పని కానిద్దామనేది పరిశో ధన కాదు. సారీ మీకు తెలిసిన విషయాలే మీకు చెపుతున్నాను"

సింహాచలం వేదవతి మొహంలో కని పించే ఆ వర్చస్సుకి కారణం ఆవిడకున్న ఆత్మవిశ్వాసం అనుకొన్నాడు.

ఇంకా ఇంకా వేదవతి మాట్లాడుతుంటే సింహాచలానికి వినాలనుంది. తనలా ముసుగు బతుకు బతకడంలేదు. నిర్దిష్ట మైన అభిప్రాయాలతో ఏ పదవికీ లొంగ కుండా తన జీవితం తనకి నచ్చేవిధంగా దిద్దుకొందనుకొన్నాడు.

"పంకజ్ చోప్రా మీవద్ద నుండి ఆరు నెలలు తిరగకుండానే వెళ్లిపోయాడంది నీరజ"

"ఎందుకు వెళ్లిపోయాడని ఆమెనే అడగా ల్సింది. పంకజ్ అక్క, బావ అమెరికానించి వచ్చి ఇతణ్ణి కూడా అక్కడికి తీసుకెళతామ న్నారట. లాబ్‌లో కూర్చొని జి. ఆర్. ఇ. కి ప్రిపేరవుతున్నాడు. నా లాబ్‌లో పని చెయ్యదలచుకోనప్పుడు ఎందుకు రావాలి. స్కాలర్‌షిప్ బిల్ మీద ఎందుకు సంతకం పెట్టించుకోవాలి? ఎందుకు నా అడ్రస్ వాడుకోవాలి?

సింహాచలం మాట్లాడలేదు.

"ఇంక రణధీర్ నాతో ఐ. ఏ. యస్. కి ప్రిపేరవుతున్నానని చెప్పలేదు. వేరే వాళ్ల ద్వారా తెలిసింది. పగలు కోచింగ్‌కి వెళ్లి రాత్రి పని చేస్తున్నాడు. నాకు పార్ట్‌టైం రిసెర్చి స్కాలర్స్ అక్కరలేదన్నాను.

"చదువు ఓ స్టేజికి వచ్చాక గమ్యం తెలీక నాలుగు రోడ్ల కూడలిలో నిలబడి ఏం చెయ్యాలో దారి తోచక అందాక భుక్తి గడు స్తుంది, అయిదారేళ్లు గడిచిపోతుంది ఆనక ఆలోచిద్దాం అని వేరే అవకాశాలు కానరాక పరిశోధనలో చేరేవాళ్లు ఎక్కువవుతున్నారు. ట్రెస్ పాసర్స్ ఆర్ నాట్ ఎలౌడ్‌టు రిసెర్చి ఫీల్డు"

సింహాచలానికి మాటలే కరువయ్యాయి. తన గుండెల్లో గూడుకట్టుకొన్న నిజాలు వేదవతి బహిర్గతం చేస్తోందనుకొన్నాడు.

"పాపం నీరజ ముక్తని లెక్కపెట్టలేదు. రిజిస్ట్రేషన్ అవలేదనుకొని వదిలేసి ఉంటుంది ముక్తని. సంగతి ఏమిటంటే...

వేదవతి చెప్పబోతుంటే కోలా తలుపు తట్టి లోపలికి వచ్చి సింహాచలానికి, వేదవ తికి విష్ చేశాడు.

వేదవతి "ముక్త పరిశోధన చెయ్యాలని చదువుకొంటున్న నాటినించీ కలలు కంటూ ఎంతో ఆసక్తిగా సత్యం దగ్గర చేరాలని వచ్చింది. ఆ అమ్మాయికి ఉన్న ఇంట్రెస్టుకి చేయూత ఇవ్వాలనే సత్యం లేరని నేనే కావాలని తీసుకొన్నాను."

"మేడమ్ నా మాట వినండి" కోలా ప్రవ ర్తనలో మార్పు స్పష్టంగా కనిపిస్తోంది.

"చెప్పండి" అంది వేదవతి!

"నేను కొన్ని పరిస్థితుల వల్ల సత్యంతో పోల్చుకొని అతణ్ణి అనవసరంగా గొప్పవా డిని చేసి పట్టం కడుతున్నారనే అసూయతో అతణ్ణేం చెయ్యలేక నా దృష్టిలో నాకు లోకు వగా కనిపించిన వాళ్లకి అన్యాయం చేశాను.

"అదొక మానసిక రుగ్మత అని తెలుసు కొని వైద్యం చేయించుకొని మామూలు

మనిషినయ్యాను. అందుకే న్యాయాన్యాయాల విచక్షణ నాలో కలుగుతోంది. నాలో మార్పు మీకందరికీ కూడా తెలియాలి. ఎదుటివాళ్లు చెప్పేది వినగలుగుతున్నాను. ముక్తకి అన్యాయం చేశాను నిజమే. ఆమెని పిలిపించి మీ దగ్గర పరిశోధనకి అవకాశం ఇస్తే మీకు రుణపడి ఉంటాను"

"అంత మాట అనడం అవసరంలేదు కోలాగారూ. మనతప్పు మనం తెలుసుకొని సవ్యంగా ప్రవర్తించడంకన్నా దైవత్వమేముంది? ముక్త వెళ్లిపోతున్నానని చెప్పినప్పుడు పరిస్థితులు చూచాయగా తెలిసిన నేను ఫిర్యాదు చెయ్యని ఆ అమ్మాయి ఔదార్యానికి ఆ అమ్మాయిని మనసులోనే దీవించాను. కాని ఎందుకు వెళ్లిపోతున్నావని ఆ అమ్మాయిని అడగలేదు. కారణం ముక్తలో పరిశోధన చేసే ఆసక్తి ఉంది. ఆ ఆసక్తి ఉన్న వాళ్లకి ఈ యూనివర్సిటీలో కాకపోతే మరోచోట అవకాశం దొరికే తీరుతుందనుకొన్నాను" అంది వేదవతి.

"ఇంకో సంగతి. ఆ అమ్మాయి నెంబర్ స్కాలర్‌షిప్ పరీక్షలో పాసయినట్టు ప్రకటించబడింది. ముక్త ఇంటి ఎడ్రస్ ఆఫీసు ఫైలులో ఉంటుంది. మీ దగ్గర ఆ అమ్మాయి సత్యం వచ్చేవరకేనా చేరాలనుకొంది. కాబట్టి మీకు అభ్యంతరం లేకపోతే ఓ అవకాశం ఇవ్వండి. సత్యంకి ట్రీట్‌మెంట్ జరుగుతోంది. చూద్దాం పరిస్థితులు ఎలా మారుతాయో! సత్యం రావాలని నేను మనస్ఫూర్తిగా కోరుకొంటున్నాను" అన్నాడు కోలా.

"సత్యం ఈ యూనివర్సిటీకి తిరిగి వస్తే ముక్తకి నా దగ్గర పని చేస్తున్నా సత్యం దగ్గర పని చేసే అవకాశం కల్పించి ఆ అమ్మాయి ఆశయం నెరవేరేలా చూస్తాను" అంది వేదవతి.

★ ★ ★

రంజిత్ పరీక్షలు రాసి ఇక ఈ యూనివర్సిటీకి, తనకి ఋణం తీరిపోయిందనుకొన్నాడు. బయలుదేరేముందు బైక్‌మీద క్యాంపస్ అంతా తిరిగాడు. రోబోట్ సెంటర్‌లో కాఫీ తాగి ఫ్రెండ్స్ అందరి దగ్గరా వీడ్కోలు తీసుకొన్నాడు.

మినిష్టర్ అరుణాచలాన్ని కలుసుకొన్నాడు. రంజిత్‌ని చూడగానే అరుణాచలం ఎంతో ఆప్యాయంగా లోనికి ఆహ్వానించాడు. రంజిత్ తన చదువైపోయి యూనివర్సిటీనించి వెళ్లిపోతున్నానని చెప్పాడు.

అరుణాచలం "నువ్వు ఐ.ఎ.యస్.కి ప్రయత్నించు. కోచింగ్ తీసుకో డబ్బు నే చూసుకొంటా" అన్నాడు.

"ఇప్పటికే ఎంతో సహాయం చేశారు. మీకు చాలా రుణపడి ఉన్నాను" అన్నాడు రంజిత్.

"చూడు రంజిత్! ఎవరూ నాకు ఏ సహాయం చెయ్యకుండానే ఎన్నో సహాయాలు అడుగుతుంటారు. నాకు ప్రాణదానం చేసిన వాడివి. నీకేం కావాలంటే అది చేస్తానంటే నువ్వు ఓ పరిధిమించి ఏదీ నన్ను అడగలేదు. నీలో ఈ ప్రత్యేకతే నన్ను నీకు మరింత సహాయపడడానికి ప్రోత్సహిస్తోంది"

"నన్ను చాలా మెచ్చుకొంటున్నారు సార్. చూస్తాను నా స్వశక్తి మీద ఏదైనా చెయ్యగలుగుతానేమో ప్రయత్నిస్తాను. ఒక్క నెల ఇంటికి వెళతాను. ఆ తర్వాత మిమ్మల్ని వచ్చి కలుసుకొంటాను. అప్పుడు నా ప్లాన్స్ మీకు తెలియజేస్తాను" అని శెలవుతీసుకొన్నాడు.

రంజిత్ ఇంటికి చేరేసరికి చీకటి పడుతోంది. తండ్రి ఇంట్లోలేడు. తల్లి కిరసనాయిలు దీపాలు తుడిచి వెలిగించే ప్రయత్నంలో ఉంది.

రంజిత్‌ని చూస్తూనే ఆ తల్లి కళ్లల్లో వేయి విద్యుత్‌దీపాల వెలుగు. వెంటనే లేచి "రా బాబూ, ఈ మాటు అమ్మని చూడ్డానికి చాలా రోజులు తీసుకొన్నావు. ఈమధ్య రోజూ నీకోసం ఎదురు చూస్తున్నాను"

అంటూ రంజిత్ వీపుమీద నిమిరి లోపలికి వెళ్లి మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది.

"ఏం కిరసనాయిలు దీపాలు తుడుస్తున్నావు? కరెంట్ లేదా? "

"ఎలక్ట్రిక్ బిల్ కట్టలేదని వాళ్లే తీసేశారు"

"అలాగా"

"నువ్వు నాలుగు నెలలైందికదా వచ్చి. అటక మీద ఇత్తడి సామాను చాలా ఉంది. ఒకటి తర్వాత ఒకటి పని మనిషిద్వారా అమ్మించి ఆ డబ్బుతో బియ్యం, కూరలు, నిత్యావసరాలు కొంటున్నాను. ఈ సంగతి మీ నాన్నకి తెలీదు. ఆనాడు మనింట్లో పని చేసిన విశ్వాసంతో నా విషయాలన్నీ కడుపులో పెట్టుకొని ఈ సహాయం చేసి పెడుతోంది. కొంచెం డబ్బులున్నాయికాని ఎలక్ట్రిక్ బిల్ అంటే వాళ్ల ఆఫీసుకి వెళ్లి కట్టాలి. నేను బయటకి వెళితే మీ నాన్న లక్ష ఆరాలు. ఆయన చేతిలో ఆ డబ్బు పడితే ఇక తిరిగిరాదు. కరెంట్ బిల్లు అలాగే ఉండిపోతుంది. వీధిలో వాళ్లకి ఎవరికిచ్చినా వాళ్లు కట్టకపోతే మళ్లీ ఎవరి దగ్గరా అనలేం. మీ నాన్నకి తెలిస్తే అదో రాద్ధాంతం. ఎందుకొచ్చిందని ఈ దీపాలతో కాలక్షేపం చేస్తున్నాను" అంది.

రంజిత్ గుండె తరుక్కుపోయింది. ఇంత మంచి అమ్మని తనకి దేముడిచ్చాడు. ఈ రోజు సాయంకాలమైపోయిందికదా! రేపు చూస్తాలే. నాన్న ఎక్కడికి వెళ్లారు? "

"చేతిలో డబ్బులు లేవుకదా! పాత పుస్తకాలన్నీ ఓ బస్తాలోకి కుక్కి అమ్ముకొస్తానని వెళ్లారు"

ఎంత దర్జాగా బతికిన మనిషి ఎలాంటి పనులు చెయ్యాల్సి వస్తోందో అనుకొన్నాడు రంజిత్.

మర్నాడు రంజిత్ తండ్రి లేనప్పుడు అటకమీది ఇత్తడి సామాను మొత్తం బయటకి తీశాడు. అమ్మడానికి తీసుకు వెళ్లి వచ్చిన డబ్బుతో ముందుగా ఎలక్ట్రిక్ బిల్ ఫైన్‌తో సహా కట్టి ఇంట్లో కరెంట్ వచ్చేలా చేశాడు.

ఈనాటి వరకు మినిష్టర్ అరుణాచలం చదువుకని ఇచ్చిన డబ్బు ఇంట్లో ఖర్చుపెట్టలేదు. తల్లి స్వాభిమానమే రంజిత్‌కీ వచ్చింది.

ఓ రెండు రోజులు తన భవిష్యత్తు ఏమిటని తీరికగా ఆలోచించాడు. సెంటర్‌లో ట్యుటోరియల్ కాలేజీ పెట్టి పిల్లలకు పాఠాలు చెబుతూ రాత్రి సమయంలో ఐఏయస్‌కి ప్రిపేరవుతూ పరీక్షలు రెండు నెలలున్నాయనగా సిటీలో ట్రైనింగ్ సెంటర్‌లో చేరాలని నిశ్చయించుకొన్నాడు.

మర్నాడు ఊళ్లో స్నేహితులని కలిసి ట్యుటోరియల్ కాలేజీ మాట చెప్పినప్పుడు వాళ్లు ఎవరికి తోచిన సలహాలు వాళ్లు చెప్పారు. కొందరు టీచర్లుగా పనిచేస్తామని ముందుకు వచ్చారు.

తల్లిచేత మంచి ముహూర్తం పెట్టించుకుని రంజిత్ 'సత్య ట్యుటోరియల్స్' ప్రారంభించాడు. నెల తిరిగేసరికి ఆశించినదాని కన్నా ఎక్కువ డబ్బే కళ్లచూశాడు.

ఓరోజు ఊరెళ్లి మినిస్టర్ అరుణాచలాన్ని కలుసుకున్నాడు. తన ఊళ్లోనే ట్యుటోరియల్స్ పెట్టుకుని రాత్రిపూట ఐ.ఏ.యస్.కి ప్రిపేరవుతున్నానని, పార్ట్‌టైమ్ కోచింగ్‌కి తర్వాత చేరుదామనుకుంటున్నానని తెలియచేశాడు.

అరుణాచలం రంజిత్‌ని ఎంతో మెచ్చుకున్నాడు. తన సహాయం ఎప్పుడూ ఉంటుందని చెబుతూ ఓ యాభైవేల రూపాయలకి పెర్సనల్ చెక్ రాసిచ్చాడు. రంజిత్ తీసుకోలేదు. ప్రస్తుతం అవసరంలేదంటే అరుణాచలం వినలేదు. ఈ డబ్బుతో ట్యుటోరియల్ కాలేజీ డెవలప్ చెయ్యమన్నాడు.

"రంజిత్! దీనితో మన అనుబంధం తెగిపోదు. పర్సనల్‌గా నీకు సహాయం చెయ్యడానికి నేను ఎప్పుడూ సిద్ధం" అని హామీ ఇచ్చాడు.

రంజిత్‌కీ, అరుణాచలానికి అలా ఓ గట్టి అనుబంధం ఏర్పడింది.

రంజిత్ ఇంటికి చేరుకున్నాడు. మొదటి సారిగా అరుణాచలం ఇచ్చిన డబ్బుతో ఇంటిమీది అప్పు తీర్చి ఇల్లు తమది అనిపించుకున్నాడు. సూరమ్మ మనసు స్థిమితపడింది. రంజిత్ ఉన్నాడు... నాకేం లోటు అనే ధైర్యంతో, ఇంకా మంచి రోజులు వస్తాయన్న ఆశతో ఎదురు చూస్తోంది.

తండ్రి సోమనాథం గురించి రంజిత్ అంతగా పట్టించుకోవడంలేదు. భర్త ఇంటికి వస్తే అన్నం పెట్టడం, ఐదో, పదో అడిగితే ఇవ్వడం వరకే పరిమితమైంది సూరమ్మ. ఈ మధ్య గుడిలో కూర్చుంటున్నాడని తెలిసి ఈ దశలోనైనా సరైన చోటు ఎన్నుకొన్నాడనుకుంది సూరమ్మ.

"అమ్మా! నీకేంకావాలి? " అని రంజిత్ అడిగినప్పుడల్లా "నువ్వే నా కంటి వెలుగు. నువ్వు అనుకున్న పరీక్ష పాసవ్వాలి" అంటూంటుంది.

"నీ దీవెన తప్పకుండా ఫలిస్తుంది" అంటాడు రంజిత్.

★ ★ ★

ముక్త రిజర్వ్‌బ్యాంక్‌లో జాయిన్ అయింది. ఆరోజు ఆమె నిత్యాని కలుసుకోవడం యాదృచ్ఛికం. ముక్త తన ఎడ్రస్ ఎవరికీ ఇవ్వలేదు.

"హలో ముక్తా! వాటె ప్లెజెంట్ సర్ప్రయిజ్! ఇక్కడికి ఎలా వచ్చారు? " అన్నాడతడు

"ఏముంది. బ్యాంకు పరీక్ష పాసయ్యాను. జాబ్‌లో చేరి ఓ పది రోజులయింది. చెప్పండి మీ విశేషాలు" అంది.

"నా థీసిస్, వైవా కిందటి నెల జరిగింది. ఫారిన్ వెళ్లడానికి వీసా కోసం వచ్చాను. మా బంధువొకాయన ఇక్కడ పని చేస్తున్నాడు. కలుసుకుని వెళదామని వచ్చాను. మీరు కనిపించారు."

"మనవాళ్లంతా ఎలా ఉన్నారు? "

"రంజిత్ చదువైపోయి పైచదువులకి మన యూనివర్శిటీలో సీటు ఇవ్వలేదని ట్యుటోరియల్ కాలేజీ పెట్టుకుని సివిల్ సర్వీసెస్‌కి ప్రిపేరవుతున్నాడు.

"సాగర్ బిజినెస్ ఫ్యామిలీకదా! కంప్యూటర్ ఇండస్ట్రీ పెట్టుకుని బిజీగా ఉన్నాడు. చదువుకోవాలనే కోరిక ఇంకా తీరలేదంటాడు.

"కోలా జపాన్ వెళ్లినపుడు రెస్టారెంట్‌లో గెయిషా అమ్మాయిల విషయంలో అల్లరి పడి సైకాలజిస్ట్ దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నాడట. ఇప్పుడు చాలా మారాడు. సత్యం రాకపోతే మానె. ఈ సోనావాలాని ఎందుకు రికమెండ్ చెయ్యాలని బాధపడుతూంటాడు.

"ఇంక వరదరాజేశ్వరి మాత్రం ఉత్తమ సంఘసేవిక బిరుదు సంపాదించుకున్నారు. 'రోబోట్ సెంటర్' అలాగే ఉంది ఏమార్పూ లేకపోయినా అందరినీ ఆకర్షిస్తూ.

"అసలు సంగతి, సత్యం స్విమ్మింగ్ చేస్తూంటే స్విమ్మింగ్‌పూల్‌లో జారడంతో తలలోపల డామేజ్ అయిందిట. అమెరికాలో ఏ ట్రీట్‌మెంట్ కూడా పనిచెయ్యలేదు. ఇండియా తీసుకువచ్చి కేరళలో ఆయుర్వేద వైద్యం చేయిస్తున్నారు. సత్యం ధనికుల కుటుంబంలోంచి వచ్చాడు కనుక డబ్బు సమకూర్చగలిగే సకల సదుపాయాలు చేస్తున్నారు. అతనితోపాటు, ఓ అమెరికన్ యువతి దగ్గరుండి వైద్యం చేయిస్తోందిట!"

"అయ్యోపాపం అలాగా! నాకోసారి వెళ్ళి చూడాలని ఉంది. ఉద్యోగం వస్తే ఏ తీర్థ యాత్రలకో, భగవద్దర్శనానికో వెళ్ళాలనుకుంటారు. నాకు సత్యంగారిని చూడాలనుంది. నేను కేరళ తప్పకుండా వెళతా"నంది ముక్త. నిత్యాదగ్గర సత్యం అడ్రస్ తీసుకుంది.

నిత్యా, ముక్త లంచ్‌కి వెళ్ళి అదీ ఇదీ మాట్లాడుతున్నా ముక్త మనసు ఎక్కడెక్కడో తిరుగుతోంది. లంచ్ అయ్యాక "బై"

చెప్పుకున్నారు.

త్వరలోనే ఓ నాలుగురోజులు శలవు దొరకగానే ముక్త కేరళ ప్రయాణమైంది.

సముద్రపు ఒడ్డున ఓ ఆశ్రమంలాంటి హాస్పిటల్. అక్కడ సత్యం గురించి అడిగితే అతడుండే యూనిట్ నెంబర్ చెప్పారు.

చుట్టూ కొబ్బరిచెట్లు, జీడిమామిడి చెట్లు. ఓ రెండుగదులు, పెద్ద వరండాతో ఆ యూనిట్ ఓ పర్ణశాలలా ఉంది.

సత్యంకి ఓ శ్వేతజాతి స్త్రీ పేపర్ చదివి వినిపిస్తోంది. వింటున్నవాడల్లా చాక్‌పీస్ తీసుకుని నేలంతా ఏవేవో రాసేస్తున్నాడు.

ముక్త ఆ స్త్రీని "సత్యంగారు ఇక్కడ ఉంటారా? " అని అడిగింది.

"అవును. ఈయనే సత్యం. చూడు సత్యం, నీకోసం ఈ అమ్మాయి వచ్చింది. చెప్పగలవా? ఎవరో? " ఆ గొంతులో మార్దవం తొణికిసలాడుతోంది.

సత్యం ముక్తకేసి తేరిపార చూశాడు.

"నమస్కారం సర్" అంది ముక్త.

"నాకోసం పేపర్స్, పెన్ తెచ్చావా? " అన్నాడు సత్యం.

"తెచ్చింది. మందు వేసుకున్నాక ఇస్తుంది" అంది లూసీ!

"నాపేరు ముక్త. సత్యంగారి దగ్గర పరిశోధన చెయ్యాలని కలలు కన్నాను. వీలుపడలేదు. ఏక్సిడెంట్ అయి వైద్యం జరుగుతోందని తెలిసి, చూడ్డానికి వచ్చాను"

"అలాగా, ఎంత మంచి మనసు. ఎంత మంచి ఆలోచన"

"మీరు...? "

"నాపేరు లూసీ. ఎలాగైనా సత్యం మామూలు మనిషి కావాలి. అతనిలోని శాస్త్రవేత్తని చూడాలి. అదే నా జీవిత ధ్యేయం" అంది లూసీ.

వీళ్ళు మాట్లాడుకుంటూంటే సత్యం కొబ్బరికాయలు వేసి తీసుకుపోయే బండి దగ్గరకు వెళ్ళాడు ఎద్దులు లేకుండా బండి ఓ పక్కకి ఒరిగి ఉంది. "నేనే ఎద్దుని. నన్ను బండికి కట్టేయండి. నేను లాబ్‌కి వెళ్ళిపోవాలి. లేటయిపోతోంద"ని సత్యం గొడవ చేయసాగాడు.

ముక్తకి దుఃఖం కట్టలు తెంచుకొని వచ్చింది. లూసీ ముక్తని ఓదార్పుగా దగ్గరకి తీసుకుంది.

నర్స్ మందు తెస్తే తినకుండా చుట్టూ తిప్పుకుంటూ తిప్పలు పెడుతున్నాడు సత్యం.

లూసీ నర్స్ చేతిలోంచి కషాయంగ్లాసు తీసుకుని సత్యంని పసిపిల్లాడిని మైమరపించినట్టు మరిపించి ఆ కషాయం తాగించింది.

"ముందుకన్నా చాలా నయం. ఈ ప్రోగ్రెస్ ఇలాగే ఉంటే కొంతకాలానికి మామూలు మనిషి అవ్వచ్చు"

"సత్యంలో శాస్త్రజ్ఞుడు ఇంకా జీవించిఉన్నాడు. అందులోనూ మీలాంటి ఆత్మీయులు సపర్యలు చేస్తుంటే తప్పకుండా మామూలు మనిషి అయ్యేరోజు వస్తుంది" అని శలవు తీసుకుంది ముక్త.

ఎదురుగా ఉన్న సముద్ర తీరానికి వెళ్ళింది ముక్త. అస్తమిస్తున్న సూర్యుని చూస్తూ, సముద్రపు అలలు వచ్చి పాదాలను తాకుతూంటే చెదిరిన మనసు కూడగట్టుకుంటూ తన కలలు కల్లలవడం తలుచుకుని కన్నీటి బాష్పాలు రాల్చింది. సూర్యోదయాన్ని చూడాలని 'మళ్ళీ రాగలిగితే' అనుకుంటూ తిరుగు ప్రయాణానికి అడుగులు వేసింది.

★ ★ ★

ముక్తకి సత్యంని, లూసీని కలుసుకుని వచ్చాక ప్రతినిముషం వాళ్ళే గుర్తుకు వస్తున్నారు.

లూసీ సత్యంలాంటి శాస్త్రవేత్త సహచర్యం కోసం తను పుట్టిపెరిగిన దేశాన్ని వదిలి తెలీని ప్రపంచంలోకి అడుగుపెట్టింది. సత్యం ఎలాగైనా బాగుపడాలి, అతనిలోని

శాస్త్రవేత్త మళ్ళీ జీవించాలనే ఆకాంక్షతో అతని సేవకే అంకితమైపోయింది. అతని పరిస్థితి ఈనాటికీ గాలిలో దీపమే. అయినా తన ప్రయత్నం తను మానలేదామె.

సత్యం కోలుకుంటాడా? తనని పెళ్ళి చేసుకుంటాడా? లేదా? అసలు ఇక్కడే ఉండిపోతానంటాడేమో. అమెరికా వస్తాడో, రాడో? ఇలాంటి ప్రశ్నలు లూసీని వేధించడం లేదనుకుంది ముక్త.

తనేమో ఇరవై రెండు సంవత్సరాల వయసుకే తననుకున్నట్టు ఏదీ జరగలేదని నిరాశ పెంచుకుని చేస్తున్న పనిలో తృప్తి లేక రోజులు గడిపేస్తోంది.

ముక్తలో తనకు నచ్చిన పని వేరే ఉందనే భావం రోజురోజుకీ పెరిగి దహించి వేస్తూ, బ్యాంక్ పనిమీద ఏకాగ్రత లేకుండా చేస్తోంది.

ఆరోజు ముక్త బ్యాంక్‌లో తన సీటులో కూర్చుని రొటీన్ పనులు చూస్తోంది.

ఓ డెబ్బై ఏళ్ళ పెద్దాయన ఓ బ్రీఫ్‌కేస్ మోసుకుంటూ వచ్చాడు.

ముక్త కూర్చోమని ఎదురుగా ఉన్న కుర్చీ చూపించింది.

కూర్చుని చెప్పడం మొదలుపెట్టాడు.

"పోస్టాఫీస్‌లో కిసాన్ వికాసపత్రాలు సర్టిఫికెట్స్ క్యాష్ చేశాం. లక్ష రూపాయలు... అన్నీ ఐదు వందల రూపాయల నోట్లు ఇచ్చారు. అవి దేనికి వాడుకోబోయినా తీసుకోమంటున్నారు. మీరు మార్చి ఇస్తారని తీసుకువచ్చాను"

"పోస్టాఫీస్ వాళ్ళు ఐదువందల రూపాయలనోట్లు ఎన్నో, వాటినెంబర్లతో సహా స్లిప్ ఇచ్చారా? అది మీదగ్గర ఉందా? "

"నా కొడుకు వెళ్ళాడు. వాడివన్నీ ఆలోచించలేదు. ఎక్కడ కాగితాలు అక్కడ చింపి పారేశాడు. నైజీరియా వెళ్ళడానికి టికెట్టు కొనుక్కుందామనుకున్నాడు. వాళ్ళు ఈ అయిదువందల రూపాయల నోట్లు తీసుకోమన్నారు. పోస్టాఫీస్‌కు వెళ్ళి ఇవి మీరిచ్చిన నోట్లే మారడం లేదంటే, మేమే ఇచ్చినట్లు మీ దగ్గర స్లిప్ ఏమైనా ఉంటే ఇవ్వండి మారుస్తామన్నారు. మా దగ్గర దురదృష్టవశాత్తూ స్లిప్ లేదు. కష్టపడి సంపాదించిన డబ్బు. ఇలా మమ్మల్ని తిప్పలు పెడుతున్నారు"

ముక్త లోపలికి వెళ్ళి పై ఆఫీసర్‌తో మాట్లాడి వచ్చింది. ఆఫీసర్ వచ్చి ఆ నోట్లు అటు, ఇటు తిరగేసి చెల్లవన్నాడు.

ఆ పెద్దాయన దిగాలు పడిపోయాడు. "సరే. చేసేదేముంది? ఆ పోస్టాఫీస్‌కే వెళ్ళి, వాళ్ళు నా సర్టిఫికెట్స్‌కి క్యాష్ ఇచ్చినప్పుడు ఏవైనా నెంబర్లు నోట్ చేశారేమో కనుక్కుంటా"నంటూ అక్కడినుంచి కదిలాడు.

ముక్తకి కొంచెందూరంలో సోఫాలో కూర్చుని ఎవరికోసమో వెయిట్ చేస్తున్నారు కొందరు. అందులో ఓ ఇద్దరు సంభాషణలోకి దిగారు.

"మా తాత పది మందిని కని కన్నుమూసేవరకు ధన సంపాదనతోనే కాలం గడిపాడు. పెద్ద కుటుంబం. నిత్యం సత్రవ ఖర్చులు. మా నాన్నకి మేం నలుగురే అయినా పిల్లల చదువులకి డొనేషన్లు, ఆడపిల్లలకి కట్నాలు కూడా ఇచ్చి ఆఖరి శ్వాస వరకూ సంపాదించక తప్పలేదు. ఇక మాకు ఇద్దరే పిల్లలు. లోవర్ కేజీనించి డొనేషన్ చదువులు చెప్పించడంతో అన్ని సబ్జక్ట్సుకీ ట్యూషన్‌లు చెప్పించి నా భార్య, నేనూ ఉద్యోగస్థులమైనా డబ్బు బొటాబొటీగా సరిపోతోంది. ఇంకో సంగతి కంప్యూటర్ కోర్సులు... ఇప్పుడు కొడుకుని అమెరికా పంపిస్తున్నాం. స్కాలర్‌షిప్ దొరికేవరకూ అన్ని ఖర్చులు మేమే భరించాలి. ఆరువేల డాలర్లు ఇచ్చి పంపమంటే లోన్ పెట్టి డాలర్లలోకి మార్చడానికి క్యాష్ తీసుకొచ్చాను. లోపల ఆఫీసర్ బిజీగా ఉన్నారు"

ఇంకో ఆయన . ఈ మాటలు విని "ఆ డాలర్లునేనిస్తా, మీ రూపాయలు నాకి

వ్వండి. మనిద్దరికీ బ్యాంక్ కమీషన్ కలిసి వస్తుంది" అన్నాడు.

ఆ ఇంకో వ్యక్తి దగ్గరకి అన్ని డాలర్లు ఎలా వచ్చాయోమరి! పోస్టాఫీస్‌లో ఐదు వందల రూపాయల నోట్లు ఇవ్వడం నిజమో, అబద్ధమో! నిజమైతే గవర్నమెంటు సామాన్యుడిని మోసం చేసినట్టే.

అక్కడ అలా ఉంటే ఇక్కడేమో సామాన్యుడు గవర్నమెంట్‌కి అందాల్సిన కమీషన్ తనే మేనేజ్ చేసేస్తున్నాడు అనుకొంది ముక్త.

ముక్తని ఆలోచనలలోంచి బయటకు లాక్కొస్తూ ముక్త దగ్గరకి ఓ భార్య, భర్త వచ్చారు. ముక్త కూర్చోమంది. కూర్చొని భర్త ముక్తకి వచ్చిన కారణం చెబుతున్నాడు. "మా ఇద్దరికీ గ్రీన్ కార్డులున్నాయి. మేం ఆరు నెలలు ఇక్కడ, ఆరు నెలలు అమెరికాలో ఉంటాము. మా అబ్బాయి అమెరికన్ సిటిజన్. ఎపార్ట్‌మెంట్స్ కాంప్లెక్స్ కొందామనుకొంటున్నాడు. అక్కడి నించి డాలర్లు పంపి తన పేర కొనుక్కోవచ్చా? "

"కొన్నప్పుడు రిజర్వుబ్యాంక్‌కి ఎన్ని డాలర్లు మదుపు పెట్టారో తెలియజెయ్యాలి. కొంతకాలమైన తర్వాత అమ్మేస్తే మదుపు పెట్టిన మొత్తం మార్చి తీసుకు వెళ్లవచ్చు. మా వెబ్ సైట్‌లో ఈ వివరాలన్నీ ఉంటాయి" అంటూ కార్డు ఇచ్చింది.

"అంటే లాభం వస్తే తీసుకెళ్లనివ్వరన్న మాట"

"అవును"

"ఏ ఇన్వెస్ట్‌మెంటైనా లాభం గురించి ఆలోచించే చేస్తారు. అది తీసుకెళ్లవద్దంటే ఎలా? "

ముక్త మాట్లాడలేదు. వాళ్లిద్దరూ థాంక్స్ చెప్పి వెళ్లిపోయారు.

ఎంతసేపూ డబ్బు డబ్బు... ఎవరికి లాభం? ఎవరికి నష్టం? ఎవరికి ఎలా టోపీ వెయ్యాలి? అనే.

ముక్త ఆలోచిస్తోంది. కొద్ది రోజుల్లోనే ఈ ఉద్యోగమంటే ఇంత విసుగొస్తే జీవిత కాలం ఇష్టంలేని ఉద్యోగం ఎలా చెయ్యాలో అనుకొంది.

సాయంకాలం అయిదయిపోయింది. ముక్త బయలుదేరబోతుంటే కొరియర్‌లో ఓ కవరు వచ్చింది. కూర్చొని కవరు తెరిచి చూసింది. అందులో ముక్త తల్లి జయంతి ముక్తకి ఫోన్‌లో చెప్పిన పెళ్లికొడుకు బయోడేటా ఉంది. ఇంకేం లేదు. గొప్పగొప్ప కాన్వెంట్స్‌లో చదివాడు. బిట్స్‌లో పై చదువులు, గోల్డ్ మెడల్స్, తర్వాత ఐ.ఎ.యస్... అదీ బయోడేటా. ఫొటోగ్రాఫ్ లేదు. ముక్తకి తల్లి ఆ రోజే ఫోన్‌లో చెప్పింది. "వాళ్లు ఫొటోగ్రాఫ్ ఇవ్వరుట" అని.

"మరి నా ఫొటోగ్రాఫ్ ఇచ్చేవా? " అంది ముక్త.

"ఇచ్చేను. ఇంతకుముందే ఈ సంబంధం చూశాం. వాళ్లు నువ్వు పిహెచ్‌డి చేస్తున్నావని పెళ్లి కొడుకుకి చెబితే రిసెర్చి వాళ్లు వద్దన్నాడట. ఈమధ్య నువ్వు రిసెర్చి వదిలిపెట్టి రిజర్వు బ్యాంక్‌లో చేరేవని తెలిసి ఇప్పుడు ఇంట్రెస్టు చూపిస్తున్నారు"

"అమ్మా! ఇదా పెళ్లికొడుకు కాబోయే భార్యలో చూడవలసింది. చదువులకి ఉద్యోగాలకీనా పెళ్లిళ్లు. అసలు నాకీ ఉద్యోగం ఎంతమాత్రం ఇష్టంలేదు. ఎంతసేపూ డబ్బు, లాభం, నష్టం ఇవే నాకు కనిపిస్తున్నాయి. ఇలాటి ఉద్యోగం నాకు నప్పదనిపిస్తోంది"

"బంగారం లాంటి ఉద్యోగం బాగోలేదంటావా? "

"బంగారానికి అందరి దృష్టిలో ఒకే విలువ ఉండాలనుకోవడం తప్పమ్మా. మనిషి తనకేం కావాలో తెలుసుకొని ఆ పని చేస్తూ తృప్తి అనుభవించాలి. అదే బంగారంకన్నా విలువైంది"

"ఏమో నీ భావాలు నాకు భయం పుట్టి

స్తున్నాయి. కొరియర్‌లో బయోడేటా పంపిస్తున్నాను"

"అర్జంటుగా పంపవలసింది ఏదైనా ఉంటే అది ఫొటో, బయోడేటాకాదు. కొరియర్‌లో ఆ కాగితం పంపి డబ్బు వేస్టు చేస్తున్నావు"

"ముక్తా నువ్వు చెయ్యి జారిపోకుండా నీకు పెళ్లిచెయ్యాలి" అంటూ ఫోన్ పెట్టేసింది తల్లి.

ఆ బయోడేటానే ఈ కొరియర్‌లో వచ్చిందనుకొని ముక్త మరోసారి ఆ బయోడేటా చదివి కవరులో పెడుతూ 'ఇతగాడికి జీవితభాగస్వామి అంటే అర్థమే తెలియదు. దేశాన్ని ఎడ్మినిష్టర్ చేసేస్తున్నాడు. అమ్మాయి పిహెచ్‌డి చేస్తూ రాత్రీపగలూ రిసెర్చిలో మునిగి తేలిపోతూ ఇల్లు పట్టించుకోదు. అదే బ్యాంక్ జాబ్ అయితే అన్ని పనులూ పూర్తి చేసి తొమ్మిదింటికి ఇంటి నించి వెళ్లి సాయంకాలం ఐదింటికి ఇంటికి చేరి ఇల్లు చక్కదిద్దుతుంది. ఫస్ట్ తారీకు నాడు కొత్త నోట్ల కట్ట తీసుకొని వస్తుంది. ఇది ఈయనగారి ఈక్వేషన్' అనుకొంది.

ముక్త ఇంటికి బయలుదేరడానికి ఆటో ఎక్కింది. ఆటో సడన్ బ్రేక్‌తో ఎదురుగా వచ్చే బస్‌ని ఢీకొని ఆగింది. ముక్త సడన్ బ్రేక్‌కి ఎగిరి కాలిబాట మీద పడింది. కాలిబాటమీద దుప్పట్లు, రగ్గులు పరచుకొని వ్యాపారం సాగిస్తున్నారు. ముక్తకి గాయాలు తగలలేదు. పాదం మీద భాగం పేవ్‌మెంట్ గట్టుకి తాకి చర్మం చెక్కుకొంది. బస్‌వాణ్ణి అందరూ తిట్టేరు. ఆటోడ్రైవర్‌కీ ఏం కాలేదు. ఆటో ముందు భాగం డామేజ్ అయింది. ఆటో ఇంకొంచెం ముందుకు వెళ్లి ఉంటే డ్రైవర్, అమ్మాయి ఇద్దరూ ప్రాణాలు పోగొట్టుకొనే వారన్నారు అందరూ.

ఇంటికి చేరిన ముక్త తనలో ఏదో తెలియని శక్తి ప్రవేశించినట్టుగా ఫీలయింది.



తనని భగవంతుడు బతికించడానికే నిర్ణయించేడనుకొంది. ఈ అవకాశం తను సద్వినియోగం చేసుకోవాలనుకొంది. షవర్ తీసుకొంది. అద్దంలో మొహం చూసుకొంటూ "ఎస్. మళ్లీ యూనివర్సిటీకి వెళతాను. వేదవతిని కలుసుకొని జరిగినదంతా ఉన్నదున్నట్టు చెప్పేస్తాను. రిసెర్చికి సంబంధించిన మెటీరియల్, బుక్స్, జర్నల్సు అన్నీ తీసుకొని కేరళ వెళ్లి లూసీని కలుసుకొని సత్యంకి సహాయపడగలనేమో చూస్తాను. స్కాలర్‌షిప్ పరీక్షకి చదివి మళ్లీ రాస్తాను. నా జీవితానికో అర్థం పరమార్థం ఉందని నిరూపించుకొంటాను" అనుకొంది ముక్త.

ఇన్నాళ్లూ వేగిపోయిన మనసు ఓ నిర్ణయానికి వచ్చాక తేలికపడింది. ముక్త ఉత్సాహంగా నుదుట బొట్టు దిద్దుకొని భోజనం చేసి హాయిగా నిద్రపోయి లేచిన తర్వాత ఇంత మంచి నిద్రపోయి ఎంతకాలమైందో అనుకొంది. ఫోన్ మోగుతుంటే లేచి రిసీవర్ అందుకొంది.

"హలో"

"నేను వేదవతిని. యూనివర్సిటీ నించే మాట్లాడుతున్నాను. వారంరోజులై నీ ఫోన్ ట్రై చేస్తుంటే నువ్వు దొరకటంలేదు"

"నమస్తే మేడమ్. నేను ప్రొఫెసర్ సత్యంని చూడాలని కేరళ వెళ్లాను. ఇప్పుడు కొంత బాగున్నారు. లూసీ అన్నీ దగ్గరుండి చూసుకొంటున్నారు. మొన్ననే వచ్చాను"

"జరిగిందేదో జరిగింది. నువ్వు స్కాలర్‌షిప్ టెస్ట్‌లో పాసయ్యావు. కోలా చాలా మారిపోయారు. జరిగిన దానికి బాధపడ్డారు. నువ్వు రిసెర్చి చెయ్యాలనుకొంటే నా దగ్గర చేరు. ఒకవేళ మంగళగిరి యూనివర్సిటీకి వస్తే నువ్వు మారాలనుకొంటే ఆ స్వేచ్ఛ నీకు కల్పిస్తాను" అంది వేదవతి.

"నేను నాలుగు రోజులలో వస్తాను. మీతో అన్నీ పెర్సనల్‌గా మాట్లాడుతాను. థాంక్స్" ముక్త గొంతులో ఎంతో ఆత్మస్థైర్యం. వేదవతితో మాట్లాడడానికి ఎటువంటి సంకోచంలేదు.

ముక్త యూనివర్సిటీకి చేరుకొని వేదవతి రూంకి వెళ్లింది. వేదవతి జరిగిన సంగతులన్నీ ముక్తకి మరో మారు చెప్పింది.

ముక్త ఒక్క మూడు నెలలు టైం ఇస్తే కేరళ వెళ్లి పరిస్థితులు చూసి వీలయితే అక్కడే ఉండి సత్యంకి, లూసీకి సహాయపడాలనుకుంటున్నానని చెప్పింది. వేదవతి ఆ అమ్మాయి దృఢ సంకల్పాన్ని మెచ్చుకొంది.

ముక్త సత్యం రిసెర్చికి సంబంధించిన మెటీరియల్స్, జర్నల్సు, బుక్స్, ఫొటోలు, అన్నీ తీసుకొని కోవలం చేరుకొని ఆశ్రమానికి వెళ్లింది. సత్యం రూంలో నిద్రపోతున్నాడు. లూసీ తల స్నానం చేసి ఎండకి జుత్తు ఆరబెట్టుకొంటూ గార్డెన్‌లో తిరుగుతోంది. ముక్తని చూస్తూనే ఒక ఆత్మీయురాలిని చూసినట్టుగా ఆప్యాయంగా దగ్గరకు తీసుకొంది. ముక్త, లూసీ గార్డెన్‌లోనే కూర్చొన్నారు.

"ప్రొఫెసర్ ఎలా ఉన్నారు"

"నువ్వు లోగడ చూసినప్పటికన్నా నయం. రోజురోజుకి మార్పు కనిపిస్తోంది. కాని డాక్టర్లు అతనిమీద ఒత్తిడి తెచ్చి ఏ పనీ చేయించవద్దంటున్నారు. అతనంతట అతనే అన్నిటా ఇన్వాల్వ్ అవ్వాలంటున్నారు. పద మనమిద్దరం వెళ్లి డాక్టర్స్‌ని కలుద్దాం" అంది లూసీ.

ఇద్దరూ డాక్టర్స్ ఛాంబర్స్‌కి వచ్చారు. ముక్తని పరిచయం చేసింది లూసీ.

"ముక్త సత్యంలాంటి శాస్త్రవేత్త దేశానికి దక్కాలని తనకి వీలయిన సహాయం చెయ్యాలని వచ్చింది" అంది లూసీ.

"మీకు సబ్జక్ట్ తెలుసు కనక సహజంగా మీకు కావలసిన పుస్తకాలు, మెటీరియల్ చూసుకొంటూ మీ ఇంట్రస్టుని బట్టి ఆయన రాసిన పేపర్లు అవీ చదువుతుండండి. ఆయనంతట ఆయన ఆసక్తిగా వాటిని చదవడం, తెలుసుకోవడం జరగాలి. అసలు ఇంకో ఇద్దరు ముగ్గురు స్టూడెంట్స్ ఉండి మీలో మీరు సబ్జెక్ట్ డిస్కస్ చేసుకోవడం వాటికి సంబంధించిన స్లైడ్స్ వీడియోలాంటివి చూడ్డం జరిగితే మరింత ఉపయోగపడవచ్చు" అన్నాడు.

పవిత్రన్‌కి లూసీ ఎప్పటికప్పుడు సత్యం ఆరోగ్యం గురించి తెలియజేస్తూనే ఉంది. ముక్త సత్యం దగ్గర గతంలో పని చేసి ఇప్పుడు సోనావాలా దగ్గర పని చేస్తున్న మనోజ్‌ని వీలయితే ఓ మూడు నాలుగు రోజులు పర్మిషన్ తీసుకుని రమ్మంది. మనోజ్ కోలాతో, వేదవతితో మాట్లాడి వేదవతి స్టూడెంట్‌ని, ఇద్దరు కోలా స్టూడెంట్స్‌ని కలుపుకొని కోవలం వచ్చాడు. అంతకు ముందు రోజు ముక్త చుట్టూ పుస్తకాలు, జర్నల్సు పేర్చుకొని చదువుకొంటోంది. లూసీ కుర్చీలో కూర్చొని చూస్తోంది.

సత్యం "లూసీ! ఎవరీ ఈ అమ్మాయి" అనడిగాడు.

"ముక్త. ఇదివరకోసారి వచ్చిందికదా? మీ దగ్గర రిసెర్చి చెయ్యాలనుకొంది. ఇప్పటికీ చెయ్యాలనుకొంటోంది"

అక్కడ తనే రాసిన ఓ పుస్తకం తీసి కొంచెంసేపు చదివాడు. కిందపెట్టేశాడు. ఆలోచనలోపడ్డాడు సత్యం.

మనోజ్, మిగిలిన స్టూడెంట్స్ ముక్తతో కూర్చొని సబ్జక్ట్ చర్చిస్తుంటే తనకి తోచినదేదో చెప్పడానికి ప్రయత్నించాడు సత్యం. వీడియో చూసి అందులో వాళ్లందరూ తనకి ఫ్రెండ్స్ అనీ త్వరలో కలవాలని చెప్పాడు.

నాలుగు రోజులు గడిచాయి.

సత్యం చేసిన వర్క్ గురించి వాళ్లు మాట్లాడుతుంటే సత్యం ఈ వర్క్ మీద చాలా ఆర్టికల్స్ వచ్చాయి అవి ఏవంటూ వెతకబోయి "లూసీ ఇంటర్‌నెట్‌లో ఇవన్నీ ఉంటాయి. కంప్యూటర్ ఎక్కడ" అన్నాడు.

విద్యార్థుల మొహంలో పట్టలేని సంతోషం. లూసీ సత్యంని కంప్యూటర్ దగ్గరకు తీసుకెళ్లింది. కంప్యూటర్ సరిగా పని చెయ్యలేదు. సిస్టమ్ డౌన్‌లో ఉందని తిరిగి

వచ్చాడు.

లూసీ డాక్టర్‌కి ఈ వివరాలన్నీ చెప్పింది. డాక్టర్ ఈ స్టూడెంట్స్ అందరూ కలసి సత్యంకు ఎంతో సహాయపడ్డారని మెచ్చుకొన్నాడు. ఇంకొంచెం రోజులు పరిస్థితి గమనిస్తూ మందులు వాడాలన్నాడు.

వారం తర్వాత మిగిలిన స్టూడెంట్స్ మంగళగిరికి ఆనందోత్సాహాలతో ప్రయాణానికి సిద్ధమవుతున్నారు. ముక్త కూడా వాళ్లతో వెళ్లిపోతానంది. సత్యం స్టూడెంట్స్‌తో మాట్లాడుతూ ముక్త ఏ లైన్‌లో పని చెయ్యాలనుందో తెలుసుకొని ప్రణాళిక సిద్ధం చేయించాడు.

ముక్త, లూసీ ఆశ్రమం ముందు బీచ్‌లో నిలబడి మాట్లాడుకొంటున్నారు.

"ముక్తా! నీ సహాయం ఎప్పటికీ మరచిపోము. సత్యంకి నువ్వెంత సహాయం చేశావో తర్వాత తెలియజేస్తాను. ఇప్పుడు టైం కాదు. ఇంకా సత్యం విషయంలో నేను జాగ్రత్తపడాల్సి ఉంది" అంది లూసీ.

"సత్యంకి, నీకు సహాయపడడంలో నా ఆనందం నాది. నా సంతోషం కోసమే నేనిక్కడకి వచ్చేను. ఇందులో కృతజ్ఞతల ప్రసక్తిలేదు" అంది ముక్త.

స్టూడెంట్స్, ముక్త శెలవు తీసుకుని యూనివర్సిటీకి ప్రయాణమయ్యారు.

పవిత్రన్, విమల వచ్చి డాక్టర్లతో మాట్లాడి వాళ్ల అనుమతితో లూసీని, సత్యంని ఇంటికి తీసుకువెళ్లారు.

సత్యం, లూసీ యూనివర్సిటీకి వచ్చి అధికారులని కలుసుకొన్నారు.

సత్యం తనకి మంగళగిరి యూనివర్సిటీలో చేరడానికి అవకాశం ఇస్తే తప్పక చేరతానని, తానొక ప్రొఫెసర్‌గా స్టూడెంట్స్‌ని గైడ్ చేస్తూ రిసెర్చి చేసుకొంటూ పాఠాలు చెబుతానని డబ్బు, అధికారం మీద మోజు లేని తనలాంటి వాళ్లని ప్రలోభపెట్టి అవన్నీ చుట్టబెడితే అసలు పని ఆగిపోయి భ్రష్టి టయి, దేనికీ న్యాయం చెయ్యలేకపోవడం జరుగుతుందని స్పష్టంగా చెప్పాడు.

యూనివర్సిటీ అధికారులు ఆయన భావాలు అర్థం చేసుకొని సంతోషంగా ఆయన్ని ప్రొఫెసర్‌గా నియమించారు.

ముక్త హాస్టల్‌లో చేరడానికి వార్డెన్‌ని కలుసుకొందామని వెళ్లింది. కొత్త వార్డెన్‌ని చూసి చందనని "వరద ఏమైనట్టు?" అంది.

"వరద ఇంటర్నేషనల్ ఉమన్స్ ఆర్గనైజేషన్‌లో ఉద్యోగం వచ్చి జెనీవాకి వెళ్లిపోయారు. ఈ విద్యా వ్యవస్థలో ఉంటూ తన అభిప్రాయాలు ఆచరణలో పెట్టలేకపోతున్నానని రాజీనామా చేశారు" అంది.

ముక్త సత్యం లాబ్‌లో పనికి వెళ్లబోతూ కోలా ఆఫీస్‌కి వెళ్లింది. తన గురించి శ్రద్ధ తీసుకొని పరిశోధన చెయ్యడానికి అవకాశం కల్పించినందుకు థాంక్స్ చెప్పింది.

"నువ్వనుకొన్న పరిశోధన చేసి పేరు తెచ్చుకోవాలమ్మా" అంటూ ముక్తకి బెస్టు విషెస్ చెప్పేడు కోలా.

ఆ సాయంకాలం ముక్త రోబోట్ సెంటర్‌కి వచ్చింది. పరిచయమున్న స్నేహితులు "పట్టుదలంటే నీదే ముక్తా" అన్నారు.

ముక్త థాంక్స్ చెప్పింది.

ముక్త రోబోట్ బొమ్మకేసి చూసింది. జరిగిన వాటితో తనకే సంబంధం లేనట్టుగా నిశ్చలంగా ఉంది రోబోట్ బొమ్మ. "శాస్త్రవిజ్ఞానం దినదినాభివృద్ధి చెందుతోంది. రోబోట్స్‌ను తయారుచేసి అంతరిక్షానికి తీసుకుపోతాం" అంది ముక్త రోబోట్ బొమ్మతో. సన్నగా చినుకులు మొదలయ్యాయి.

★ ★ ★

ముక్త మేనమామ ప్రసాద్ అమెరికా నించి వచ్చాడు. ముక్త తల్లిదండ్రులు గుర్నాథం, జయంతి ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళి రిసీవ్ చేసుకొన్నారు.

"నమస్కారం బావగారూ, అక్కా! ముక్త ఏది" అనడిగేడు అతను.

"పద తోవలో మాట్లాడుకొందురుగాని" అన్నాడు గుర్నాథం.

కారు బయల్దేరింది.

"ఆ చెప్పు అక్కా. బావగారు నా మాటలకి బ్రేక్ వేశారు కద. ముక్త ఏది? రిజర్వ్‌బ్యాంక్‌లో జాబ్‌చేస్తోందన్నావు కద. మీతోపాటు ఎయిర్ పోర్ట్‌కి వస్తుందనుకొన్నాను"

"ఇంకెక్కడి ముక్త. రిజర్వ్‌బ్యాంక్ ఉద్యోగం, మంచి పెళ్ళి సంబంధం, అన్నీ ఎడంకాలితో తన్ని మళ్ళీ ఆ యూనివర్సిటీకి వెళ్ళిపోయింది. మాతో ఒక్కమాటైనా చెప్పలేదు. తెలిస్తే నేనా ఉద్యోగం వదులుకోడానికి ఒప్పుకొనేదాన్ని కాదు"

"ఓ హౌవండ్రఫుల్ షి ఈజ్, నా మేనకోడలికి మేనమామ పోలికలు వచ్చాయి. ముక్తకి రోజూ అక్కడి డబ్బు గోల చూసి, బ్యాంక్ ఉద్యోగం విసుగొచ్చి ఉంటుంది"

"ఒకే ఒక నెల పని చేసింది"

"ముక్త పరిశోధన చేసి ఓ గొప్ప ప్రొఫెసర్ అవుతుంది చూస్తూండు"

"ఏం పరిశోధనో. పదేళ్ళుగా నువ్వు చేస్తున్నదేమిటి"

"అది నీకు సర్ప్రైజ్ చేద్దామని ముందుగా చెప్పలేదు. నన్ను యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా నెల్రక్రితమే పిలిచి మరీ నియమించారు. ఈ ప్రపంచంలో ఒక్క ప్రొఫెసర్స్ మాత్రమే వాళ్ళకి నచ్చిన పని చేసుకొంటూ, జీతం కూడా సంపాదిస్తారు. ఒక విలక్షణమైన వృత్తి ఇది. "మా కిష్టమైన పని మేం చేస్తాం, బతకడానికి డబ్బివ్వండ"ంటే వేరే ఏ వృత్తిలోనైనా సాధ్యమవుతుందా? ఆ స్వేచ్ఛ ఈ వృత్తికే దక్కింది. ధనకాంక్ష, పదవీవ్యామోహం ఉన్నవాళ్ళు ప్రొఫెసర్ ఉద్యోగానికి అర్హులు కారు. ఆ రెండూ కావాలనుకొనేవాళ్ళు ప్రొఫెసర్స్‌గా విశ్వవిద్యాలయాలలోకి అడుగుపెట్టినప్పుడే వాతావరణం కలుషితమవుతుంటుంది"

"అంటే నీ ఉద్దేశ్యం ప్రొఫెసర్లు సన్యాసుల్లా బతకాలనా"

"మీరు తప్పుగా అర్థంచేసుకొంటున్నారు. కొంత ధనం, పదవీ వద్దన్నా దక్కుతాయి. కాని అవే ముఖ్యం అనుకొంటే ఎన్నో రకాల వృత్తులు ఉన్నాయి. వాటినే ఎన్నుకోవచ్చు కదా. ఈ ప్రొఫెసర్ ఉద్యోగం ఎందుకు"

మళ్ళీ ప్రసాదే, "చూడు! బావగారు ఆఫీసర్. మీ ఇంట్లో ఎప్పుడూ నలుగురు పనివాళ్ళు, రెండు ఫోన్లు- ఒకట్టైనా పనిచెయ్యక పోతుందా అని గవర్నమెంటువారి ఆలోచన కాబోలు. సరే బావగారిని ఆఫీసుకు తీసుకువెళ్ళడానికి కారు, సలాం కొడుతూ డ్రైవర్, ఎక్కడి కెళ్ళాలన్నా రైల్వే పాస్‌లు, ఎన్ని రాయితీలో!

ఒక్క ప్రొఫెసర్ 'నేనిక్కడ పాఠంచెబుతున్నాను కదా! నా కొడుక్కో, కూతురికో సీటు ఇవ్వండి' అని అడుగుతాడా? పైగా మా యూనివర్సిటీలో మా వాడికి సీటు దొరకడం కష్టం అంటాడు. ఎప్పుడూ మెరిట్‌కి పట్టంగట్టాలని చూస్తాడు.

"బావగారు సర్వీస్ చేసి రిటైర్ అయ్యారు. ఆ రైల్వే రణగొణధ్వనులు, రైలు లేటు, ఏక్సిడెంట్, ఇవే ఆయనకి మిగిలే తీపి గుర్తులు. ఒక్కడు "నేను మీకు గుర్తున్నానా? " అని వస్తాడా?

"అక్కా పరిశోధనలో నిమగ్నుడైన ప్రొఫెసర్ బతికినంతకాలం జీవించే ఉంటాడు"

"మీ బావగారికి కోపంవస్తే నిన్ను మధ్యలోనే దింపెయ్యగలరు జాగ్రత్త"

"అనుకోనీ, కాకిపిల్ల కాకికి ముద్దు. కాని ప్రసాద్ మాటలు అక్షరసత్యాలు జయంతీ" అన్నాడు గురునాథం.

"రెండురోజులాగి ముక్తని చూడ్డానికి వాళ్ళ యూనివర్సిటీకి వెళ్ళి, ముక్త తీసుకొన్న నిర్ణయానికి అభినందించి వస్తాను" అన్నాడు ప్రసాద్. ఆ తల్లిదండ్రుల కళ్ళు వెలిగాయి! ☆

# చతుర ప్రపంచం

## కొత్త కంప్యూటర్లొస్తున్నాయోచ్!

ఇంటర్‌నెట్ యుగంలో మనం ఇంకా మొదటి మెట్టులోనే ఉన్నాం. కంప్యూటర్‌ని మానవుడు ఇంకా పరిపూర్ణంగా వినియోగించుకోవడం లేదు. మానవుని భౌతిక అవసరాలకి సరిపోయే విధంగా కంప్యూటర్లని అభివృద్ధి చేస్తున్నారు శాస్త్రజ్ఞులు. కంప్యూటర్లు భవిష్యత్తులో ఎలా ఉపయోగపడతాయో తెలుసుకుంటే




నమ్మలేక ఆశ్చర్యమనిపిస్తుంది. ముందు ముందు మనం వాడే అన్ని వస్తువులూ కంప్యూటర్‌కి అనుసంధానమై ఉంటాయి.

ఉదయం అయిదున్నరకి కాఫీ పెర్కలేటర్ తనంతటతనే ఆన్ అవుతుంది. అయి దూముప్పావుకి అలారంబెల్ కొడుతుంది. లేవకపోతే మళ్లీ ఆరింటికి గట్టిగా విజిల్ వేస్తుంది. ఆ ఇంటి యజమాని నిద్రలేచేసరికి ఆ విధంగా కాఫీ రెడీగా ఉంటుంది. మరో అయిదునిమిషాల్లో కిటికీ తెరలన్నీ పక్కకి వాటంతటవే తొలగుతాయి. ఈలోగా ఫ్రిజ్ తనలోని మిల్క్‌పాకెట్ల మీది ఎక్స్‌పైరీ డేట్లని చదివి, ఏది ముందు వాడాలో నిర్ణయిస్తుంది. ఆ పాకెట్ దగ్గర లైటు వెలుగుతుంది ముందు అది వాడాలన్న సూచనగా. అలాగే ఆరోజుకి సరిపడగా లేని కూరగాయలు, ఇతర వస్తువులని ఫ్రిజ్ ఇ-మెయిల్ ద్వారా దగ్గరలో ఉన్న సూపర్‌బజార్‌కి ఆర్డర్ చేస్తుంది.

ఆ ఇంటి యజమాని బాత్‌రూమ్‌లో

అద్దం ముందు నిలబడి పళ్లు బ్రష్ చేసుకుంటుంటే ఆ అద్దంమీద ఆరోజు పేపర్లోని వార్తల హెడ్‌లైన్లు కనిపిస్తాయి.

ఆయన ఆఫీసుకు బయలుదేరబోయే ముందు వేసుకున్న కోటులోని కంప్యూటర్ ఆయన బయటకడుగుపెట్టగానే ఆ ఇంటి తలుపులన్నీ మూసేసి తాళాలు వేసి, కారు షెడ్ తలుపును తెరుస్తుంది. వెంటనే కారు డోర్ కూడా తెరుచుకుంటుంది. ఆయన వెనక సీట్లో విశ్రాంతిగా కూర్చున్నాక కారు బయటకు వస్తుంది. మ్యాన్యువల్‌గా డ్రయివ్ చేయాల్సిన అవసరం లేదు. కారు ఇంటర్‌నెట్ కి కనెక్టయి ఆఫీసుకు వెళ్లే మార్గంలోని ట్రాఫిక్ గురించి ఏచోట ఏకారు ఎంత వేగంతో వెళ్తోందో నమోదు చేసుకుని ఆ ప్రకారం వేగాన్ని పెంచుకుంటూ, తగ్గించుకుంటూ ఆఫీసుకుచేరుకుంటుంది. ఒకవేళ ఆఫీసుకు కాక ఇంకోచోటకి వెళ్లాలనుకుంటే కారు యజమాని తన చేతిలోని పామ్‌టాప్ కంప్యూటర్‌కి సూచనలిస్తే చాలు.

ఈ లోగా ఇంట్లోని డిష్‌వాషర్ డైనింగ్ టేబిల్ మీది గిన్నెలని కడిగేసి బోర్లిస్తుంది. పిల్లల్ని స్కూలుకి పంపాల్సిన అవసరం లేనినాడు ఇంట్లోని అలారం క్లాక్ ఒకగంట ఆలస్యంగా మోగుతుంది. లేదా బయట వర్షం పడుతున్నప్పుడు ఇంట్లోని ఏ వస్తువు పాడయినా అదే దాని సర్వీస్ స్టేషన్‌కి ఫోన్ చేసో, ఇ-మెయిల్ ద్వారానో ఆ విషయాన్ని తెలియచేస్తుంది. అతను ఇంటికి వెళ్లేలోగా దాని రిపేర్ జరిగిపోతుంది. ఆ సంగతి అతని బ్యాంక్ స్టేట్‌మెంట్ చూశాక తెలుస్తుంది.

ఆ రిపేర్ కూడా మనుషుల ప్రయత్నం లేకుండా రిమోట్ గా జరిగిపోతుంది. పూర్వం ఎలక్ట్రిక్ మోటార్లు, వాటితో నడిచే ఫ్యాన్లు, మిక్సీలు, కుట్టుయంత్రాల్లాంటివి విడివిడిగా అమ్మేవారు. ఇప్పుడు ఆ రెండూ కలిపి అమ్ముతున్నారు. ఇదే విధంగా కొంతకాలానికి కంప్యూటర్లు, ఇంటి పరికరాలు రెండూ కలిపి అమ్ముతారు. ఇప్పుడు మనిషి చేసే పనిని అవసరాన్ని బట్టి అప్పుడు ఆ పనికి సంబంధించిన కంప్యూటర్లే చేసేస్తాయి.

## టమాటోతో యుద్ధం

మన వంటగదిలోకి కొత్తగా వచ్చి చేరిన కూరగాయ టమాటో. దీన్ని మొదటగా ఇండియాకి 1822లో ఈస్టిండియా కంపెనీ సౌత్ అమెరికానుంచి తెచ్చింది. ఏటా ఇప్పుడు ఇండియాలో 60 లక్షల టన్నుల టమాటోలు పండుతున్నాయి. కర్నాటక, యు.పి, హర్యానా, పంజాబ్, మహారాష్ట్ర రాష్ట్రాలు టమాటో సాగుబడిలో ప్రథమస్థానంలో ఉన్నాయి.

టమాటో మెక్సికోకు చెందింది. ఇక్కడి నుంచే ప్రపంచమంతా ఈ పంట వ్యాప్తి చెందింది. వైల్డ్‌చెర్రి టమాటో జాతికి చెందినది. చాలాకాలం ఈ పళ్లని తింటే మరణిస్తారని నమ్మి అక్కడి ప్రజలు తినేవారు కాదు. ఇందుకు కారణం దీని ఆకులు తిన్న పశువులు అనారోగ్యం పాలవడమే. దీని ఆకుల్లో టాక్సిన్ అధికంగా ఉంటుంది. అయితే టమాటోలు ఆరోగ్యకరమేనని ఆలశ్యంగానైనా 1520 లో స్పెయిన్‌వారు కనుగొన్నారు. దీంట్లో పసుపు రంగు టమాటోలు కూడా ఉంటాయి. స్పెయిన్, ఇటలీ, నార్త్‌ఆఫ్రికా, మిడిలీస్ట్‌లకిది క్రమంగా వ్యాప్తి చెందింది. దీన్ని తినే నావికులకి స్కర్వీ వ్యాధి రాదు కాబట్టి ఓడల్లో కూడా దీన్ని పెంచేవారు. ఇందులో పుష్కలంగా 'సి' విటమిన్ ఉంటుంది. నేడు విదేశాల్లో అపార్ట్‌మెంట్ కిటికీల్లోని ఫ్లవర్‌పాట్స్‌లలో కూడా దీన్ని పెంచుతున్నారు.

1989లో అమెరికన్ బయోలజిస్ట్ అత్‌నాసియోస్ హైబ్రీడ్ టమాటోలని సృష్టిం

చాడు. మనదేశంలో బెంగుళూరులో దీన్ని పండిస్తున్నారు. దీని తొక్క దళసరిగా ఉండి రవాణాలో పళ్లు నలగకపోవడంతో పాటు పండు పెద్దదిగా ఉంటుంది. ప్రస్తుతం దీని రుచిని పెంచే పరిశోధనలు జరుగుతున్నాయి. అలాగే పండే కాలాన్ని కూడా పెంచడానికి కృషి చేస్తున్నారు. ఇందువల్ల రవాణాలో పండి పాడవకుండా ఉంటాయి.

టమాటో ప్రోస్టేట్ క్యాన్సర్ని నివారిస్తుందని శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. అందుకే దీన్ని సలాడ్లలో వాడుతుంటారు. ఇళ్లల్లో పెంచే కూరగాయల్లో టమాటో మూడవ స్థానంలో ఉంది. మట్టిపోసిన చెక్కపెట్టెల్లో వాటిని తేలిగ్గా పెంచవచ్చు




ప్రతి ఆగస్ట్లో స్పెయిన్లో 'లాటమోటినా' అనే పండుగ జరుపుకుంటారు. లక్షా పాతికవేల కిలోల టమాటోలని బునోల్ అనే నగర వీధుల్లో డంప్ చేస్తారు. మనుషులు చేతికందిన పళ్లని తీసుకుని ఎదుటివాళ్లమీదికి విసురుతారు. ఈ విధంగా ప్రపంచంలో 'టమాటోలతో యుద్ధం' జరుగుతుందక్కడ. పెద్దలంతా పిల్లలుగా మారతారారోజు ఈ పండుగ 55 ఏళ్ల క్రితం పుట్టింది. ఫ్రాన్సిస్కోఫ్రాంకో డిక్టేటర్గా ఉండగా అతని మీద ఉన్న అసంతృప్తిని ప్రభుత్వ కార్యాలయాలమీద టమాటోలని విసిరి తీర్చుకునేవారు.

అటుపైన ఇది ఓ పండుగగా రూపుదిద్దుకుంది. ఇది అయ్యాక ఫైరింజన్లతో సిటీ మొత్తాన్ని కడిగేస్తారు.

టమాటో పెంపకానికి సలహాలిచ్చే వెబ్సైట్లు అనేకం ఉన్నాయి.

★

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!






ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.




**priya**

**Pickles**

**ఏ పచ్చడంటే ఆ పచ్చడి సంసిద్ధ**

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482.